# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✱ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

------ కూపన్ ------

మే చతుర నవల 'కరగనికల'

సమీక్షకుని పేరు : ..........

చిరునామా : ..........

..........

..........

..........



# రచయితలకు సూచనలు

ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/– పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్యపూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకోగల నవలలకు వేదిక 'చతుర'

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచంవంటి శీర్షికలుకాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. 'చతుర'లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదు గనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35 వేలపదాలకు తక్కువ కాకుండా ఉండాలి. వ్రాతప్రతిలో వారివారి దస్తూరీనిబట్టి, ఒక పేజీకి ఎన్ని పదాలు వస్తున్నాయనేదానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది ప్లాన్ వేసుకోవటం అవసరం.

★ ఈ లెక్కప్రకారం 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చేపక్షంలో, అందుకు అభ్యంతరం లేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏనెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడుతుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482




నిగనిగలాడే కండలతో 'బస్తీమే సవాల్' అంటున్న జాయ్‌డాబ్సన్.

# బాడీ బిల్డరు కళాకారిణి!

వ్యాయామానికీ, వయొలిన్ వాదనకీ అసలు పొంతనే లేదు. మొదటిది కొండల్ని పిండి చేసే కండబలాన్ని సమకూర్చేదైతే, రెండవది మనస్సును స్పందింపజేసే సంగీత రసప్రపంచంలో డోలలూగించేది. ఏమాత్రం జతకలవని ఈ రెండు కళల్లోనూ తన నైపుణ్యాన్ని ప్రదర్శించి 'శభాష్' అన్పించుకుంటోంది ఆస్ట్రేలియాకు చెందిన జాయ్‌డాబ్సన్.

ఆడవాళ్ళు 'బాడీబిల్డర్స్'గా రంగంలోకి దిగడమే అరుదు. అయితే అలాంటి క్లిష్టమైన 'ఆర్టు'ని పట్టుదలతో అభ్యసించి 'మిస్ నదరన్ హెమిస్ఫేర్' టైటిల్‌ని సాధించుకున్న డాబ్సన్ ఛాతీ 104 సెంటీమీటర్లట. కానీ నడుంమాత్రం 63.5 సెంటీమీటర్లేనట! ఆమె పురుషులతో సమంగా బరువులెత్తడం, ఇంకా ఇతరత్రా ఎక్సర్‌సైజులు చేయడం చూసి 'జిమ్'లోని 'కోచ్'లు నోళ్ళు వెళ్లబెడుతున్నారు. దృఢమైన ఉక్కుముక్కల్లాంటి కండరాలతో ఇనుపతీగెలవంటి నరాలతో 'ఆడ హెర్క్యులస్'లా ఆమె 'జిమ్'లో అటూ ఇటూ తిరుగుతుంటే కండలు పెంచుకున్న మగమహారాజులు కళవళపడిపోతున్నారట.

ఆడ ఫహిల్వాన్‌లా 'రఫ్'గా కన్పించినా, వయొలిన్ చేతబట్టిందంటే చాలు ఇనుపముక్కల్లాంటి డాబ్సన్ చేతివేళ్ళు కుసుమకోమలాలైపోతాయి. అందుకే అంత కమ్మటి సంగీతం ఆవిర్భవిస్తుంది. రసజ్ఞుల్ని రసమయలోకాల్లో విహరింపచేస్తుంది.

"తొలిదశలో సంగీతం నాకు చాలా కష్టమన్పించేది. ముఖ్యంగా నా చేతివేళ్ళలో మృదుత్వంలేని కారణంగానే వయొలిన్ అపస్వరాలు పలుకుతోందని భ్రమించేదాన్ని. అయితే పట్టుదలతో కృషిచేయడంవల్ల నాకీ విద్య పట్టుబడింది. వయొలిన్ వాదనం ఎంత తేలికో అని ఇప్పుడు అన్పిస్తోంది" అంటూ చిరునవ్వులు చిందిస్తుంది డాబ్సన్.

"నాకు సంగీతం, బాడీబిల్డింగ్ రెండూ రెండు కళ్ళలాంటివి. ఈ రెంటిని నేను అన్నింటికంటే అధికంగా, అపరిమితంగా ప్రేమిస్తాను" అని చెప్పే డాబ్సన్‌ను సంగీత కళాకారులూ, బాడీబిల్డర్సూ కూడా అభిమానంగా 'అమెజాన్' అని ముద్దుగా పిల్చుకుంటారు. ఆమె త్వరలోనే ప్రపంచ హెవీ వెయిట్ లిఫ్టింగ్ ఛాంపియన్ కాగలదని క్రీడా రంగంలోని పెద్దలు జోస్యం చెబుతున్నారు.



"కండబలమూ, కసరత్తులే కాదు కమ్మని సంగీతమూ విన్పిస్తా"

# చతుర కతలు

## ఇరవైరూపాయల నోటు

**ఆ**నోటువంక మరోసారి చూశాడు అప్పారావు. అతడా నోటును మార్చాలని దాదాపు పదిరోజుల్నించీ చూస్తూనేఉన్నాడు. సరిగా గుర్తురావడంలేదుగానీ ఎవడో తనకు టోపీవేసి ఆ సగం చిరిగిన ఇరవై నోటును తనకంటగట్టాడు. మడతపెడితే చూసేవాళ్లకది మంచినోటులాగే కన్పిస్తుంది. మడత విప్పితేనే అసలుపేచీ!

కూడా అతని ప్రయత్నం ఫలించలేదు.

ఆనందరావనే స్నేహితుడి సలహామీద ఓ బాంక్‌కి వెళ్లి అడిగిచూశాడు అప్పారావు. వాళ్లూ వీలుకాదు పొమ్మన్నారు. రిజర్వ్ బాంకుకు పంపితే తిరిగి ఎన్నాళ్లకొస్తుందో చెప్పలేమని చేతులు దులిపేసుకున్నారు వాళ్లు. అప్పారావుకేంచేయాలో పాలుబోలేదు. అసలే నెలాఖరురోజులు. "పంచదార, కాఫీ పొడి ఈ పూటతో నిండుకున్నాయి. సాయంత్రం తెప్పిస్తేనే రేప్పొద్దుటికి కాఫీ..."



ఎన్నోచోట్ల దాన్ని మార్చాలని విశ్వప్రయత్నం చేశాడు అప్పారావు. ఫలితం శూన్యం. మడత విప్పి చూసి ప్రతివాడూ పెదవి విరిచేస్తున్నాడు. మరికొందరేమో "నాకే టోపీవేద్దామనుకున్నావా నాయనా?" అన్నట్లు పరిహాసంగా చూశారు. చివరకు రద్దీగాఉన్న సిన్మాహాల్లో

అని ఉదయం శ్రీమతిగారిచ్చిన వార్నింగ్ అతని చెవుల్లో ఇంకా ప్రతిధ్వనిస్తూనేఉంది.

ఎలాగైనా దీన్ని మార్చాల్సిందే అనుకున్నాడు అప్పారావు పట్టుదలగా. కారణం అతని జేబులో ఆ ఇరవైనోటు, ఏదో కొంచెం చిల్లరమాత్రమే ఉన్నాయి. అదీగాక ఎవడో గన్నాయ్‌గా

కవర్‌పేజీ ఫొటోగ్రాఫర్: కె.భాస్కర్

డు తెలివిగా దాన్ని తనకు అంటగట్టగలిగిన ప్పుడు తనుమాత్రం ఆ పనిచేయలేకపోవడం తన తెలివితేటలకే అవమానమనుకున్నాడత ను.

అలా ఆలోచించుకుంటూ బస్‌స్టాండ్‌లోకి వెళ్లాడు అప్పారావు. కాంటిన్‌లో టీ తాగి ఇరవై నోటు యివ్వబోతే "అర్ధరూపాయి టీకి ఇరవై రూపాయల చిల్లరా?" అంటూ దాన్ని తీస్కో కుండానే తాడెత్తున లేచాడు కాంటిన్‌వాడు. చేసేదిలేక నోటు జేబులో ఉంచుకొని చిల్లరనా ణాలు లెక్కపెట్టి అర్ధరూపాయి ఇచ్చేశాడు అప్పారావు. అదేసమయంలో ఓ సూట్‌వాలా బిల్ చెల్లించడానికి కౌంటర్ దగ్గరకు వచ్చా డు. అతని పర్సులో చిల్లరనోట్లు దొంతర్లు దొంతర్లుగా ఉండడంచూసి అప్పారావు కళ్లు మిలమిల మెరిశాయి.

ఆ వ్యక్తి బయటకొచ్చి సూట్‌కేస్ కిందపెట్టి సిగరెట్ వెలిగించుకున్నాడు. అతని వాలకం చూస్తుంటే బస్‌కోసం వెయిట్‌చేస్తున్నవాడిలా కన్పించింది. అప్పారావు మెల్లగా అతన్నిసమీ పించి, "ఇఫ్ యూ డోన్ట్‌మైండ్... ఓ ట్వంటీ ఛేంజ్ యిస్తారా?" అన్నాడు అతి వినయంగా.

అతనేం మాట్లాడలేదు. హుందాగా సిగరెట్ పొగ వదుల్తూ అప్పారావిచ్చిన నోటు అలాగే పర్సులో పెట్టేసుకొని ఫెళఫెళలాడే రెండు కొత్త పదిరూపాయల నోట్లు అతని చేతిలో పెట్టాడు. థాంక్స్ చెప్పి అక్కడే ఉంటే మళ్లీ అతను నోటు చూసుకునే ప్రమాదం ఉందని వడివ డిగా నడుచుకుంటూ యింటికి చేరుకున్నాడు అప్పారావు.

ఆ సాయంత్రం పంచదార, కాఫీపొడి తేవ డంకోసం పచారికొట్టుకు వెళ్లిన అప్పారావు కొడుకు గంటకుగానీ తిరిగి రాలేదు. అతని వెంట ఇద్దరు పోలీసులు...! "నీకు దొంగనోట్లు యిచ్చి మార్చమన్న పెద్దమనిషి వీడేనా?" అంటూ సమాధానంకోసం చూడకుండానే వాళ్లి ద్దరూ అప్పారావును చెరొక రెక్కా పుచ్చుకొని స్టేషన్‌కి ఈడ్చుకుపోయారు.

-ప్రతాపచంద్ర

---

## ఇచ్చుట అంతా క్షేమం!

"ప్రియమైన నాన్నగారికి,
రాంబాబు వ్రాయునది!

ఉదయం తొమ్మిది గంటలకు ఎ.పి.ఎక్స్ ప్రెస్ రాజధాని చేరుకుంది. ఆటో మాట్లాడు కుని నరాసరి ఎ.పి.భవన్ వెళ్లాను. ముందే ఉత్తర్వులు వెళ్ళాయి కాబట్టి ఇబ్బంది లేకుండా ఎ.పి.భవన్‌లో రూమ్ దొరికింది.

ఎ.పి.భవన్‌కు చేరుకున్నాక ఢిల్లీలో ఉన్న ట్లు లేదు. ఏ విజయవాడలోనో, ఏలూరులోనో వున్నట్లు వుంది. అక్కడ అంతా మనవాళ్లే!

చూడముచ్చటగా నంది విగ్రహం అక్క డకు వచ్చినవాళ్లకు స్వాగతం చెబుతూ కన్పించింది.

మన హైద్రాబాద్ పాతబస్తీలాగానే ఇక్కడ పాతఢిల్లీ ఇరుకు సందులతో, కిక్కిరిసిన జనన ముద్రంతో వుంటుంది. కొత్తఢిల్లీలో సువిశాల మైన రోడ్లు, ఇంద్రభవనాలు! ఎటుచూసినా లంకంత కొంపలు... ఆ ఇళ్లలో మనుష్యులు వున్నట్లే వుండరు.

పాలికా బజారుకు వెళ్ళాను. ఆ మార్కెట్ అంతా భూగర్భంలోనే వుంది. పెద్ద షాపింగ్ కాంప్లెక్స్ అది.

అక్కడ కొన్ని వస్తువులన్నీ జిప్ బ్యాగులో వేసుకుని సిటీ బస్సు ఎక్కాను.

సిటీ బస్సుల్లో జనం మామూలే. ఢిల్లీ వెళ్ళి నా, బొంబాయి వెళ్లినా నిలబడటానికి చోటు వుండదు సిటీ బస్సుల్లో.

'ఇండియాగేటు' దగ్గరకు రాగానే బస్సు దిగి మెల్లగా నడుచుకుంటూ ఎ.పి.భవన్‌వైపు బయల్దేరాను.

కొంచెం దూరం నడిచేక అడుగు ముందుకు పడలేదు. గుండెలు దడదడ కొట్టు కున్నాయి.

బస్సులో ఎయిర్‌బ్యాగ్ మర్చిపోయాను.

ఆ బ్యాగ్‌లో కొనుక్కున్న వస్తువులే కాకుండా



నా డైరీ, పర్సు కూడా వున్నాయి. హైద్రాబాద్ రిటర్న్ జర్నీ టిక్కెట్టు కూడా డైరీలోనే వుంది. పిక్‌పాకెట్‌గాళ్ళు కొట్టేస్తారేమోనని అన్నీ అందులోనే ఉంచాను.

'బస్ డిపోకు వెళితే పోయిన బ్యాగ్ దొరుకుతుందేమో' అనుకుంటూ మళ్ళీ తిరిగి ఇండియా గేటువైపు నడిచేను.

కొంచెం దూరంలో ఓ బస్సు చుట్టూ జనం మూగివుండటం గమనించేను. పరుగెత్తుకుంటూ దగ్గరికెళ్ళి చూస్తే ఆ బస్సు నేను ఎక్కి దిగిన బస్సే.

అప్పటికే పోలీసులు కూడా చేరారు అక్కడ.

బస్సులో నా బ్యాగ్ వుందేమో చూద్దామని బస్సు ఎక్కడానికి ముందుకు వెళితే పోలీసులు నన్ను వెనక్కు నెట్టేశారు.

పచ్చ జీప్‌లో స్పెషల్ పోలీస్ స్క్వాడ్ దిగింది. శక్తివంతమైన బాంబులను నిర్వీర్యంచేసే నిపుణులు కూడా వచ్చేశారు.

సర్కిల్ ఇనస్పెక్టర్ బస్సు ఎక్కి ఓ బ్యాగ్ కిందకు తీసుకువచ్చేడు అతి జాగ్రత్తగా. ఆ బ్యాగ్ నా పోయిన బ్యాగే.

''అది నా బ్యాగ్... దట్ బ్యాగ్ యీజ్‌మైన్'' గట్టిగా అరిచేను. నా కేకలు ఎవరూ పట్టించుకోలేదు.

టైంబాంబు నిపుణులు బ్యాగ్ అంతా వెతికారు. ఫ్యాన్సీ ఆర్టికల్స్, డైరీ, పర్సు తప్పితే అందులో టైంబాంబు లేదు.

చుట్టూ చేరిన జనంలో టెన్షన్ తగ్గింది. కొంతమంది నవ్వుమొహాలతో, మరికొంతమంది ఆ బ్యాగ్‌లో బాంబు వున్నట్లయితే రసపట్టుగా వుండేదని క్లైమాక్సులేని సినిమా చూసి వెళ్తున్నట్లు ఏదో వెలితినిండిన మనసులతో అక్కడనుంచి జారుకున్నారు.

ఆ బ్యాగ్ నాదేనని సర్కిల్ ఇన్స్‌పెక్టర్‌కు చెప్పాను. వివరాలడిగి డైరీలో నా పేరు,





పర్సులో నా మొహం వున్న ఫొటో చూసి బ్యాగ్ తిరిగి యిచ్చేసేడు. 'వెధవమొహం వేసుకుని బస్సుల్లో బ్యాగ్ పారేసుకోబోకు' అన్నట్లున్నాయి అతని చూపులు.

ఢిల్లీలోవున్న ఓ మిత్రుడికి ఈ విషయం చెపితే - అతనన్నాడు-

"ఢిల్లీలో బ్యాగ్‌లు, ట్రాన్సిస్టర్స్ ఎవరన్నా పొరపాటున మర్చిపోయినా ఎవ్వరూ వాటిని ముట్టుకోరు. అందులో బాంబు వుంటుందని భయం... నడిరోడ్డుమీద బ్యాగ్ పడేసి కన్యాకుమారి వెళ్లినా తిరిగొచ్చేదాకా ఆ బ్యాగ్ అక్కడే వుంటుంది" అన్నాడు నవ్వుతూ.

మరో వారం రోజుల్లో తిరిగి వచ్చేస్తున్నాను.

ఇట్లు

రాబాంబు

...తప్పు రాశాను... సారీ డాడీ... రాంబాబు...

అలపర్తి రామకృష్ణ

---

## మేధావి

ఒకమాంచి డిటెక్టివ్ నవల రాసి గొప్పపేరు తెచ్చుకోవాలని పాపారావుకి మాచెడ్డకోరిక. ఎంత ఆలోచించినా కొత్త సబ్జెక్టు తట్టిచావడంలేదు. అతనికి హఠాత్తుగా గూఢచారి గుర్నాథం గుర్తుకొచ్చాడు. ప్రత్యక్షంగా చూడకపోయినా అతని సాహసకృత్యాల గురించి, మేధాసంపత్తి గురించి పదేపదే విని ఉండడంవల్ల, అతనివద్ద కొత్త సబ్జెక్టు ఏదైనా దొరక్కపోతుందా



అని అతని వద్దకు పరుగుతీశాడు పాపారావు.

గుర్నాథం మరీ అంత ఖరీదుగాని ఓ అరంతస్తుల హోటల్ రూమ్‌లో ఉంటున్నాడు. చుట్టూ సిన్మాల్లోలాగా అందమైన అమ్మాయిలు ఫోన్లు పట్టుకొనీ, డ్రింక్స్ అందిస్తూనూ అతనికి పరిచర్యలు చేస్తుంటారని ఊహించుకొన్న పాపారావు అతని రూమ్‌లోకి అడుగుపెడుతూనే నిరుత్సాహపడ్డాడు. కారణం గుర్నాథం తప్ప మరెవ్వరూ లేరక్కడ. అతను కూడా చాలా సాదాసీదాగా కన్పించాడు.

పాపారావు ముఖకవళికలను చూడ్డంతోనే విషయమంతా గ్రహించేశాడు గుర్నాథం. ఎలాగైనా సరే అతనిలో ఉత్సాహాన్ని రేకెత్తించాలని గ్రౌండ్ ఫ్లోర్‌లో ఉన్న బార్‌కి తీసుకుపోయి ఆ కబుర్లూ ఈ కబుర్లూ చెప్పాడు. ఫలితంగా పది నిముషాల్లో తిరిగి హుషారైపోయాడు పాపారావు. తనొచ్చిన పని గురించి గుర్నాథంతో చెప్పేశాడు.

తన దగ్గర కొన్ని సీక్రెట్ డాక్యుమెంట్స్ ఉన్నాయనీ, వాటి ఆధారంగా నవలరాస్తే సూపర్‌హిట్ అవుతుందనీ అన్నాడు గుర్నాథం. పాపారావు పరమానంద భరితుడైపోయాడు. ఆ డాక్యుమెంట్స్ చూడ్డానికి తిరిగి గుర్నాథంతో కలిసి అతని రూమ్‌కి బయలుదేరి వెళ్లాడతను.

కానీ ఆ సీక్రెట్ డాక్యుమెంట్స్ కోసమే తన గదిలో ఓ శత్రువు పొంచి ఉన్నాడని గూఢచారి గుర్నాథం ఊహించలేకపోయాడు.

రూమ్‌లోకి అడుగుపెట్టి లైట్ ఆన్ చేసిన గుర్నాథం తన ఎదురుగా నిలబడ్డ వ్యక్తిని చూసి ఖంగుతిన్నాడు. నిగనిగలాడుతున్న రివాల్వర్‌ని గురిపెట్టి వికటంగా నవ్వుతున్నాడా వ్యక్తి. అతని పేరు మూర్తి. వృత్తిరీత్యా చిరకాలంగా వాళ్లిద్దరూ ఒకరికొకరు 'పక్కలో బల్లెం'లా మసులుకుంటున్నారు.

"మర్యాదగా నీ దగ్గరున్న ఆ సీక్రెట్ డాక్యుమెంట్స్ నాకిచ్చావా సరి... లేదంటే..." రివాల్వర్‌ని ఊపుతూ బెదిరించాడు మూర్తి.

తన మాస్టర్ మైండ్‌ని ఎలా ఉపయోగించడమా అని ఆలోచిస్తున్న గూఢచారి గుర్నాథం దృష్టి సడన్‌గా తన గదికి ఉన్న ఒకే ఒక్క కిటికీపై పడింది. వెంటనే మూర్తివైపు తిరిగి, "మిత్రమా నువ్వు ఆ కిటికీ క్రింది బాల్కనీ లోంచే నా రూమ్‌లోకి ప్రవేశించావుగదూ? ఈ హోటల్ మేనేజిమెంట్‌కి ఇప్పటికి లక్షసార్లు చెప్పాను ఆ బాల్కనీ పడగొట్టించండ్రాఅని. ఆ వెధవలు వినిచావలేదు. ఫలితంగా నేనిప్పుడు ఆపదలో చిక్కుకున్నాను..." అంటూ హోటల్ వాళ్లని బండబూతులు తిట్టసాగాడు గుర్నాథం.

అతని మాటలకు అడ్డువస్తూ మూర్తి "వాళ్లనలా తిట్టకు. నేను బాల్కనీలోంచి రాలేదు. లిఫ్ట్‌లోనే వచ్చి డూప్లికేట్ తాళం చెవితో రూమ్‌లోకి ప్రవేశించాను" అన్నాడు దర్పంగా.

అంతలో తలుపు దగ్గర 'టక్‌టక్'మన్న చప్పుడు విన్పించి ఉలిక్కిపడ్డాడు మూర్తి. "వాళ్లు ఎవరు?" అని చిన్న గొంతుతో ప్రశ్నించిన అతనికి 'పోలీసులు' అని అదే స్థాయిలో జవాబిచ్చాడు గుర్నాథం.

మూర్తికి వెన్నులో సన్నగా వణుకుమొదలైంది.

అక్కడినించి ఎలా తప్పించుకోవాలా అనుకుంటూండంగా గుర్నాథం అంతకు క్రితమే చెప్పిన బాల్కనీ గుర్తుకొచ్చింది. వెంటనే ఒక్క క్షణం ఆలస్యం చేయకుండా తెరిచిఉన్న కిటికీగుండా బయటకు దూకేశాడు.

అదే సమయానికి ఆ గది తలుపులు తెరుచుకున్నాయి.

కానీ వచ్చింది పోలీసులు కాదు. రూమ్‌కి వస్తూ గుర్నాథం ఆర్డరిచ్చిన భోజనం పట్టుకొచ్చిన హోటల్ కుర్రవాడు.

అటువైపు మూర్తి దూకింది బాల్కనీ మీదకి గాదు, అక్కడసలు బాల్కనీయేలేదు. ఆరు అంతస్థుల పైనుండి సరాసరి రోడ్డుమీదకి దూకేసి పడీపడ్డంతోనే ప్రాణాలు కోల్పోయాడతను.

గుర్నాథం మేధస్సు ఎలాంటిదో ప్రత్యక్షంగా చూసిన పాపారావు ఆశ్చర్యంతో నోరుతెరిచాడు.

**(రాబర్ట్ ఆర్థర్ ఆంగ్లకథ ఆధారంగా**
**యస్.వి.రెడ్డి)**





చతుర
సంపుటి: 15 సంచిక: 4
మే: 1992

అదొక అద్భుత స్వప్నం.

తెల్లవారగానే కరిగిపోయే కల కాదది.

పదే పదే అదే స్వప్నం అతడిని ఎన్నో రాత్రులు నిద్రలేమికి, అంతర్మథనానికి గురిచేసింది. అతడిలో చిత్రవిచిత్రమైన ఆలోచనలని, అస్థిమితాన్ని సృష్టించింది.

నీటిమీది రాతలా తెల్లవారగానే మాయం కావలసిన భ్రమలాంటి స్వప్నం అతడి జీవితంలో మాత్రం సాకారమైంది. అతడికొక కొత్త కథను చెప్పి దానివెనుకనున్న జీవనగాథకతణ్ని నాయకుణ్ణి చేసింది. మమతానురాగాల మధురార్థాలను విప్పిచెప్పింది.

# కరగని కల

స్త్రీ ఔన్నత్యానికి, ఆమె ప్రేమతత్వానికి తన కలం ద్వారా ఓ అద్భుతరూపాన్నిచ్చిన శ్రీమతి కాళ్లకూరి కృష్ణ రచన 'కరగనికల' ఈ నెల 'చతుర' సమర్పణ.

ఆమె వయసు ముప్పయ్, ముప్పయ్యాయిదు మధ్య వుండొచ్చు. పచ్చని పసిమి ఛాయ.

పసుపు రంగు పట్టుచీరె ఆమె ఒంటి రంగులో కలిసిపోయింది. కెంపు రంగు పమిటంచు మాత్రం నడుము చుట్టూ త్రిప్పి ముందు భాగాన దోపుకోవటాన కొట్టొచ్చినట్టు కన్పడుతోంది.

తలంటుకున్న జుట్టు జారుముడిగా రూపాంతరం చెంది, భుజాలకు కొంచెం దిగువగా వేలాడుతోంది. దానిల్లో తురిమిన మల్లెమాల మాత్రం ముందుకు ఒరిగి చెవులకున్న తెల్లరాళ్ళ దుద్దులతో సామ్యాన్ని వెదుకుతున్నట్టుగా వుంది.

చాలా మెట్లు ఎక్కిరావటం వలన కావచ్చు చెమటపట్టి నుదిటి కుంకుమ కరిగి సన్నగా ముక్కు మీదకు జారుతోంది.

కుడిచేతిలో పూలు, టెంకాయల పూలసజ్జ ఉంది. ఎడమ చేతిలో చీరెకుచ్చెళ్ళు ఎత్తిపట్టుకుని మెట్లు ఎక్కుతోంది. అందంగా, ఆరోగ్యంగా స్వచ్ఛంగా వుందామె.

ఆమె వెంటనున్న కుర్రాడేమో అయిదారు సంవత్సరాలవాడు. వేసుకున్న పెద్ద చొక్కాలో సగం మునిగిపోయివున్నాడు. ఆ చొక్కా క్రింద నిక్కర్‌వుందో, లేదో కూడా తెలియడం లేదు. కళ్ళు రెండూ పుసితో నిండివున్నాయి. కనురెప్ప వేసినపుడల్లా అతుక్కుపోయి, మళ్ళీ తెరవాలంటే శక్తి వుపయోగించవలసివస్తోంది. తైల సంస్కారం లేని జుట్టు చెదిరి కళ్ళల్లోపడి చూపును మరింత యిబ్బంది పెడుతున్నట్లుంది. కుడి చేత్తో నాణాలు గాలిలోకి విసిరి పట్టుకుంటూ శబ్దం చేస్తున్నాడు. ఎడం చేత్తో నిక్కరు వున్నది కాబోలు, జారకుండా వుండేందుకా అన్నట్టు నడుము దగ్గర పట్టుకుని ఉన్నాడు. ఆమెనే చూస్తూ... వెంబడిస్తూ అడ్డదిడ్డంగా మెట్లెక్కుతున్నాడు.

వాడి అందమూ, ఆరోగ్యమూ పైకి తెలియనంత అశుభ్రంగా వున్నాడు వాడు.

ఆమె మెట్లు ఎక్కుతూనే వుంది. వాడు వెంబడిస్తూవున్నాడు. అసలే పుసిబారిన కళ్ళు. వాటికి అడ్డంగా జుట్టు. అది చాలదన్నట్టు అడ్డంగా మెట్లు ఎక్కడం. నాలుగు మెట్లు ఎక్కాక ముందుకు తూలాడు. 'అమ్మా!' అంటూ.

★ ★ ★

ఆ కేకకు నాకు మెలకువ వచ్చింది. ఉలిక్కిపడి లేచాను. చాలా దాహం వేస్తున్నది. అయితే ఇంతవరకు కల కన్నానన్నమాట.

పక్కకి చూస్తే లలిత మడిచిపెట్టిన పుస్తకంలా పొందికగా నిద్రపోతున్నది. రాత్రి కోలీగ్ కూతురి పుట్టిన రోజుకని వెళ్ళి పొద్దుపోయివచ్చి, అలసటతో అలాగే పడుకుంది. బట్టలు మార్చుకున్నట్టు లేదు. పసుపు పచ్చని బిన్నీ చీరెలో పొగుపడిన బంగారు గొలుసులావుంది. కానీ అటు ఉద్యోగంతో ఇటు ఇంటి పనితో అలిసి, వడిలిపోయినట్లుగా వుంది. పక్కనే పాపాయి. ఆకలివేస్తున్నది కాబోలు జువ్ జువ్ మని శబ్దం చేస్తూ వేలు చీకుతోంది. పొట్ట వెన్నునంటుకునివుంది. సాయంత్రం స్నానం చేయించినట్టులేదు మాసిపోయిన తెల్ల దారప్పురీలులా వుంది లలితకు దాని ఆలనా పాలనా చూసేందుకు సమయం చాలటం లేదు.

నిశ్శబ్దంగా లేచి ఫ్రిజ్ తెరిచి మంచి నీళ్ళు తాగాను.

ఎదురుగా అమ్మ బెడ్‌రూం ఖాళీగా కన్పించింది. మనసంతా ఒక్కక్షణం బరువెక్కింది.

మైథిలి పెళ్ళయిన దగ్గర్నుండీ అమ్మ అడపా దడపా దాని దగ్గరకు వెళ్ళి ఒక వారం వుండి రావటం మామూలే. కానీ, ఈసారి అమ్మ మనసు కష్టపెట్టుకుని వెళ్ళింది. ఇక వస్తుందని నేననుకోను. వచ్చినా ఈ కుటుంబ సభ్యురాలిగా మాత్రం రాదు. అతిథిగా రావొచ్చు.

నాకు ఆశ్చర్యం అన్పించింది. అందరు అత్తా కోడళ్ళకు లాగానే అమ్మకీ లలితకూ పడలేదు. నిజం! నేను ఎంత కాదనుకున్నాయిది నిజం.

వాళ్ళిద్దరూ జుట్టూ జుట్టూ పట్టుకుని పోట్లాడుకోలేదు. అయినా అమ్మ మనసు కష్టపెట్టుకుని వెళ్ళిపోయిందనేది మాత్రం నిజం.

ఉదయం నేను ఆఫీసుకు బయలుదేరుతోంటే అమ్మ అంది.

"కృష్ణా! నేను చెల్లాయి దగ్గరకు వెళ్తాను నాన్నా!" అని.

ఈమాట గత ఆరు నెలలుగా ఏ క్షణాన వినవలసి వస్తుందో అని భయపడుతూనే వున్నాను. అయినా ఆటంబాంబులానే పేలింది.

గొంతు పెగుల్చుకుని దీనంగా "ఏమ్మా?" అన్నాను.

"నాకు కొన్నాళ్ళు విశ్రాంతి కావాలిరా"

వంటింట్లో నుండి పాపాయికి పాలు తీసుకుని వస్తోన్న లలిత అంది.

"అవును మీరిక్కడ చాకిరీ చేయలేక కష్టపడుతున్నారు. మీకు విశ్రాంతి అవసరం, అంతేగా"




లలిత సన్నగా, పొడవుగా, జాజిమొగ్గలా వుంటుంది. మనిషి ఎంత సున్నితంగా, సుకుమారంగా కన్పిస్తుందో మాట అంత నెమ్మదిగా మాట్లాడుతుంది. ఆమె మాట్లాడితే ఎవరినుద్దేశించి మాట్లాడుతుందో, వారికి మాత్రమే విన్పిస్తుంది. సినిమాలలో, నాటకాల్లో నయితే గయ్యాళి వాళ్ళు లావుగా వుండి పెద్ద గొంతుతో మాట్లాడతారు లలిత కఠినంగా మాట్లాడొచ్చు గాక, నెమ్మదిగా మాట్లాడుతుంది.

అమ్మ సమాధానం చెప్పలేదు. నా ముఖంలోకి చూసింది. ఆ చూపు నిస్సహాయంగా, దీనంగా వుంది. నాన్నగారున్నప్పుడు అమ్మ ఏనాడూ ఇలా కన్పించలేదు. నా వల్లనే, అమ్మకు బాధ కల్గుతున్నది.

''అమ్మ బంగారు తల్లికదూ'' అనేవారు నాన్నగారు.

''అవును నాన్నగారూ!'' అనే వాళ్ళం నేనూ, మైథిలీ ముక్తకంఠంతో.

అన్ని విషయాల్లోనూ భేదాభిప్రాయాలేగానీ ఈ విషయంలో మాత్రం దానిదీ, నాదీ ఏకాభిప్రాయం.

'అమ్మ మన కోసం చాలా కష్టపడుతోందిరా' అని నాన్నగారంటే, మేము 'అవును నాన్నగారూ! మేమిద్దరం పెద్దయ్యాక అమ్మని బాగా సుఖపెడతాం'అనేవాళ్ళం.

మైథిలి - 'అమ్మా! నిన్ను కూర్చోపెట్టి వంటంతా నేనే చేస్తాను' అనేది.

నేను 'అమ్మా! దాని మాట నమ్మకు. అది పెళ్ళి చేసుకుని వెళ్ళిపోతుంది. నీకు ఏం చేసినా నేనే చేస్తాను' అనేవాణ్ణి.

'వంటకూడానా!' అని మైథిలి వెక్కిరించేది.

'వంట నా భార్యతో చేయిస్తాను. నేనూ, నా భార్య అమ్మను మహారాణీలాగా చూస్తాం' అనే వాడిని.

అమ్మ మా యిద్దరినీ దగ్గరకు తీసుకుని 'నాన్నగారి మాట నమ్మకండి. నాకేమీ కష్టం లేదు. భర్తకీ, బిడ్డలకీ వండిపెట్టడం కష్టం అనుకోవడానికి నేనేమీ బియ్యేలు, యమ్మేలు చదవలేదు' అనేది.

ఉదయం నేను స్కూటరు బయటకు తీస్తోంటే రోజూలానే అమ్మ ఎదురు వచ్చింది. నాన్నగారు పోయిన కొత్తలో అమ్మ యిలా నాకు ఎదురు రానటానికి ఒప్పుకోలేదు.

''నేను ఎదురు రావటం అపశకునంరా!'' అంది.

''నాకు తెలీదమ్మా! శకునాలలో నాకు నమ్మకం లేదు. నువ్వు నవ్వుతూ ఎదురొస్తే నా మనసుకు బావుంటుంది. రోజంతా సంతోషంగా ఆఫీసులో పని చేసుకోగలుగుతాను అంతే!'' అన్నాను. ఆ రోజునుండీ ఈ రోజు వరకు మైథిలి దగ్గరకు వెళ్ళినపుడు తప్ప ప్రతిరోజూ అమ్మ నాకు ఎదురు వచ్చేది. రేపటినుండి అమ్మ రాదు!

ఆఫీసుకు వెళ్ళానేగానీ మనసంతా అమ్మ చుట్టూనే తిరుగుతోంది.

నేను యింటికి వెళ్ళను చూద్దాం. అమ్మ వూరు ఎలా వెళ్తుందో అనుకున్నాను.

అమ్మను వూరు పంపిన ప్రతిసారీ నేను దగ్గరుండి రైలు ఎక్కించి, బావగారికి ఫోన్ చేస్తాను. ఈసారి అమ్మను నేను పంపటం లేదు. తానే వెళ్తోంది. చూద్దాం! ఎలా వెళ్తుందో అనుకున్నాను.

కానీ రైలుకు టైమయ్యేకొద్దీ నా మనసు నా మాట వినటం మానేసింది. గబగబా యింటికి వెళ్ళాను. అమ్మ యింట్లోనే వుండాలని పదే పదే కోరుకుంటూ యింటి ముందు స్కూటరు ఆపాను.

ముందు వరండాలో పనిపిల్ల రాములు పాపాయిని ఆడిస్తోంది.

''పెద్దమ్మగారిప్పుడే స్టేషన్‌కి వెళ్ళారండి'' అని చెప్పింది.

స్కూటర్‌ని స్టేషన్‌కి పరుగెత్తించాను రైలు ప్లాట్‌ఫారం మీదేవుంది. సెకండ్ క్లాసు కంపార్ట్‌మెంటులన్నీ జనంతో కిటకిటలాడుతున్నాయి. ఈ జన సముద్రంలో అమ్మని ఎలా గుర్తించడం?

అప్రయత్నంగా కౌంటరు ముందు క్యూని చూశాను.



అమ్మ అక్కడ వుంది. పక్కనే సూటుకేసు వుంది.

దగ్గరకు వెళ్ళి అమ్మని 'క్యూ' బయటకు లాగాను.

"నువ్వొస్తావని యిప్పటి వరకూ చూసి, యింతకుముందే బయలుదేరి వచ్చాను. రద్దీ ఎక్కువగా వుంది. రైలు బయలుదేరేలా వుంది. టిక్కెట్టుదొరుకుతుందంటావా?" అన డిగింది గడగడా.

"దొరుకుతుందిలే" అంటూ నేను మొదటి తరగతి కౌంటర్ దగ్గరకు వెళ్ళి టికెట్ కొన్నాను.

"అయ్యో! ఫస్ట్ క్లాస్ ఎందుకురా? అన్నీ దండుగమారి పనులే. నాలుగ్గంటల ప్రయాణానికి నాలుగురెట్లు ఎక్కువ ఖర్చు. పాపాయికి రెండు మంచి గౌనులు వచ్చేవిగదా" అమ్మ సణుగుతూనేవుంది.

నేను అమ్మని రైల్లో కూర్చోపెట్టి మైథిలి కొడుక్కి బిస్కెట్టు ప్యాకెట్లు కొనిచ్చాను.

"పాపాయీ, లలిత జాగ్రత్త నాన్నా! నువ్వు నా గురించి బాధపడకు" అంది అమ్మ రైలు కదులుతుంటే.

అమ్మ మనస్ఫూర్తిగా అన్నా ఆ మాటలు నన్ను చాచి పెట్టికొట్టినట్టుగా ఫీలయ్యాను. మగవాడిని అయిన పాపానికి దుఃఖాన్ని దిగ మింగ వలసి వచ్చింది.

వర్ధన్గ్గాడన్నట్టు దేవతలకయినా సరే అత్తా కోడళ్ళున్నాక అభిప్రాయభేదాలు తప్పవా?

★ ★ ★

రాత్రి ఆలోచనలతో ఆలస్యంగా నిద్రపోయా నేమో వుదయం ఆలస్యంగా మెలకువ వచ్చింది.

అమ్మ దేవుడి పూజ చేస్తూ గంట మోగించేది. ఆ 'రవళి'కి నాకు మెలకువ వచ్చేది. ఈ ఉదయం పాపాయి ఏడుపుకి మెలకువ వచ్చింది. లేచి చూస్తే గచ్చు మీద నీళ్ళు. మధ్యలో పాప.

"నీళ్ళు కాదండీ! పాసు పోసుకున్నారు" అంది రాములు.

"ఎవడు తీసుకున్న గోతిలో వాడే పడతాడు అనేది పాతసామెత. ఎవరు పోసుకున్న ఉచ్చలో వాళ్ళే పడతారనేది కొత్త సామెత" అన్నాను. "జోక్ బావుంది. మీరు త్వరగా తెమిలితే యింకా బావుంటుంది" అంది లలిత కాఫీ కప్పు చేతిలో పెడుతూ.

నేనింకా బ్రష్ చేయలేదు.

నిజానికి నాకు బెడ్ కాఫీ యిష్టం. అమ్మ యితే బ్రష్ చేసి వచ్చి డైనింగ్ టేబిల్ ముందు కూర్చుంటే కానీ కాఫీ యివ్వదు.

నేను ఉత్సాహంగా కాఫీ సిప్ చేశాను.

కానీ, ఆ ద్రవం గొంతులోకి దిగుతూండగానే అర్థమయిపోయింది. ఇన్స్టెంట్ కాఫీ అని. మా అమ్మ చేసిన చెడు (?) అలవాట్లలో యిదొకటి. ఫిల్టర్ కాఫీ తప్ప మాకెవరికీ మరే కాఫీలు నచ్చవు. బావగారయితే 'ఈ మైథిలి నాక్కూడా ఫిల్టర్ కాఫీ అలవాటు చేసేసింది. అయ్ జస్ట్ స్టాప్డ్ రెలిషింగ్ ఎనీ అదర్ కాఫీ' అంటారు.

నేను లలితతో వాదించను. లలిత చదువుకున్న భార్య. అసలు భార్యలకే తెలివి తేటలు ఎక్కువ. అందులో చదువుకున్న భార్యలంటే వేరే చెప్పాలా?

"ఫన్ చెయ్యొద్దు కృష్ణా! మీకు బయటంతా ఫిల్టర్ కాఫీ దొరుకుతుందా? దొరకదని కాఫీ తాగటం మానేస్తావా?" అంటుంది.

'దొరకదు లలితా! తాగటం మానను కూడా. కానీ యిది నా యిల్లు. నా యింట్లో నేను ఫిల్టర్ కాఫీ తాగాలనుకోవటం అత్యాశకాదుకదా' అనా లనుకుంటాను. కానీ అనకపోవటంలోనే నాకు శాంతి, సౌఖ్యం వుందని తెల్సు. మా అమ్మను, తన తల్లిని పోల్చి బావగారంటారు.

"మీ అమ్మగారు ఫుల్టైం కుక్. అందుకే ఆవిడ మీకన్నీ ట్రెడిషనల్ అలవాట్లు చేశారు. ఉప్మా అంటే మా యింట్లో నీటిలో రవ్వ ఉడికించి దాన్ని మాయ చేయటానికి ఒక చెంచా నెయ్యి కలుపుతారు. మీ ఇంట్లో మీ అమ్మగారు ఉల్లిపాయలు సన్నగా, పొడవుగా చీరి, పచ్చిమిర్చి చిన్న చక్రాల్లాగ తరిగి, అల్లం సన్నగా తురిమి, చారెడు జీడిపప్పులు వేసి కరివేపాకు కలిపి, నిమ్మకాయతో వడ్డిస్తారు. అది మాకు పెద్ద లగ్జరీ, మా అమ్మకి కుదరదు.

మాకు బ్రేక్‌ఫాస్ట్ అంటే వుడికించిన గుడ్లు, ఫ్రిజ్‌లోని బ్రెడ్" అని.

అందుకే ఆవిడ యిప్పుడు పెద్ద కొడుకు దగ్గర అమెరికాలోవుంది. ఆవిడ లలితకు పినతల్లి. నా ఖర్మ కొద్దీ లలితకు ఆవిడే ఆదర్శం.

అమ్మ యిదివరలో మైథిలి దగ్గరకు వెళ్ళిన పుడు లలితకు ఉద్యోగం లేదు. అప్పుడు కూడా లలిత ఉడికించిన గుడ్లు, బ్రెడ్‌ను బ్రేక్‌ఫాస్ట్‌గా సర్వ్ చేసింది.

"ఇది నాకు అలవాటు లేదు లలితా!" అన్నాను.

"చేసుకోవాలి కృష్ణా! మీ అమ్మగారు మిమ్మ ల్ని మరీ భోజన ప్రియుల్లా తయారు చేశారు. ఒక్క మంచి అలవాటూ చెయ్యలేదు" అంది.

నేను టిఫిన్ వదిలేసి ఆఫీసుకు వెళ్ళిపో యాను. నేను తను చేసిన ఉపాహారం పట్ల నా నిరసనను వ్యక్తం చేస్తున్నాననుకున్నది లలిత. నాకు ఆ ఉద్దేశ్యం ఏ కోశానా లేదు. నేను ఉదయం పూట ఇడ్లీ, దోసె, పెసరట్టు, ఉప్మా వంటివి తినడానికి అలవాటుపడ్డాను. నేను ఆంధ్రుడిని. టూర్లకు తప్ప యితర రాష్ట్రాలకు వెళ్ళిన వాడినీ, నివసించిన వాడినీ కాదు. నాకు బ్రెడ్ చూస్తే జ్వరం వచ్చిన భావన కలుగుతుంది. బ్రేక్‌ఫాస్ట్ తిని తీరాలని నాకు నియమమేమీ లేదు అందువల్ల లలిత పె ట్టిన టిఫిన్ తినకుండానే నేను వెళ్ళిపోయాను.

ఆ సాయంత్రం లలిత అంది

"మొగుళ్ళు రెండు రకాలు"

నానుండి ఎటువంటి ప్రతిస్పందనా లేకుండానే మళ్ళీ అంది.

"కొందరు పెళ్ళాల్ని తన్ని తమకు కావల సినవి సాధించుకుంటారు. వాళ్ళు మొదటి రకం వాళ్ళు. చాలా మంచివాళ్ళు"

'సర్టెన్లీ! ఐ విల్ నాట్ బిలాంగ్ టు దట్ గ్రూప్' అనుకున్నాను నేను మనసులోనే. పెళ్ళా లను తన్నే వాళ్ళుమంచివాళ్ళు ఎలా అవు తారా అని ఆశ్చర్యపోయాను కూడా. నా ఆశ్చ ర్యాన్ని గమనించకుండానే లలిత తన సంభా షణను పొడిగించింది.

"వాళ్ళ మనసు మంచిది. (పెళ్ళాలను మంచి మనసుతోనే తంతారని నిజంగా నాకప్ప టివరకూ తెలీదు) రెండో రకం మొగుళ్ళున్నా రే మీ వైపన్న మాట. మాట్లాడకుండా చేతలతో సాధిస్తారు" అంది.

'దుర్మార్గులు' అని ఆమె డైరెక్టుగా అనలే దు. కానీ దానర్థం అదే.

"మీరు ఉదయం టిఫిన్ వదిలేసి వెళ్ళారు కదా! మీ వుద్దేశ్యం ఏమిటి? మీరు టిఫిన్ తినకుండా నేను తినగలనా? (ఎందుకు తిన కూడదో నాకు అర్థం కాలేదు.) అత్తయ్యలాగ తెల్లవారుఝామున లేచి, ఆ కుడుముల్లాంటి యిడ్లీలూ, కారప్పొడీ చేయాలా నేను కూడా? మీ అమ్మగారు ఒక్కమంచి అలవాటు చెయ్యా లేదు మీకు" అని తన సంభాషణను ము గించింది.

నేనూ అందామనుకున్నాను "పెళ్ళాలు రెండు రకాలు. మొదటి రకం అరిచి, రాద్ధాంతం చేసి సాధించుకుంటారు. వీళ్ళ మొగుళ్ళు అదృష్టవంతులు. పబ్లిక్ సింపతీ వుంటుంది వాళ్ళకి. రెండో రకం పెళ్ళాలున్నా రే, వాళ్ళు నీ వైపు అన్నమాట. చదువుకున్న ముఖ్యంగా పీజీ చదువుకున్న పెళ్ళాలు సోకాల్డ్ కల్చర్ వున్న వాళ్ళు. లాజిక్‌తో, ఆర్గ్యు మెంట్స్‌తో మొగుణ్ణి పక్కవాళ్ళకి తెలియ కుండా సాధిస్తారు. వీళ్ళ మొగుళ్ళు నిజమైన దురదృష్టవంతులు" అని.

కానీ నేను ఈ మాటలేవీ పైకి అనలేదు. చాలా మంది మగవాళ్ళు ఎందుకు మితభాషు లుగా ఉంటారో నాకు పెళ్ళయ్యాక బాగా అర్థం అయింది.

ఆలోచనల్నుండి తేరుకుని కాఫీ కప్పుకింద పెట్టాను. స్నానం, మిగిలిన కార్యక్రమాలు పూర్తి చేసుకుని వచ్చేసరికి డైనింగ్ టేబిల్ మీద ఆమ్లెట్, రెండు బ్రెడ్ స్లైసులు ఉన్నాయి. ఉడికించిన గుడ్డు కంటే యిది కొంచెం నయం. నిరాసక్తంగా బ్రెడ్ మధ్య ఆమ్లెట్ పెట్టుకుని మింగాను.

లలిత వీడ్కోలు యిస్తుందని నేను ఆశించ లేదు. స్కూటర్ స్టార్ట్ చేసుకుని, అమ్మని గుర్తుకు తెచ్చుకుని నిట్టూర్పి ఆఫీసుకు బయ




లుదేరాను.

★ ★ ★

ఒక అరగంట ముందుగానే ఆఫీసు వదిలే శాను.

వర్ధన్‌ని చూసి చాలా రోజులైంది. సంతోషంలోనూ, దుఃఖంలోనూ కూడా స్నేహితులు గుర్తుకొస్తారు. అదేం విచిత్రమో! వాడింటికి వెళితే అప్పుడే మధ్యాహ్నం నిద్రనుండి లేస్తున్నాడు, వాడు.

"ఏమిరా! చిరకాల దర్శనం. ఏమిటి విశేషాలు?" అన్నాడు.

వాడి భార్య వేడివేడి ఫిల్టర్ కాఫీ తెచ్చి యిచ్చింది. నా అలసటంతా చేత్తో తీసేసినట్టు మాయమయింది. లలిత గుర్తుకొచ్చి నవ్వు కూడా వచ్చింది.

"ఏమిటన్నయ్యా! మీలో మీరే నవ్వుకుంటున్నారు" అనడిగింది రజని.

కన్పించిన ప్రతి మగవాడినీ అన్నయ్యా అని పిలిచే ఆడవాళ్ళంటే లలితకు చాలా చిన్నచూపు. "వాళ్ళ మనసులోని చెడ్డ భావనలను కప్పిపుచ్చుకునేందుకే అటువంటి సంబోధన చేస్తారు" అంటుంది.

"అది సాంప్రదాయం. ఒక పద్ధతి. ఒక అలవాటు. దానిలో ఏమీ లాజిక్‌గానీ, సైకో ఎనాలిసిస్ కానీ లేదు" అంటాను నేను.

వర్ధన్ సైకియాట్రిస్ట్. ఇది వాడి భార్య గురించిన టాపిక్ కాకపోతే వాడి అభిప్రాయం అడిగి వుండేవాడినే.

"ఏం లేదు రజనీ! కాఫీ చాలాబావుంది" అన్నాను.

"ఆ మాట మా అత్తగారికి చెప్పండి ప్లీజ్. కాపురానికివచ్చి యిన్నేళ్ళయినా నా వంట బావుంటుందని ఆవిడతో అన్పించ లేకుండా వున్నాను" అంది

"నువ్వు ఫో యిక్కణ్ణించి.మీ అత్తా కోడళ్ళ వ్యవహారంలోకి మమ్మల్ని లాగకు. ఒరేయ్, నువ్వు నోరుమూసుకుని కాఫీ తాగు. గృహచ్ఛిద్రానికి పాల్పడకు. అత్తా కోడళ్ళూ అంటే పాముా ముంగిస అన్నమాట.

ఆ రిలేషన్‌లో సాక్షాత్తూ దేవతలే ఉన్నా తగాదాలూ, అభిప్రాయభేదాలు తప్పవు" అన్నాడు వర్ధన్.

"ఒక సైకియాట్రిస్ట్‌గా నీ ఎనాలిసిస్ ఏమిట్రా! ఎందుకు ఒకరితో ఒకరు యింతగా విభేదిస్తారు?" అనడిగాను.

"ఏంట్రోయ్ నన్నేదో యింటర్వ్యూ చేయటానికి వచ్చినట్టు ఏంటా ప్రశ్న? త్వరగా దయచెయ్ నా క్లినిక్‌కు టైమవుతోంది" అన్నాడు.

వెనక్కి వచ్చేస్తోంటే గుర్తుకొచ్చింది, అమ్మ వెళ్ళిపోయిందని వాడికి చెప్పనేలేదు.

★ ★ ★

లలిత తెల్ల చారల నల్ల నైటీ వేసుకుంది.

తలంటుకున్న జుత్తు బిగుతుగా పైకి ఎగగట్టి ముడి వేసుకుంది. పాపాయి పీకుతుందని భయం.

లలిత పడుకునే ముందు నగలేవీ పెట్టుకోదు. అమ్మ ఏమయినా అంటుందని భయంతో మంగళ సూత్రాలు మాత్రం వుంచుకుంటుంది. చెవులవీ, చేతులవీ అన్నీ తీసి డ్రాయర్లో పెడుతుంది. బ్రష్ చేసుకుని, ముఖం కడుక్కుని పడుకోవటానికి వస్తుంది. నాకు 'ఈమే అసలైన స్త్రీ'అన్పిస్తుంది.

ఆరు గజాల చీరెలో, అనవసరమయిన నగలతో పగలు కన్పించే లలిత అందంగా వుండవచ్చేమోగానీ, నాలో శృంగార భావనలు రేకెత్తించదు. అలంకారాలేమీ లేని యీ లలితే నన్ను మంత్రముగ్ధుణ్ణి చేస్తుంది.

భారతీయ సంస్కృతిలో స్త్రీకి శృంగారం నిషిద్ధం. కూతురికి పెళ్ళి చేయాలనే ఆలోచన రాగానే వంటా, వార్పూ నేర్పే పూర్వ కాలపు తల్లులూ, బ్యూటీ పార్లర్స్ చుట్టూ తిప్పి సన్నబడటం ఎలా? అధునాతనంగా అలంకరించుకోవడం ఎలా? అని నేర్పే నవనాగరికపు తల్లులూ కూడా భర్తని శృంగారంతో అలరించడం ఎలా? అనేది ఎందుకు నేర్పరో!

అసలు అదేమిటో వాళ్ళకు తెల్సా?

అసలు అటువంటి భార్యల్ని అనురాగంతో అక్కున చేర్చుకునే మగవాళ్ళెందరు?

భార్య సుఖపెడుతుందని సంతోషించే బదులు ఈ పురుష పుంగవులు అనుమానించి ప్రాణాలు తీయరూ!



రాత్రుళ్ళు నగలు తీసేసే లలిత, ఉదయం లేస్తూనే మళ్ళీ అవన్నీ వేసుకుని మరీ గది లోంచి బయటకు వెళ్తుంది. ఒకసారి మేమంతా పడుకున్నాక ఎవరో చుట్టాలొచ్చారు. లలిత అసంకల్పితంగా నగలు వేసుకోకుండానే బయటకు వచ్చేసింది. అమ్మ లలిత చేతులు చూసి ఆశ్చర్యపోయింది.

"లలితా! గాజులు తీసేశావేం?" అనడిగింది గాభరాగా, ఆకాశం కూలిపోతోంటే కంగారుపడ్డట్టు.

లలిత మొహమాటంగా నవ్వి, "చిరాకుగా వుంటేనూ..." అని గొణిగింది. అమ్మదానికి వేరే అర్థం తీసుకుని నవ్వుకుంటూ.

"సరే సరే మీ యిష్టం..." అంటూ సంభాషణకు ఫుల్‌స్టాప్ పెట్టేసింది. గదిలోకి వచ్చేక లలితతో అన్నాను 'అమ్మ ఏమనుకుని వుంటుందో అని.

"ఛ! అలా అనుకుని వుంటారంటారా? ఛ! ఛ!" అంది లలిత పదిసార్లు.

"ఏమిటీ? యిప్పుడు పోయి ఆవిడ అభిప్రాయం తప్పని చెప్పొస్తావా ఏం?" అనడిగాను.

"ఛ!" అంది మళ్ళీ.

భారత స్త్రీకి సెక్స్ అంటే 'ఛ'. అది ఈ దేశపు స్త్రీ దౌర్భాగ్యమూ! పురుషుడి దురదృష్టమూ!

లలితకు కూడా ఈ 'ఛ'లో చాలా నమ్మకం వుంది. వారంలో నాలుగు రోజులు లలిత ఏవేవో సాకులతో సిద్ధంగా వుంటుంది.

"ఇవాళ మధ్యాహ్నం పాపాయి నిద్రపోలేదు. నన్ను నిద్రపోనివ్వలేదు. అందువల్ల యిప్పుడు నిద్రవస్తోంది"

"పాపాయికి జ్వరం, నా మూడ్ బాగాలేదు"

"ఇవాళెందుకో ఉదయం నుండీ ఒకటే తలనెప్పి"

"అబ్బ! పనితో చాలా అలసిపోయాను బాబూ! చాలా నిద్రొస్తోంది"

ఇవి మచ్చుకు కొన్ని మాత్రమే.

అటువంటి లలిత నిన్న అమ్మ వెళ్ళిపోయినందుకు గిల్టీగా ఫీల్ అయిందనుకుంటా. నేను అడగకుండానే నన్ను కటాక్షించింది. హేంగోవర్‌లా నన్నింకా ఆ మధురస్మృతి వీడ లేదు. ఆ ఉత్సాహంతోనే యివాళ పడకగదిలోకి రాగానే చేయిపుచ్చుకుని దగ్గరకు లాక్కున్నాను. లలిత నన్ను వదిలించుకునే ప్రయత్నం ఏమీ చెయ్యకుండానే నిర్వికారంగా అంది.

"ప్లీజ్ కృష్ణా! యింటిపనితో, పాపాయి పనితో, ఉద్యోగంతో నేను చాలా అలిసిపోయి ఉన్నాను 'లీవ్ మీ'"

నాకు కష్టం కలిగింది.

నేనేదో కీచకుణ్ణి అయినట్టు 'లీవ్ మీ' అట.

భార్య అలా అన్నాక కూడా శృంగారం చేయాలనుకునేవాడు నా దృష్టిలో నిజంగా కీచకుడే. అందుకే నేను లలితను వదిలి వెళ్ళి ఆఫీసు ఫైల్సు తెచ్చుకున్నాను.

"నాకు లైటు ఉంటే నిద్రపట్టదు" అంది లలిత. అప్పటికే ఆమె కళ్ళు మూసుకుని వుంది. నేను ఫైల్సు పుచ్చుకుని 'రీడింగ్ రూం'కి వెళ్లబోతోంటే "నువ్వూ, మీ అమ్మగారూ నన్ను సాధించటానికే నిశ్చయించుకున్నారా?" అనడిగింది కళ్లు తెరువకుండానే. వీణ లాంటి గొంతుకతో యింత నెమ్మదిగా యింత కటువైన మాటలు ఉచ్చరించగలగటం నిజంగా ఒక కళ అనిపించింది నాకు. ఫైళ్ళు పక్కన పడేసి, లైటార్పి కళ్ళు మూసుకున్నాను. లలితనుండీ, ఆమె వాగ్బాణాలనుండి నేను తప్పించుకునేందుకు ఉత్తమమైన మార్గం అదే!



ఆమె వయసు 30-35కి మధ్య వుండొచ్చు. పచ్చని పసిమిఛాయ. పసుపు పచ్చని పట్టుచీ




ర ఆమె ఒంటిరంగులో కలిసిపోయింది. కెంపురంగు పమిటంచు మాత్రం నడుముచుట్టూ తిరిగి, ముందుభాగాన దోపబడి, కొట్టొచ్చినట్టు కన్పడుతోంది. తలంటుకున్న జుట్టు జారుముడిగా రూపాంతరం చెంది, భుజాలకు కొంచెం దిగువగా వేలాడుతోంది. వాటిల్లో తురిమిన మల్లెమాల మాత్రం ముందుకు ఒరిగి చెవులకున్న తెల్లరాళ్ళ దిద్దులలో సామ్యాన్ని వెదుకుతున్నట్టుగా వుంది. చాలా మెట్లు ఎక్కిరావటంతో చెమటపట్టి నుదుటి కుంకుమ కరిగి సన్నగా ముక్కుమీదకు జారుతోంది. కుడిచేతిలో టెంకాయలున్న పూల సజ్జ. ఎడమ చేతిలో చీరె కుచ్చిళ్ళు ఎత్తిపట్టుకుని ఆమె మెట్లు ఎక్కుతున్నది. ఆమె అందంగా, ఆరోగ్యంగా, పరిశుభ్రంగా వుంది.

వాడు అయిదు లేక ఆరు సంవత్సరాలవాడు. వేసుకున్న పెద్ద చొక్కాలో సగం మునిగిపోయి వున్నాడు. ఆ చొక్కా కింద నిక్కరు వుందో లేదో తెలియడంలేదు. కళ్ళు రెండూ పుసినిండి వున్నాయి. కనురెప్ప వేసినపుడల్లా అతుక్కుపోయి, మళ్ళీ తెరవాలంటే శక్తి వుపయోగించవలసి వస్తోంది. తైలసంస్కారంలేని జుట్టు చెదిరి కళ్లల్లోపడి చూపును మరింత యిబ్బంది పెడుతున్నది. కుడిచేత్తో నాణాలు గాలిలోకి విసిరి పట్టుకుంటూ శబ్దం చేస్తున్నాడు. ఎడం చేత్తో నిక్కరు వున్నది కాబోలు జారకుండా వుండేందుకా అన్నట్టు నడుము దగ్గర పట్టుకున్నాడు. ఆమెనే చూస్తూ, వెంబడిస్తూ అడ్డదిడ్డంగా మెట్లెక్కుతున్నాడు. వాడి అందమూ, ఆరోగ్యమూ తెలియటం లేదుగానీ చాలా అశుభ్రంగా మాత్రం వున్నాడు.

ఆమె మెట్లు ఎక్కుతూనే వుంది. వాడు వెంబడిస్తూ వున్నాడు. అసలే పుసిబారిన కళ్లు, వాటికి అడ్డంగా జుట్టు, అది చాలదన్నట్టు నిలువుగా ఎక్కవలసిన మెట్లను అడ్డంగా ఎక్కడం, నాలుగు మెట్లు ఎక్కాక ముందుకు తూలాడు. 'అమ్మా!'

నాకు మెలకువ వచ్చింది. 'పవర్ కట్' కాబోలు పైన ఫ్యాన్ తిరగటంలేదు. ఇదేం కల? నిన్న కూడా యిదే కల వచ్చింది. ఇంకా ఆ స్త్రీ, ఆ పిల్లవాడు నాకళ్లముందు మెదులుతున్నట్టేవుంది. నా మనసు ఎంత వద్దనుకున్నా గతంలోకి వెళ్తోంది.

లలితను తొలిసారి నేను మైథిలి పెళ్ళిలో చూశాను.

లలిత తల్లి, మైథిలి అత్తగారూ స్వంత అక్క చెల్లెళ్ళు.

'లలిత అందమైంది అనటం చాలా మామూలు మాట. లలిత అద్భుత సౌందర్యవతి. ఆమె గొంతు ఆమెకు పెద్ద 'ఎసెట్'. సన్నని, సుతిమెత్తని గొంతు.

అమ్మాయి చాలా బావుంది అనుకున్నాను. అంతకుమించి అనుకోవటానికి ధైర్యం చాలలేదు.

'లా' డి.పి.యమ్ అయిపోయి సంవత్సరంగా నిరుద్యోగిగా వున్నాను. అయినా నాకు పెళ్ళిళ్ళలో పెళ్ళికూతురు తప్ప అందరూ బాగానే వుంటారు తగుమోతాదు అలంకరణలో, తగు నగలతో. పెళ్ళికూతురు ఒక్కతే బండెడు నగలతో, బరువైన చీరెతో దుస్సహంగా వుంటుంది.

లలిత అందం నన్ను ఎంతగా ఆకట్టుకొన్నప్పటికీ నేను ఆమెతో వివాహాన్ని ఆశించలేదు. నాన్నగారు "ఆర్థికంగా స్వాతంత్ర్యం వచ్చేవరకు నా కొడుకు పెళ్ళి చెయ్యను" అనేవారు.

"ఒరేయ్! నువ్వు పెళ్ళిచేసుకుని నన్ను 'నాన్నగారూ! పదిరూపాయలు యివ్వండి నేనూ, నా భార్య సినిమాకు వెళ్తాం' అనో లేక 'రెండు రూపాయలివ్వండి మా ఆవిడకు మల్లెపూలు కొనివ్వాలనో అడగటం ఎంబ్బా వుంటుంది, చెప్పు. అందుకని ఉద్యోగం వచ్చేవరకు హేమామాలినిని, రేఖను ప్రేమిస్తూ వుండు. వాళ్లయితే సినిమాలు, పూలూ అడగరు" అని సలహా యిచ్చేవారు.

ఆయన అభిప్రాయం సరైందే! మాకు పొలాలు లేవు. వ్యాపారాల్లేవు. చివరకు ఉద్యోగం చేసిననాళ్ళూ మా నాన్నగారికి స్వంత యిల్లు కూడా లేదు.

ఆయన 'ఇన్‌కమ్ టాక్స్ ఆఫీసరు'గా పనిచేశారు. కానీ, నిజాయితీ పరుడైన ఆఫీసరుకి వచ్చే జీతం ఎంత ఎక్కువైనా యిల్లు గడవటానికి, పిల్లల చదువుకూ, చిన్నచిన్న సరదాలకు



మాత్రమే సరిపోతుంది. అమ్మా, నాన్నా మాకు చూసిచూసి ఖర్చుచెయ్యడం నేర్పలేదు. మేము దుబారా ఏనాడూ చెయ్యలేదు. నిజమే కానీ అతిపొదుపూ చెయ్యలేదు, అందువల్ల, నాన్నగారు రిటైరై ప్రావిడెంటుఫండ్, గ్రాట్యుటీ చేతిలో పడితేగానీ చెల్లాయి పెళ్ళి చెయ్యలేక పోయాము. ఊరు చివర రెండు బెడ్‌రూంలతో యిల్లూ కొనుక్కోలేకపోయాము. మైథిలి అత్త గారికి మేము యింకొంత బంగారం యిస్తే బావుండు అని వుంది.

"ఒక్కతే కూతురు. తర్వాతనయినా అమ్మా యికి వచ్చేదే కదా! వదినగారు యిప్పుడిస్తే పోయిందేముంది?" అంది ఆవిడ మా అమ్మ తో.అప్పటికే ఆవిడ వీసా, పాస్‌పోర్టు సిద్ధం చేసుకుని పెద్దకొడుకు వద్దకు ఎగిరిపో యేందుకు సిద్ధంగా వుంది. తను వెళ్ళిపో యేక తన తెలివితక్కువ యింజినీరు చిన్న కొడుకు అత్తగారినుండి ఏమీ వసూలు చేసుకో లేడనీ, తను భారతదేశంలో వుండగానే ఆ బాధ్యత కూడా తనే నిర్వర్తించాలనీ ఆవిడ తాపత్రయం.

అమ్మ ఆవిడ వుద్దేశ్యాన్ని పటాపంచలు చేస్తూ"ఇక మైథిలికి ఏమీ యివ్వము. ఇవ్వవల సినదంతా పెళ్ళిలోనే యిచ్చేశాము. నా నగలు కృష్ణ భార్యకు. మా జీవితాలు మా కోడలివద్దనే వెళ్ళాలి కదా!" అంది.

తనకు కల్చర్ చాలా ఎక్కువ అని ఆవిడ వుద్దేశ్యం. అందువల్ల ఆ విషయమై మళ్ళీ ప్రస్తావించలేదు. మైథిలి పెళ్ళయి అత్తవా రింటికి వెళ్ళిపోయింది. నేను మాత్రం నిరుద్యో గిగా యిల్లు పట్టుకుని వేళ్ళాడుతున్నాను. అప్పుడే నేను ప్రస్తుతం పనిచేస్తోన్న 'ఫర్మ్'లోనే 'లా ఆఫీసరు పోస్టు' ఖాళీగా వున్నట్టు తెల్సి 'అప్లై' చేశాను.

ఇంటర్వ్యూకి పిలిచారు. బాగా చేశాను.

బాగా చేసిన వాళ్లందరికీ ఉద్యోగాలు వచ్చే స్తాయనే భ్రమేమీలేదు నాకు. వర్ధన్ 'ఇన్‌ఫర్మే షన్' సేకరించి 'ఒరేయ్! నువ్వు ఇంటర్వ్యూ చాలా బాగా చేసావట. ఒక్క యాభైవేలు మనవి కావనుకున్నామా ఉద్యోగం నీదే' అన్నాడు.





"నేను బాగా చేస్తే యింకా లంచం ఎందు కురా, మిగిలినవాళ్లకూ నాకూ తేడా ఏముంది?" అనడిగాను.

"నన్నాసీ! తేడా చాలా వుందిరా. 'ఇంట ర్వ్యూ' బాగా చేయనివాడు యాభై వేలిచ్చినా వుద్యోగం యివ్వరు, నీకయితే ఇస్తారు" అన్నా డు.

"వర్ధన్... నాన్నగారు చాలా నిజాయితీపరు డైన ఆఫీసరు. ఆయన కొడుకునైవుండీ లంచం యివ్వటానికి నాకు మనసురావటంలే దు. రెండో పాయింటు ఏమిటంటే మైథిలి పెళ్ళితో నాన్నగారి 'సేవింగ్స్' అన్నీ ఖర్చయి పోయాయి. అక్కడికీ మా నాన్నగారు చాలా సింపుల్ మనిషి. ఆయనతోటి ఆఫీసర్ల మాట వదిలెయ్యి. రిజిస్ట్రార్ ఆఫీసులో గుమాస్తాగా చేసి మీ నాన్నగారు నగరం నడిబొడ్డులో అంత పెద్ద భవనం కడితే, ఆయన వూరి చివర ఈ రెండు పడకగదుల యింటితో తృప్తిపడ్డారు. ఆయన దగ్గర డబ్బులేదు. నాతోటి వాళ్ళు, మైథిలి తోటివాళ్ళు వేలకు వేలుపెట్టి 'టూ ర్ల'కు వెళుతుంటే మేమిద్దరం అసలు అటు వంటి టూర్ ఒకటుందని నాన్నగారికి తెలియ నిచ్చేవాళ్ళంకాదు. అమ్మ అంటూ వుండేది, "ఒరేయ్! మీరు పెద్దయ్యాక, పెద్ద ఉద్యోగాలు చేసి బాగా డబ్బు సంపాదించి మీ కుటుంబా లతో టూర్లకు వెళ్ళండి. అప్పుడు మీ నాన్నగా రిని మాత్రం తీసుకువెళ్లకండి. పిల్లల సరదా లు తీర్చనందుకు ఆయనకు అదే శిక్ష" అని. టూర్ల మాట అటుంచు అసలిప్పుడు వాళ్ళకు భోజనమైనా పెట్టగలనా! అని భయంగా వుందిరా" అన్నాను.

"అందుకేరా! నా మాట విను. ఈ ఉద్యోగం చేజారనివ్వకు. మంచి జీతం. ప్రైవేటు కంపెనీ కావటంవల్ల చాలా సౌకర్యాలున్నాయి. జీవితంలో సెటిల్ అయిపోతావు. ఈ అవకాశం పోతే మళ్ళీ వస్తుందో, రాదో!" వర్ధన్ మాట లు నన్ను భయపెడుతున్నాయి. కానీ, డబ్బు లేని నాన్నగారి దగ్గరకు వెళ్ళి, ఆయన వద్ద డబ్బు లేదని తెల్సి, యాభైవేలు ఎలా అడ గాలో నాకు అర్థంకాలేదు.

తర్వాత నాలుగు రోజులకు అమ్మ మంగళ సూత్రాల గొలుసు మాత్రం వుంచుకుని, మిగి లిన నగలన్నీ వలిచి యిచ్చింది. "వర్ధన్

చెప్పాడు నాన్నా" అంది.

నాన్నగారూ, నేనూ బజారు వెళ్ళి ఆ నగలను తూయించి అమ్మేస్తోంటే నా హృదయం కలిచినట్టయింది.

ఆయన ఉద్యోగం చేసి అమ్మకు నగలు కొని వుండకపోవచ్చు కానీ ఒక్క గ్రాము కూడా అమ్మలేదు.

నేను వుద్యోగంలో చేరకముందే నగలన్నీ అమ్మించేసాను. కొడుకా? మజాకానా?

తర్వాత, నాకు కళ్ళెత్తి అమ్మ బోసి మెడను, మట్టిగాజుల చేతులను చూడాలంటే ధైర్యం చాలలేదు. గిల్టీగా వుండేది. అమ్మను తప్పించుకుని తిరిగేవాడిని.

ఒకరోజు భోజనాల దగ్గర నాన్నగారు, "ఏమే! నీ కొడుకు నీ నగలు తీసుకున్నందుకు బాధపడుతున్నట్టున్నాడు" అన్నారు.

"ఒరేయ్ పిచ్చి సన్నాసీ! అవి నీవేరా! చెల్లాయివి చెల్లాయికి పెళ్ళిలోనే యిచ్చేశాం. ఇవి నీ భార్యకని అట్టిపెట్టాను. ఇప్పుడేమయిందనీ? రేపు నువ్వు సంపాదించి ఇంతకు యిన్ని నగలు, నాకూ, రాబోయేదానికీ చేయించి యివ్వవూ?" అంది అమ్మ.

జీతాలతో నగలు చేయించే రోజులా యివి? అమ్మకు ఆ సంగతి తెలీకనా? నామనను చిన్నబుచ్చుకోకూడదని అమ్మ తాపత్రయం!

నాకు ఉద్యోగం వచ్చింది. అప్పటికి లలిత యమ్మే పాసయివున్నది. అమెకు సంబంధాలు వెతుకుతున్నారు కూడా! "మన కృష్ణుడికి యిస్తే బావుండును, పిల్ల చక్కగా చిదిమి దీపం పెట్టుకునేలా వుంటుంది" అంది అమ్మ ఒకటి రెండుసార్లు. "అడిగేవు గానీ! అవమానం అయిపోతాం. వాళ్ళు డాక్టర్లనూ, యింజనీర్లనూ వెతుకుతున్నారు" అంది మైథిలి. నేను లా ఆఫీసర్ని కాగానే వాళ్ళకు మైథిలికి ఒక పెళ్ళిగాని అన్న వున్నాడని గుర్తుకొచ్చింది.

"న్యాయమేగదా! చూస్తూచూస్తూ ఉద్యోగం లేనివాడికి పిల్ల నెవరిస్తారు?" అన్నది అమ్మ.

కట్నం ప్రసక్తి వచ్చినపుడు "చెల్లాయికి మనం యిచ్చినంతయినా పుచ్చుకుందాం" అన్నాను నేను.

"ఛ! వెధవా! వాళ్ళు తప్పువని చేశారని మనం చేస్తామా?" అన్నారు నాన్నగారు.

"డబ్బు తీసుకుని పెళ్ళి చేసుకుంటే కోడలికి మనమంటే ఏమయినా అభిమానం వుంటుందీ?" అని ఆశ్చర్యపోయింది అమ్మ.

మేము కట్నం వద్దన్నందుకు లలిత తరపు వాళ్ళు కూడా మాతో సమానంగా ఆశ్చర్యపోయారు.

మేము కోడలికి నగలు పెట్టనందుక్కూడా చాలా ఆశ్చర్యపోయారు. పెట్టేందుకు అమ్మకు మెళ్ళో సూత్రాల గొలుసు, చెవులకు దుద్దులు తప్ప ఏమీ లేవు.

కట్నం తీసుకోనపుడు కూడా మానుండి నగలు ఆశించటమేమిటా అని నేను ఆశ్చర్యపోయాను.

"కట్నం తీసుకొని, ఆ డబ్బుతో నగలు పెట్టొచ్చుగా" అన్నారట లలిత తల్లిదండ్రులు.

"ఎందుకలాగ? నగలమీద అంత మోజుంటే ఆ డబ్బుతో వాళ్ళే కొనుక్కోవచ్చుగదా!" అన్నాను.

"అదొక ముచ్చటలేరా! నీకు అర్థంకాదు" అంది మైథిలి. మొత్తానికి లలితకూ నాకు పెళ్ళయిపోయింది.

★ ★ ★

అమ్మకూ, లలితకూ చాలాకాలం అభిప్రాయ భేధాలురాలేదు.

"కోడలొచ్చింది. యిక నేను పని చెయ్యనక్కర్లేదు" అనుకునే మనిషి కాదు అమ్మ.

"ముసలివాళ్ళు పడుచుజంట ప్రణయానికీ, స్వేచ్ఛకూ అడ్డు" అనుకునే రకం కాదు లలిత.

అందువల్ల వాళ్ళిద్దరూ ఒకరితో ఒకరు అరమరికలు లేకుండా కలిసిపోయారు. నాన్నగారు మాత్రం సలహా యిచ్చారు.

"కృష్ణా! ఇది మన స్వంత యిల్లు. అందువల్ల అమ్మకూ, నాకూ ఇక్కడ వుండక తప్పదు. నీది బదిలీలు లేని ఉద్యోగం. మీకూ ఈ వూళ్ళో వుండక తప్పదు. అంత మాత్రాన మనం కలిసి వుండవలసిన అవసరంలేదు.

బయటవాళ్ళు ఏదో గుసగుసలు పోతారని సందేహించకు. నువ్వూ, అమ్మాయి మీ ఆఫీసుకు దగ్గర్లో యిల్లు తీసుకుని అక్కడికి మారండి"

"ఎందుకు నాన్నగారూ!" అని నేనంటూ ఉండగానే...



"మీకేమయినా పిచ్చా! నేనింకా వాడికి వున్నవూళ్లో వుద్యోగం వచ్చిందని సంతోషిస్తొంటే మీరేమిటి యిలా మాట్లాడుతున్నారు? ఈ వయసులో నన్ను బిడ్డ నీడన సుఖంగా ఉండనివ్వరా?" అనడిగింది అమ్మ.

అప్పటికే అమ్మ కళ్ళు రెండూ నీటితో నిండిపోయాయి.

నాన్నగారు చల్లగా నవ్వారు.

అమ్మ కుడిచేతిని తన చేతులమధ్య నొక్కిపట్టి "అదికాదే! నేనో, నువ్వో పోతే..."

అమ్మ కోపంగా చేయి లాగేసుకోబోయింది.

"అరె! చాలా కోపం వచ్చినట్టుంది. నీకు



కోపం వచ్చినా సరే నేను చెప్పేది విను. మనిద్దరం అమర ప్రేమికుల్లాగా ఒక్కసారే పోవాలని నాకు చాలా కోరిగ్గావుంది. అయినా అది జరిగే పని కాదుకదా! ఒకరు పోతే మరొకరు ఎలానూ కృష్ణుడి దగ్గర వుండక తప్పదు. ఇప్పుడు యిద్దరమూ వున్నాంగా- ఒకరికొకరు తోడుగా. చిన్న పిల్లలు. వాళ్ళని సరదాగా కొంతకాలం ఒంటరిగా వదలాలని నా ఉద్దేశ్యం''

నాన్నగారి వాదనకు సమాధానంగా ఏం చెప్పాలో నాకు తోచలేదు. నిస్సహాయంగా అమ్మవంక చూశాను. లలిత ఎవరూ పిలవ కుండానే మేము ఉన్న చోటుకు వచ్చింది.

"మీ ఉద్దేశ్యంతో మేమెవరమూ ఏకీభ వించటం లేదు మామయ్యగారూ? కలిసి వుండటంతో మా సరదాలు తగ్గిపోయాయని కానీ, విడిగా వుండటంవల్ల మా సరదాలు పెరుగుతాయని కానీ నేను అనుకోవటం లేదు. మీకు ఆయన తప్ప ఏ పదిమంది పిల్లలున్నా రని ఆయన్ని దూరంగా పంపుతున్నారు? ఆఫీ సుకు దూరమయితే బస్సులో వెళతారు. లేదా స్కూటరు కొనుక్కుంటారు'' అని ఎంత హఠా త్తుగా వచ్చిందో అంత హఠాత్తుగానూ నిష్క్రమించింది.

నాన్నగారు నిర్ఘాంతపోయి చూస్తూండగానే అమ్మ నాన్నగారి పట్టునుండి తన చేతిని విడిపించుకొని,

"మీతో కబుర్లు వేసుకుంటూ కూర్చోవడానికి నాకు తీరికలేదు బాబూ! టీ పెట్టాలి" అంటూ వెళ్ళిపోయింది.

"నరే! నరే! దెబ్బలాడుకుని అప్పుడు విడిగా వుందురుగాని. మీ కందరికీ అదే బావుండేలా వుంది'' అన్నారు నాన్నగారు. మేమెవరమూ మాట్లాడలేదు.

★ ★ ★

కొత్త ఉద్యోగమూ,- లలిత సాహచర్యమూ కలసి జీవితం మధురంగా ఉంది. మాయిల్లు వూరి చివర. ఆఫీసు వూరి మధ్యలో వుంది. వర్ధన్ యింటికి బాగా దగ్గర. బస్సులు ఉన్నా యికానీ ఫ్రీక్వెంట్‌గా వుండవు. అందువల్ల నేను చాలా అలిసిపోయేవాడిని.

నాకు స్కూటర్ కొనుక్కునే స్తోమత యింకా రాలేదు. మైథిలి అత్తగారు దేశంలో లేకపోబట్టి గానీ వుంటే అప్పోసప్పో చేసి ముందు బావగా రికి స్కూటరు కొనవలసివచ్చేది. నేను అందరి స్కూటర్లవంక ఆశగా, ఈర్ష్యగా చూస్తుండేవా డిని.

ఒకరోజు సాయంత్రం నేను బస్ దిగి యింటికి వచ్చేసరికి యింటిముందు రెండు కొత్త స్కూటర్లు నిలిచివున్నాయి. ఒకటి నీలం రంగులో వుంది. రెండవది గోధుమవర్ణంలో వుంది. ఏది అందంగా వుందో తేల్చుకోలేనంత ముద్దుగా వున్నాయి.

ఎవరొచ్చారా అనుకుంటూ లోపలకు వెళ్లేస రికి బావగారూ, మా మామగారూ వచ్చి వున్నా రు.

"ఏ స్కూటరు నచ్చింది కృష్ణా!'' అన్నారు బావగారు. నాకు అర్థంకాలేదు.

"లలిత నీకష్టం చూడలేకపోయిందిరా! స్కూటర్ కొనిమ్మని వాళ్ల నాన్నగారికి రాసిందట'' అంది అమ్మ.

"నేను స్కూటరడిగానా?'' అన్నాను అయో మయంగా.

"మీరడిగారని నేనన్నానా? మామయ్యా, అత్తయ్యా నేనూ అందరూ ఫీలవుతున్నాం మీరు బస్సులో పడి తిరుగుతుంటే చూళ్ళేక. నాన్నగారికి అవకాశం వుంది కనుక కొని తెచ్చా రు'' అంది లలిత.

"అంటే మా నాన్నగారికి లేదా?'' అనడిగా ను.

"కృష్ణా! డోంట్ బీ ఫూలిష్! మీ నాన్నగారే మిటి? వాళ్ళ నాన్నగారేమిటి? భార్య కాబట్టి లలిత బాధపడుతున్నది. ఆయన కొని తెచ్చా రు. నీకు నచ్చితే తీసుకో. డోంట్ ట్రైటు రీడ్ బిట్వీన్ ది లైన్స్'' అన్నారు నాన్నగారు.

"అంటే ఏమిటండీ!'' అంది అమ్మ అమా యకంగా.

అందరం నవ్వాం. అమ్మ కూడా నవ్వింది.

నాన్నగారి అభిప్రాయం నాకు తెలియలేదు. కట్నం తీసుకొని నేను స్కూటరు తీసుకోవాలా? తిరస్కరించాలా? నాన్నగారు సలహా చెప్పలే దు.

అమ్మ వంక చూశాను.





"తీసుకో నాన్నా! లేకపోతే లలిత చిన్నబుచ్చుకుంటుంది" అంది అమ్మ. నేను నీలం స్కూటరు తీసుకున్నాను. తీసుకోకపోతే లలిత చిన్నబుచ్చుకునేదో, లేదో నాకు తెలీదుగానీ, అమ్మ ఆ మాట అన్నాకే నేను తీసుకోవటానికి అంగీకరించినందుకు మాత్రం లలిత చిన్నబుచ్చుకున్నది.

"మీ అమ్మగారండీ అదృష్టవంతులంటే, ముప్పై ఏళ్ళుదాటి, మీ కాళ్ళమీద మీరు నిలబడ్డాక కూడా ఆవిడమాట జవదాటరు మీరు" అంది లలిత. అప్పుడే కాదు. తర్వాత చాలాసార్లు అలా అన్నది. అది మెచ్చుకోవడమో, దెప్పిపొడవటమో, పొగడ్తో, ఈర్ష్యో నాకు పూర్తిగా అర్థంకాలేదు. అందువల్లనే, నేను దానిపై ఏమీ వ్యాఖ్యానించలేదు.

రెండవ స్కూటరు బావగారిదని తెలిశాక అన్నాను,

"న్యాయంగా మేము కొనివ్వాలేమో మీకు?"

"ఆహా!! మా అమ్మ ఇండియాలో వుంటే అంతపనీ జరిగేదే. నవంబరులో వస్తానని రాసింది. వచ్చిందా మీకు 'టాక్స్' వేసిందన్నమాటే. మిమ్మల్ని రక్షించటానికే అవసరం లేకపోయినా ముందుగానే కొనుక్కున్నాను" అన్నారు. ఆయనకు ఆఫీసు జీపు యిస్తుంది.

"మేము అదృష్టవంతులం బాబూ! బంగారంలాంటి కోడలు, రత్నంలాంటి అల్లుడు దొరికారు మాకు" అంది అమ్మ మనస్ఫూర్తిగా.

ఆ మర్నాడు రెండవ స్కూటర్‌మీద మామగారు, బావగారు వెళ్ళిపోయారు.

★ ★ ★

మా పెళ్ళయ్యాక మొదటి పండుగ సంక్రాంతి వచ్చింది. లలిత వాళ్ళ నాన్నగారు ఉత్తరం రాశారు. సూటుకేసునిండా బట్టలు సర్దుకుంది లలిత. నాకు లలిత వెళ్ళిపోతుందంటే దుస్సహంగా వుంది. "నువ్వు వెళ్ళొద్దు లలితా! నిన్ను విడిచి నేను వుండలేను" అన్నాను.

"నన్ను విడిచి ఎందుకు ఉండటం? మీరు కూడా వస్తున్నారు" అంది లలిత.

"నేను రాను లలితా! బావగారూ, మైథిలీ వస్తారు"

"వాళ్ళు యిక్కడికి వస్తారు. మనం మా పుట్టింటికి వెళతాం. అది రివాజు" అంది లలిత.

"ఉహూఁ! కావాలంటే నువ్వెళ్ళు. దాన్ని చూసి చాలా రోజులయింది. నేనురాను" అన్నాను.

సాయంత్రం అమ్మ నన్ను పిలిచి,

"తప్పు కదరా! పండుగకు ఎవరయినా అత్తగారింటికి వెళ్ళటం మానేస్తారా?" అని కోప్పడింది.

"మైథిలి వస్తుందికదమ్మా!"

"వస్తే...? నువ్వొచ్చేవరకు వుంటుందిలే. లలిత మనసు కష్టపెట్టుకుంటుంది, నువ్వెళ్ళు" అంది అమ్మ.

నాకు తెలిసి నాన్నగారు కానీ, మైథిలికానీ, నేనుకానీ అమ్మమాట · ఏదీ కాదనలేదు. అమ్మకు అన్నీ తెలుసని మా అభిప్రాయం. నేను లోపలకు వెళ్ళి నా బట్టలు బీరువానుండి తీసి లలితకిచ్చాను తన బట్టలతోపాటు సూట్‌కేసులో సర్దమని.

"నిజంగా అత్తయ్య చాలా అదృష్టవంతులు. కొడుకంటే మీలా వుండాలి" అంది లలిత.

ఈ మాట వినీ వినీ నాకు తల బొప్పికట్టిపోయింది.

"అహఁ! అలాగా! భార్యమాత్రం నీలా వుండకూడదు" అన్నాను అనాలోచితంగా. అలా అన్నాక యింట్లో నిలబడటానికి నాకు ధైర్యం చాల్లేదు. మళ్ళీ స్కూటర్ స్టార్ట్ చేసుకుని వర్ధన్ దగ్గరకు వెళ్ళిపోయాను.

★ ★ ★

మా అత్తగారింట్లో నాకు అఖండమైన స్వాగతం లభించింది. లలిత అన్నలు, బావగార్లు అంతా పెళ్ళాల్తోసహా అమెరికాలోనే వున్నారు. భారతదేశంలో అఘోరించిన అతిబీద అల్లుడిని నేనే. ఆ విధంగా నేను పండుగకు వచ్చి లలిత తల్లితండ్రులకు సంతోషం కలిగించినందుకు మాత్రం నాకు చాలా ఆనందం కలిగింది. కానీ వాళ్ళు తమ అప్యాయతను

తిండి ద్వారా వ్యక్తపరచడం మాత్రం నాకేమీ నచ్చలేదు. పొద్దున్నే మూడు రకాల టిఫిన్లు, మధ్యాహ్నం భోజనంలోకి గారెలు, బొబ్బట్లు. అవి పూర్తిగా గొంతు దిగకముందే మధ్యాహ్నం టిఫిన్, రాత్రికి భోజనం. భోగిపండుగ ముగిసే నాటికి నాకు పొట్ట ఉబ్బరించిపోయింది.

"నేను తినలేను లలితా!" అన్నాను.

"మా అమ్మ కూడా అత్తయ్య అంత బాగానూ వంటచేస్తుంది" అంది లలిత. దాని భావమేమిటో నాకు తెలియలేదుగానీ సంక్రాంతి నాటికి నాకు విరేచనాలు పట్టుకున్నాయి. కనుమ ఉదయం మా మామగారు కోడి తేనా? వేటమాంసం తేనా? అని డైలమాలో ఉండగా నేను నెమ్మదిగా బయటకు వచ్చి మావూరు బస్సెక్కేశాను. నన్ను మా యింటి గుమ్మంలో చూడగానే మైథిలి సంతోషంతో గావుకేక వేసిందిగానీ, అమ్మ మాత్రం బాగా చీవాట్లుపెట్టి, వెంటనే లలితకు నా రాకను తెలియచేస్తూ టెలిగ్రాం యిప్పించింది. ఈ నా తొందరపాటు చర్యవల్ల నాకు లలితవైపు వాళ్ళలో అమ్మ కూచిననే పేరు స్థిరపడిపోయింది. నేను అమ్మకోసం పారిపోయిరాలేదు. వాళ్ళ ఆతిధ్యాన్ని నా పొట్ట తట్టుకోలేక పోయింది. ఆ నిజాన్ని ఎవరూ గ్రహించనేలేదు. తర్వాత ఎప్పుడూఘా మామగారు నన్ను ఏ పండుగకూ ఆహ్వానించలేదు. ఆయన ఆహ్వానించలేదని నేను వాళ్ళింటికి వెళ్ళటం మానలేదు. అది వేరేవిషయం.



మొత్తంమీద జీవితం సాఫీగానే సాగిపోతోంది. మైథిలికి కొడుకు పుట్టాడు. లలిత తన యమ్మేడిగ్రీ వృథా పోతోందని ఏవేవో ఉద్యోగాలకు దరఖాస్తులు పెట్టుకుంటున్నది. నా ఉద్యోగం సంతృప్తికరంగా వుంది. వర్దన్ ప్రాక్టీసు బాగా పెరిగింది. నాతో గడిపేందుకు వాడికసలు టైము దొరకటంలేదు. నాన్నగారు "మైథిలి కొడుకు వెళ్ళిపోయాక మనయిల్లు చిన్నబోయింది కృష్ణా!" అన్నారు ఒకసారి. "మళ్ళీ రమ్మని రాద్దామా నాన్నగారూ!" అనడిగాను. "ఎవరొచ్చినా ఎన్నాళ్ళుంటార్రా మనింట్లో? మనింట్లోకి పిల్లలు రావాలి" అన్నారు.

ఒకరోజు సాయంత్రం అమ్మ నాకు టీ యిచ్చి వరండాలో ఈజీ ఛెయిర్లో పడుకుని వున్న నాన్నగారి దగ్గరకు టీ యిచ్చేందుకు వెళ్ళింది.

ఆ వెంటనే అమ్మనోటివెంట చిన్నకేక, టీ కప్పు పడిన శబ్దమూ విన్పించాయి.

నేను లేచి వెళ్ళి చూసేసరికి నాన్నగారు పక్కకి ఒరిగి వున్నారు. ఎంతసేపయిందో తెలియదుగానీ, ప్రాణం పోయిందని అర్థమైంది నాకు.

వెంటనే తలతిప్పి అమ్మని చూశాను. నెమ్మదిగా నేలమీదకు జారిపోతోంది.

నాకు ఊహ తెల్సిన నాటినుండీ మాతో ఉన్న అమ్మ వేరు, నేను ఆమె నగలు నిలువు దోపిడీ చేశాక కూడా నల్లపూసలు, పెద్ద బొట్టు, చేతినిండా గాజులు, ఎప్పుడూ తలలో పూలు, పెదవులమీద చిరునవ్వుతో వెలుగుతుండేది. అమ్మ ముదురు రంగు చీరెలు కట్టుకునేది. అమ్మ ఒక్కక్షణం పక్కింటికి వెళితే తను యింట్లో లేదని అర్థమైపోయేది మాకు.

"ఎక్కడికి వెళ్ళావమ్మా?" అనడిగితే.

"ఏమిరా? నాకు పక్కింటికి వెళ్ళే స్వేచ్ఛ కూడా లేదన్నమాట" అనేది కోపం నటిస్తూ. అలా స్వేచ్ఛ లేకపోవటాన్ని అమ్మ ఎంజాయ్ చేసేది అన్పిస్తుంది. నాన్నగారూ, చెల్లాయీ, నేనూ- మేమే ప్రపంచంగా బ్రతికింది. అమ్మది చాలా చిన్న ప్రపంచం. తన ప్రపంచంలో నుండి తన నగభాగం అంత హఠాత్తుగా వెళ్ళిపోవటం అమ్మని దిగ్భ్రాంతివరిచింది.

అమ్మ గుండెలు బాదుకుని శోకాలు పెట్టలేదు.





ఆత్మహత్యా ప్రయత్నాల్లాంటివి చేసి పిల్లల్ని బెంబేలెత్తించలేదు.

ఇతరులముందే తన దుఃఖాన్ని ప్రదర్శించలేదు.

కానీ, నాన్నగారి మరణంతో అమ్మ నవ్వటం మర్చిపోయింది. అసలే సన్నగా వుండే అమ్మ మరింత సన్నబడి దుఃఖభారంలో కుంగిపోయినట్టు తోచేది.

నాన్నగారు రిటైరయిన నాటినుండి జతగా అమ్మని చూడటం అలవాటయిన నాకు అమ్మని ఒంటరిగా చూడటం గుండెని రంపపుకోత కోసినట్టు వుండేది.

తెల్లని దుస్తులు, నూనె రాయడం మానేసిన జుట్టు, బోసిమెడ, బోసి చేతులు, క్రింద నల్లని చారలతో లోతుకుపోయిన కళ్ళు ఎవరీవిడ? అమ్మేనా? లేక అమ్మ ఛాయ మాత్రమేనా? ఉదయం వంటచేసి తమ గదిలోకి వెళ్ళి పడుకునేది.

ఆ గదిలో నాన్నగారి స్మృతులు ఉన్నాయి. అమ్మ వాటి ఆసరాతోనే యింకా జీవించి వున్నట్టు తోచేది నాకు. ఒకటి రెండుసార్లు నేను అమ్మకు తెలీకుండా తనను గమనించాను. కొంతసేపు నిద్రపోయేది. కొంతసేపు శూన్యంలోకి చూసేది. ఎప్పుడయినా పాత ఆల్బమ్‌లు తిరిగేసి చూసుకుంటూ వుండేది.

అమ్మ నాన్నగారి విరహంలో సంభవించిన దుఃఖాన్నంతా ఒంటరిగా భరించటం మొదలుపెట్టింది. చివరకు కొడుకునయిన నాతో కూడా పంచుకోలేదు. అమ్మ ఏకాంతాన్ని భగ్నం చేసేహక్కు నాకు లేదన్పించేది. నేను పూర్తిగా లలితమీద ఆధారపడాలని నిశ్చయించుకున్నాను.

ఒకసారి రామకృష్ణ పరమహంసను ఎవరో అడిగారట. "స్వామీ! మీరు సర్వసంగ పరిత్యాగులుకదా! మీకు ఐస్‌క్రీం అంటే అంత యిష్టం ఎందుకు?" అని. దానికాయన "పిచ్చివాడా! జీవితంలో దేనిమీదా యిష్టం లేకపోతే ఈ శరీరం యీ ప్రపంచంలో ఎందుకుంటుంది? దీన్ని యిక్కడ వుంచటానికి దేనిమీదో ఒకదానిమీద యిష్టాన్ని వుంచుకోవాలి" అన్నారట. అలా అమ్మ కూడా "మా మీద యిష్టంతోనే యింకా బతికివుంది. లేకుంటే నాన్నగారితోపాటే చనిపోయేది అన్పించేది నాకు. ఇంత నిరాసక్తతతో కూడా వంట తానే చేసేది. నేను భోజనం సరిగ్గా చేయనేమో అని దిగులు.

"వంట లలిత చేస్తుందిలే అమ్మా!" అని నేనంటే.

"ఆరోజు కూడా వస్తుందిలే నాన్నా!" అనేది.

లలిత అమ్మపట్ల చాలా శ్రద్ధవహించేది. మునుపటిలా అమ్మతో కుట్లు కుట్టించాలని, బుట్టలు అల్లించాలని, అందమైన చేతిపనులు చేయించాలని తాపత్రయపడేది. తద్వారా అమ్మను ఆ దుఃఖంలోనుండి బయటకు లాగాలని లలిత వుద్దేశ్యం.

అమ్మకి దుఃఖంలేదు. నిరాసక్తత. దుఃఖం కంటె లోతైనది. బలమైనది. భయంకరమైనది.

దుఃఖం ఒకభావన...

నిరాసక్తత భావరహితం.

భావరాహిత్యం కంటె బాధాకరమైన భావన చాలా నయం.

అమ్మ తన దుఃఖాన్ని ప్రకటించలేదు. ప్రకటించని దుఃఖాన్ని ఉపశమింప చేయటం ఎలా?

అమ్మ మౌనం, అమ్మ ఏకాంతం రెండూ దుర్భేద్యంగానే వున్నాయి. అందరిలాగే అమ్మ ఏడవకూడదా? నేను ఓదార్చేవాడిని కదా అనుకునేవాడిని. నాన్నగారి గురించి ఏమయినా మాట్లాడకూడదా? నేను తన భావాలను పంచుకునేవాడిని కదా!

అమ్మ రెండూ చెయ్యలేదు. లలిత చాలాసార్లు అమ్మగదిలోకి వెళ్ళి, అమ్మ పక్కన ఆ గదిలో కూర్చుని, ఎన్ని గంటలు గడిచినా అమ్మ కళ్లు తెరవకపోవటంతో వచ్చేసేది. కళ్ళు తెరిస్తే మనుషులు తనతో మాట్లాడతారు. తాను ప్రతిస్పందించవలసి వస్తుందని భయపడేదాని లాగ తోచేది అమ్మ నాకు.

కొందరు ఈ దశలో ఆధ్యాత్మికతవైపు మనసు మళ్ళిస్తారు. కాని, అమ్మ ఆ ప్రయత్నం ఏమీ చేస్తున్నట్టు తోచదు. అమ్మకు భక్తి వున్నది.



కానీ మూఢ భక్తి ఏనాడూ లేదు. భోజనానికి రాను అంటూ ఫస్ చేసి సీను క్రియేట్ చేసేది కాదు. లలిత 'భోజనం వడ్డించానండీ' అన గానే వచ్చి కూర్చుని భోజనం చేసేది. బ్రతిమా లించుకోవటం అన్నం కెలికి వదిలేయటం, సహించలేదనటం ఏమీ లేదు. నిర్లిప్తంగా, ఊపిరి ఎలా పీలుస్తోందో, అలాగే భోజనం చేసి వెళ్ళిపోయేది.

లలితకు ఎప్పుడూ వంట యిష్టంలేదు.

వంట ఎవరికి మాత్రం యిష్టం వుంటుంది? అనకండి. మగవాడయినా వర్ధన్ కి వంట చేయటం చాలా యిష్టం. ఇప్పుడు సంపాదనలో పడిపోయి తినటానికి కూడా టైము వృధా అవుతుందనుకుంటున్నాడను కోండి. అది వేరే విషయం.

లలిత ఉద్దేశ్యంలో వంటచేయటమంటే సమయాన్ని నిర్దాక్షిణ్యంగా గ్యాస్ స్టౌమీద కాల్చడమే. ఆమె అదృష్టం అనుకుంటా మా యింటి కోడలయింది. పిల్లలకూ, భర్తకూ వంట చేయటమంటే తపన్ను. వాళ్ళు కడుపు నిండా తింటే తన జీవితం ధన్యం అనుకునే అమ్మ అత్తగా దొరికింది. లలితకు సమస్యలేమీ ఎదురుకాలేదు. అమ్మకు సహాయం చేయటం, నవలలు చదవటం, కుట్లు కుట్టడం, యిల్లు శుభ్రంగా వుంచడం యిత్యాది పనులతో కులాసాగా కాలం గడిపేది. ఇందుకేనా లలిత వేరు కాపురం వద్దన్నది అని నా వంకరబుద్ధి అపుడపుడు సందేహపడుతుండేది.

కొన్ని రోజుల తర్వాత అమ్మ మానసికస్థితి శరీరాన్ని జయించటంవల్ల, అమ్మ మంచం ఎక్కకతప్పలేదు. లలిత వంటింటి ప్రవేశం చేయకా తప్పలేదు. ముందు పదిరోజులు అమె అమ్మ చేసినట్టు వంట చేయటానికి ప్రయత్నించింది. లలిత చదువుకున్నది. వంట బ్రహ్మావిద్యకాదు. పైగా మా యింటికి వచ్చేక వంటని వదిలేసిందిగానీ పుట్టింట్లో కొద్దో గొప్పో వంటచేసి వున్నదే. యిన్ని రోజులూ అమ్మకు సహాయంచేస్తూ వంటింట్లోనే వుంది కూడాను. అందువల్ల, ఆమెకు వంట కష్టం కాలేదు. మా పద్ధతి ప్రకారమే వంట చేసింది. ఏదో ఒకరోజు అయితే సరదా అనుకున్నప్పటికీ ఆ సరదా కూడా లలితకున్నట్టు తోచదు. రెండోరోజు కొంచెం యిబ్బందే, పోనుపోనూ దుర్భరం. ఒక నెల గడిచేసరికి లలిత ఆ స్థితికి చేరుకున్నది. అమ్మలా, గ్యాస్ సిమ్‌లో పెట్టి, కమ్మగా వండటం లలితకు పెద్ద శిక్షలా తోచింది.

"ఉన్నది ముగ్గురు మనుమలం. నా జీవిత మంతా వంటింట్లో గడిచిపోయేలా వుంది" అని సణిగేది నా దగ్గర.

నేనే దగ్గరకు తీసుకోబోతే "పగలంతా నీకు వంటచేయటానికి, రాత్రిళ్ళు నిన్ను కౌగలించు కోవటానికి. ఈ జన్మకి ఈ శరీరానికి యింత కంటే సార్థకత వున్నట్టు లేదు" అంది బిట్టర్‌గా. ఆమె గొంతులో ఎంత ఆర్ద్రత వున్నదంటే నాకు నిజమే పావం! అని పించింది.

కానీ, ఏం చెయ్యాలో నాకు తోచలేదు. ఐకెన్ స్టాప్ మేకింగ్ లవ్ టు హర్. కాని వంటింటి విషయం ఏం చెయ్యను? ఖాళీగా, నిరుద్యోగిగా వున్నరోజుల్లో కూడా అమ్మ.

"పనిపిల్ల రాలేదురా కృష్ణా! కొంచెం 'సెంటర్'కెళ్ళి పిండి రుబ్బించుకు రమ్మంటే" తలెగరేసి వెళ్ళిపోయేవాడిని. పాపం! అమ్మే పిండి రుబ్బుకునేది. ఇప్పుడు 'పాపం' అంటున్నాను కానీ అప్పుడెప్పుడూ పాపం అన్పించలేదు. బహుశా అమ్మ అన్పించనివ్వలేదు.

"ఇంకో రెండు ఇడ్లీలు వెయ్యమ్మా" అంటే.

"వెధవకి ఇడ్లీలు కావాలట. నిన్నపిండి ఆడించుకురావటానికి ఒళ్ళు వంగలేదు కానీ" అంటూనే నా పొట్టనింపేది. ఎక్కడుంది తేడా?

ఎప్పుడూ దేనికీ సణక్కుండా, పిల్లలకి తను కష్టపడుతున్నట్టు తెలీకుండా పెంచిన అమ్మలోనా?

ఎవరి వాదన విన్నా 'నిజమేనుమా' అన్పించే నాబుర్రలోనా? ముగ్గురు మనుమల వంటని యజ్ఞంతో సమానంగా కనిపించేలా చేసే లలితలోనా?

లేక మా ముగ్గురిని ఒక కప్పుకింద చేర్చిన భగవంతుడిలోనా? ఏది తప్పు? ఏది ఒప్పు? నేనిప్పుడు ఏం చెయ్యాలి? లలితకు వంటింట్లో సహాయం చెయ్యనా? నాకు రాదే, సమయమూ సరిపోదు. నేనీ సందిగ్ధంలో




ఉండగానే మైథిలి వచ్చింది.

★ ★ ★

ఆడపిల్లలు పుట్టింటికి విశ్రాంతికోసం వస్తారంటారు. ముందునుంచీ అమ్మ మైథిలికి పెద్దవని చెప్పేది కాదు. నేను మగపిల్లవాడినని నన్ను ప్రత్యేకంగా చూసిందీలేదు. మైథిలి ఆడపిల్లని అనవసరపు హద్దులు గీసిందీలేదు. ఇద్దరమూ చాలావరకు మా పనులు మేము చేసుకునేవాళ్ళం. అప్పుడు నాన్నగారు 'సర్వీస్'లో వున్నారేమో బయటపని చూసేందుకు ఒక అటెండర్ వుండేవాడు. ఇంట్లో పనికి ఒకపనిపిల్ల వుండేది. నేనూ, మైథిలి చదువుతోనూ, స్నేహితులతోనూ తీరికలేకుండా ఉండేవాళ్ళం. శలవులలో మాత్రం అమ్మ మైథిలితో సాయంత్రం వంట చేయించేది. అది బియ్యే ఫస్టుక్లాసులో పాసయింది. పాపం! యమ్మే చదవాలని చాలా ఆశపడింది. "ఈ షేక్స్పియర్‌గురించి నగమే తెల్సిందిరా అన్నయ్యా! ఈయన అంతం చూడాలనివుంది" అనేది. కానీ, అమ్మ దాని కోరిక తీరనివ్వలేదు. "ఉహుఁ వద్దు, నీకు పెళ్ళిచేసెయ్యాలి. ఇక చదివించం" అంది అమ్మ.

"అమ్మా! ఇది చాలా అన్యాయం. వక్షపాతం. అది బంగారుతల్లిలా చదువుకుంటోంటే చదువు మాన్పించేస్తావా?" అన్నాను.

గమ్మత్తుగా నాన్నగారు ఏమీ మాట్లాడలేదు. ఇంకా గమ్మత్తుగా వారంతర్వాత మైథిలి కూడా పట్టు పట్టలేదు.

"మీ అమ్మ దాన్ని 'బ్రెయిన్‌వాష్' చేసేసిందిరా. అది యమ్మే అప్లికేషన్ తెచ్చుకోదేమి?" అన్నారు నాన్నగారు.

"పదవే! అప్లికేషన్ తెచ్చుకుందాం" అన్నాను మైథిలితో.

"వద్దురా. నేను చదవను" అంది.

ఆ గొంతులో రాజీలేదు. నిరాశలేదు. నాకీ రోజుకీ అనుమానం ఏమంటే అమ్మ దానితో "నాన్నగారు రిటైరైపోతున్నారు కృష్ణుడి చదువు పూర్తికాలేదు. (నేను 'లా' ఆఖరి సంవత్సరం చదువుతున్నాను) నీకు పెళ్ళి చెయ్యాలి. ఆలోచించుకో' అనివుంటుందని. ఏమయ్యిందో తెలియదు. అంతా నా ఊహాగానమే.

మొదటి సంబంధమే బావగారిది వచ్చింది. అమ్మ మైథిలిని సంతవశువులా అందరికీ చూపటానికి ఒప్పుకోలేదు. నాన్నగారూ, అమ్మా, నేనూ వెళ్ళి బావగారినీ, ఇంటినీ చూసివచ్చాం. ఆ ఊరు వెళ్ళేక మధ్యవర్తి ఇంకో సంబంధం వుందంటే అదీ చూశాం. ఈ రెండవ సంబంధం వాళ్ళు చాలా ధనవంతులు. కట్నం కూడా ఎక్కువ అడగలేదు. అబ్బాయి కొద్దిగా రంగుతక్కువ కానీ బాగానే వున్నాడు. సి.ఏ చదువుతున్నాడు.

ఇక్కడ పెద్దగా చదువుకోని అమ్మ చాలా తార్కికంగా ఆలోచించింది. బావగారు అప్పటికే ఇంజినీరుగా పనిచేస్తున్నారు. "సి.ఏ. చదవటమేమిటి? ఐఏయస్ చదవటంలాగా. సిఏలు, ఐఏయస్‌లు అయిన వాళ్ళకి పిల్లనివ్వవచ్చుగానీ చదువుతున్నవాడికి ఇవ్వటం బుద్ధితక్కువ. ఆ చదువు ఎప్పటికి పూర్తవుతుందో, అసలు అవుతుందో అవదో ఊహించటం కష్టం. ఆ ఇంట్లో మైథిలి అయిదు నక్షత్రాల హోటల్‌లో పల్లెటూరిదానిలాగా ఫీలవుతుంది"

బావగారి 'కల్చరల్ బ్యాక్‌గ్రౌండ్' మాదీ ఒకటి. అమ్మకి ఆ మాట అనటం చేతకాలేదు కానీ ఆవిడ గ్రహించింది అది. కట్నం ఎక్కువ అడిగారు, కానీ తల్లి లాంఛనాలు వగైరా మాట్లాడుతున్నంతసేపూ బావగారు, ఆయన అన్న (అప్పటికే ఆయన అమెరికాలో వున్నారు) ఆవిడకు అడ్డువస్తూనే వున్నారు. ఈ అంశం అమ్మ తల్లి హృదయానికి చాలా నచ్చింది. బావగారు కూడా అమ్మ నమ్మకాన్ని వమ్ము చెయ్యలేదు. మైథిలి అత్తగారు రెండేళ్ళకొకసారి నవంబరులో వచ్చి రెండునెలలు వుంటుంది. అమ్మ సిద్ధాంతం ప్రకారం ఆవిడకు పాదాల్లో చక్రాలున్నాయి. అందువల్ల వీరావేశంతో బంధువులందరిళ్ళూ తిరిగి అమెరికా కబుర్లు విన్పిస్తుంది. ఒక పదిహేను రోజులు మాత్రం మైథిలి వాళ్ళింట్లో గడుపుతుంది. ఆ పదిహేనురోజులూ దీనికి అగ్నిపరీక్షే. ఆవిడ విమానం ఎక్కేక కానీ మైథిలికి వూపిరందదు. ఆవిడ వున్నప్పుడు బావగారు క్యాంపులకు వెళ్ళరు. ఆమె అదంతా తనమీద



ప్రేమే అనుకుంటుంది. తన భార్యని రక్షించుకోవటానికని బావగారు ఆమెకు తెలియనివ్వరు ఆయన పెద్ద డిప్లొమాట్. కానీ ఆయన తన డిప్లొమసీని మంచికే ఉపయోగిస్తారు.

మైథిలి వచ్చేక లలితకు కొంత తీరిక వచ్చింది. లలితతోపాటు వంటింట్లో దూరి దాని శాయశక్తులా లలితకు సహాయపడింది.

నా మనసు కొట్టుకుపోతూ వుంది.

"నువ్వు అమ్మని చూసుకో. అమ్మని ఆ నిర్లిప్తతనుండి బయటపడెయ్. ఆ వంటా పెంటా లలిత చూసుకుంటుందిలే" అనాలని వుంది.

కానీ ఏ అదృశ్యశక్తో నన్ను భుజంతట్టి హెచ్చరిస్తోంది. లలిత ఎటువంటి ఎటాక్ చేస్తుందో చెప్పలేను. నేను యుద్ధాల్లో ఆరితేరినవాడినీ కాను, ఆసక్తి వున్నవాడినీ కాను. అందువల్ల నోరు మూసుకున్నాను. కానీ, దీనివల్ల జరిగిన మంచి ఏమిటంటే మైథిలి కొడుకు అమ్మ దగ్గరకు వెళ్ళేవాడు. మమ్మల్ని నిర్లక్ష్యం చేసినట్టు అమ్మ వాడిని నిర్లక్ష్యం చేయలేకపోయింది. స్తబ్ధతలోనుండి వాడు అమ్మని బయటకు లాగడంలో కొంతవరకు కృతకృత్యుడు కాగలిగాడు.

★ ★ ★

ఇరవైరోజులు నిశ్చింతగా, పడకగదిలో లలితనుండి ఫిర్యాదులు వినకుండా గడిచిపోయాయి. కానీ పెళ్ళయిన ఆడపిల్ల పుట్టింట్లో ఎన్నిరోజులుంటుంది? ఒకరోజు బావగారు మైథిలికోసం వచ్చారు. ఆయన ఎప్పుడొచ్చినా నాకు మంచి స్నేహితుడిని చూసినట్టు వుంటుంది. అల్లుడిననే భేషజంలేదు. అమ్మ వంటరుచి చూసి, "ఓహో! మైథిలి చేసే వంటలకు మాతృకలు ఇవన్నమాట. వీటికి వికృతరూపాలని మా ఆవిడ చేస్తోంటే నేను ఎంతో రుచిగా ఉన్నాయనుకుంటూ ఇన్నాళ్ళూ అజ్ఞానంతో తిన్నానన్నమాట" అంటారు ఆయన వున్న నాలుగురోజులూ ఇల్లు నవ్వుల నావే.

లలిత పిండిమిరియం వడ్డిస్తే.

"లలితా! నువ్వేమీ అనుకోనంటే దీనికి వేరే ఏదైనా పేరు పెట్టకూడదా? అత్తయ్యా చేసేది ఫస్టుగ్రేడ్, నా భార్య చేసేది సెకండ్‌గ్రేడ్, నీది మరో ఫోర్త్‌గ్రేడ్" అన్నారు.

లలిత చాలా అలిగింది.

"నువ్వు అమ్మ పోలికే. వంటింటికీ నీకు పడదు. ఆవిడ అదృష్టం బావుండి ఫాస్ట్‌ఫుడ్స్ లోకి వెళ్ళి పడింది. కృష్ణ క్షమించుగాక. నువ్వు వీళ్ళపాల లేక వీళ్ళు నీ పాలనోపడ్డారు" అన్నారు.

"మైథిలి సావాసంతో నీక్కూడా తిండి పిచ్చి పట్టుకుంది" అంది లలిత అక్కసుగా.

మా ఇంటి సభ్యులందరికీ భోజనప్రియత్వం ఎక్కువని లలిత ఉద్దేశం. కానీ ఈ విషయంలో నేనామెతో ఏకీభవించను. మేమెవరం భోజనప్రియులం కాదు. పళ్ళాలకు పళ్ళాలు భోంచెయ్యము. తినేది కొంచెమే అయినా పరిశుభ్రంగా, రుచిగా చేస్తుంది అమ్మ. అదే మాకు అలవాటయింది. ఆ మాటకు వస్తే శనివారం సాయంత్రం మేమెవరమూ టిఫిన్ కూడా తినం. మజ్జిగ మాత్రం త్రాగి ఊరుకుంటాం. భోజనప్రియులమైతే అలా వుండగలమా? పెళ్ళయిన కొత్తల్లో శనివారపు సాయంత్రాలు ఆకలికి తట్టుకోలేక లలిత హొటల్‌నుండి టిఫిన్ తెప్పించుకునేది. తర్వాత అమ్మ ఇంట్లో చేయటం మొదలుపెట్టింది.

"నాకు సిగ్గుగా వుంటుంది. నా ఒక్కదాని కోసం మీరిలా చెయ్యటం" అంది లలిత.

"సిగ్గెందుకమ్మా! అది నీ అలవాటు. ఇది మా అలవాటు. నా పిల్లలకయితే నేను చెయ్యనూ?" అంది అమ్మ.

ఆ తర్వాత కూడా లలిత మమ్మల్ని భోజనప్రియులు అనటం మానలేదు. యిప్పుడు బావగార్ని పట్టుకుని నీక్కూడా తిండి పిచ్చిపట్టుకుంది అనేసింది.

దానికాయన "లేదు లలితా! యిది తిండి పిచ్చికాదు. భోజనాన్ని మరీ అంత నిరాసక్తంగా తినక్కర్లేదని తెల్సింది నాకు. ఒప్పుకోరు కానీ నీకూ, అమ్మకూ కూడా అత్తయ్యా చేతి వంట యిష్టం. ఆ తినేదేదో కొంచెం రుచికరంగా చేసుకుంటే తప్పులేదుగా!" అన్నారు.

"హుఁ!" అంది లలిత.

ఆయన యింకా సంభాషణను పొడిగించబోతోంటే లలిత చూడకుండా మైథిలి ఆయ

నకు నమస్కారం చేసి నోరుమూయించింది.

నేను ఆఫీసుకు వెళ్తుంటే ఆయనకూడా నాతో వచ్చారు.

"మీ అమ్మగారు ఎలా ఉన్నారు?" అనడిగారు దారిలో.

"అమ్మని చూస్తే భయంవేస్తుంది. దిగులుగా ఉంటుంది. మైథిలీ, బాబు వచ్చేక కొంతనయం" అన్నాను.

"పోనీ మైథిలిని కొన్నాళ్ళు యిక్కడ వుంచేయనా?"

"వద్దు... ఎన్నాళ్ళు? మీకు యిబ్బంది. పైగా యిది తేలే సమస్యకాదు. కాలమే దీనికి మందు"

ఆయన దీర్ఘంగా నిశ్వసించారు. నేను మా ఆఫీసు ముందు ఆగాను. ఆయన నా స్కూటర్ తీసుకుని వూళ్ళోకి వెళ్ళారు. తిరిగి సాయంత్రం నా ఆఫీసుకి వచ్చారు.

"కృష్ణా! నాకో అయిడియా వచ్చిందోయ్"

"...."

"మీ అమ్మగారిని మాతో తీసుకువెళ్తాను. కొన్నాళ్ళు అక్కడ వుండి వస్తారు" ఈ ఆలోచన నాకు నచ్చింది. అమ్మ మైథిలితో వాళ్ళింటికి వెళ్ళిపోయింది.

★ ★ ★

ఉదయం లేవగానే నాకు గుర్తుకొచ్చిన మొట్టమొదటి విషయం అమ్మ యింట్లో లేదు.

నాకు వూహ తెల్సిన నాటినుండీ ఒక్కరోజు కూడా యిలా జరగలేదు... అమ్మ లేకుండా. ఒక కన్నీటి చుక్క కంటి చివరనుండి చెవిమీదకు జారింది. లలిత చూస్తుందని భయంవేసింది.

డైనింగ్ టేబిల్ దిశ మార్చివుంది. యిల్లు కొత్తగా వుంది. నాకు ఆశ్చర్యం వేసింది. లలితకు అమ్మ దర్శకత్వం నచ్చలేదా? అన్పించింది.

లలితను అడుగుదామా? అనుకున్నాను. నన్ను లలిత స్థానంలో వూహించుకుంటే ఆమెను అడగవల్సిందేమీ కన్పించలేదు. తనకు కూడా మార్పు కావాలన్పించి వుండవచ్చు.

యిది ఎంత లేదన్నా లలిత యిల్లు కూడా. తన యింటిని తన కనుగుణ్యంగా మార్చుకోవడానికి ప్రతి యిల్లాలికీ హక్కువుంది. ఎంత ప్రేమించుకున్న వాళ్ళకయినా భిన్నాభిప్రాయాలుండవా? భేదాభిప్రాయాలుంటే కష్టం కానీ భిన్నాభిప్రాయాలుండడం తప్పులేదు కదా!

ఆ మాటకొస్తే మైథిలి శలవులిచ్చినపుడల్లా యింటిని దానికి తోచిన విధంగా మార్చేసేది.

బేసిక్‌గా ఈ సంఘంలో స్త్రీ స్వేచ్ఛకు సంకెళ్ళున్నాయి. ఇంటి పరిధిని దాటి ఆమెను పోనివ్వరు. స్త్రీ పురుష భేదం పాటించమనుకునే మా యింటో కూడా ఈ తేడా నాకు కొట్టొచ్చినట్టు తోచేది. శలవులిస్తే, నేను చాలా సమయం వర్ధన్‌తో గడిపేవాడిని. ఒక్కొక్కసారి వాళ్ళింట్లోనే భోజనం కూడా చేసేసేవాడిని. అమ్మకు చెప్పకుండా మొదటి ఆట సినిమాకు వెళ్లిపోయిన రోజులున్నాయి. "చెప్పిపోరాదురా" అనేది అమ్మ. అంతకుమినహా కోప్పడింది లేదు.

నాకేనా? మైథిలికి మాత్రం స్నేహితులు లేరూ? అయినా అది నాలాగ యిర్రెగ్యులర్‌గా ఎప్పుడూ ప్రవర్తించలేదు. వాడు మగవాడు. నువ్వు ఆడపిల్లవి అని ప్రత్యేకంగా అమ్మదానికి చెప్పి వుండకపోవచ్చు. కానీ సంఘమూ, నాన్నగారి హోదా, మా యింటి సంస్కృతీ దానికి ఎప్పుడూ కనిపించని సంకెళ్ళుగావుండి, దాని స్వేచ్ఛను అరికట్టి వుంటాయి. నేను వూరు తిరగటం ఎంత స్వాభావిక మనుకున్నానో, యిల్లు సర్దడం అంత స్వాభావికమనుకుని వుంటుంది. అందువల్ల స్త్రీ దృష్టి ఎప్పుడూ యింటిని దాటిపోదు. మగవాడి దృక్పథం విశాలమయినది. ఇందులో గర్వించటానికేమీ లేదు. సంఘం అతనికి దోహదపడుతుంది. ఆ సంఘమే స్త్రీ పరిధిని సంకుచితం చేస్తుంది. అందుకే నాకు రచయిత్రులు ఏడంతస్తుల మేడలు, యినుప వక్షుల్లాంటి కార్లు, ఆజానుబాహువులయిన ఆరడుగుల కథానాయకులు, ద్రాక్షతోటల మీద సంవత్సరానికి కోట్ల కొద్దీ లాభాలు, అని రాస్తే కోపం రాదు. దిగులు వేస్తుంది. వారిని కల్పనాశక్తిగల తమతోటి స్త్రీని అంతకంటే ఎక్కువ ఎదగనివ్వని సంఘం మీద కోపం వస్తుంది. మగవాళ్ళు ఇటువంటి కాల్పనిక సాహిత్యం రాస్తే మాత్రం





ఆశ్చర్యం వేస్తుంది. కోపం వస్తుంది. ప్రపంచంలో తిరుగుతూ, ప్రపంచాన్ని యిన్ని విధాలుగా గమనిస్తూ కూడా యింత సంకుచితమయిన పరిధిలో వుండిపోయారేమా అనుకుంటాను.

ఆ కారణంగా నాకు లలిత యింటి అలంకరణ మారిస్తే కోపం రాలేదు. మైథిలి కూతురు కాబట్టి చనువు తీసుకుని దానిష్టం వచ్చినట్టు మార్చేది. లలిత కోడలు కాబట్టి అమ్మ దగ్గర చనువు తీసుకోలేకపోయి వుండవచ్చు. ఆమెదీ స్త్రీ హృదయమేకదా!

"ఎలా వుందండీ?" అనడిగింది భోజనాల గదినీ, బల్లనీ సంతృప్తికరంగా చూస్తూ "బావుంది కదూ!"

"చాలా బావుంది లలితా!" అన్నాను. లలిత సంతోషపడింది. తర్వాతిమార్పు క్రమక్రమంగా వచ్చింది. రిఫ్రిజిరేటరు, బట్టల స్టాండు, టి.వి. కుర్చీలు, టీపాయ్ అటువిటూ, యిటువటూ అయ్యాయి. నాకు మొదటిసారిగా లలిత మీద జాలికల్గింది. పాపం! పీజీ చేసిన లలితకు చేసేందుకేమీ లేదు. యింటిని అలంకరించడం తప్ప అన్పించింది. ఈ మార్పు లేవీ నా మీద ఎటువంటి ప్రభావమూ చూపలేదు. నన్ను సంతోషపెట్టి ఉండకపోవచ్చు. యిబ్బంది కూడా పెట్టలేదు. అందువల్ల నేను లలితను సానుభూతితో పరిశీలించాను. అర్థం చేసుకున్నాను.

కానీ లలిత వంటను క్లుప్తీకరించి ఉదయం టిఫిన్‌గా బ్రెడ్, ఇన్‌స్టెంట్ కాఫీని ప్రవేశపెట్టినపుడు మాత్రం నేను ప్రతిస్పందించాను. ఈ ఉపాహారం నాకు రుచించలేదు. నా నిరసనను నేనువ్యక్తం చేశాను కూడా. కానీ దానికి ఫలితం ఏమీ కన్పడలేదు. మగవాడికి యిల్లు జీవితం కాదు. జీవితంలో ఒక భాగం. దానిమీద అభిప్రాయాలకు, వాదోపవాదాలకు అతను ఎక్కువ సమయాన్ని వెచ్చించలేడు. బయట అడుగుపెట్టగానే అతని ప్రపంచం విశాలమవుతుంది. యిల్లు లాంగ్ షాట్‌లో దృశ్యంలా చిన్నదై, తర్వాత మాయమైపోతుంది. స్త్రీకి యిల్లే జీవితం. భర్త బయటకు వెళ్ళిపోగానే ఆమె ఆ విషయమై మరింతగా ఆలోచిస్తుంది. ప్రతి సన్నివేశమూ, అప్రధానమయిన విషయం కూడా క్లోజప్‌లోలా పెద్దగా కన్పడుతుంది. మా యిద్దరి విషయంలో అదే జరిగింది. లలిత అసంతృప్తిని తట్టుకునే శక్తి నాకు లేదు. చివరకు లలితే జయించింది.

నేను అమ్మలేని జీవితానికి ఎడ్జస్ట్ అవుతున్నాను. చిన్నప్పుడు చాలా కోరికలుండేవి. నాన్నగారిని, అమ్మని చాలా సుఖపెట్టాలని కలలు కనేవాడిని. నాన్నగారు లోకంలో లేరు. అమ్మ నా దగ్గరలేదు. వర్ధన్ దగ్గర నా గోడంతా మొరపెట్టుకునే వాడిని "నువ్వొక్కడ సెంటిమెంటల్ ఫూల్‌వి దొరికావురా నాకు" అని విసుక్కునేవాడు. రోజులు గడుస్తూనే వున్నాయి.

★ ★ ★

నేను నిద్రలేచి చాలా సేపయింది. లలిత నిద్ర లేవలేదు. అలా ఎప్పుడూ జరగలేదు. ఒంటి మీద చెయ్యివేసి చూశాను. కొంచెం వెచ్చగా వున్నట్టన్పించింది. పనిమనిషి వచ్చి పాలు కాచి కాఫీ చేసింది.

"లలితా! లేచి టాబ్లెట్ వేసుకో. జ్వరం వచ్చినట్టుంది. కొంచెం కాఫీ త్రాగు"

లలిత కళ్ళు తెరిచి నవ్వింది. ఇద్దరం భోజనాలబల్ల దగ్గర కూర్చున్నాం. చాలా సేపు గోళ్ళు చూసుకుంటూ గడిపింది. కాఫీతాగి, టాబ్లెట్ పక్కకి తోసేసింది.

"వేసుకో లలితా! జ్వరంగా వున్నట్టుంది" అన్నాను.

"ఉహుఁ! మంచిది కాదేమో!"

"అదేమిటి? మంచిదేనే. ఎక్స్‌పైరీడేట్ చూసే యిచ్చాను"

"మట్టి బుర్ర" అని సణిగింది.

"ఆఁ!"

"అవును! వాట్ అయ్ వాంట్ టుసే ఈజ్ దట్ అయ్‌హావ్ మిస్‌డ్ మై పీరియడ్"

"అయితే? దానికీ దీనికి ఏమిటి సంబంధం?"

"ఛీ! ఫోండి!..." లలిత కుర్చీ తోసేసి లేచి నిలబడింది. అప్పుడు నా బుర్ర పనిచేసింది.

''ఆ! నిజమా లలితా? నిజంగా... నిఝంగా''

''అబ్బే! జోకు... అంది నాలిక చప్పరిస్తూ కానీ ఆమె కళ్ళు నవ్వుతున్నాయి. సినిమాల్లో లాగ, కథల్లోలాగ నాకు లలితను గాలిలోకి లేపాలన్నంత సంతోషమేమీ కలగలేదు. అయినా వంటింట్లో పనిమనిషి లక్ష్మివుంది కూడా. వెంటనే నాన్నగారు మాత్రం గుర్తుకు వచ్చారు. మైథిలి పురుటికి వచ్చి వెళ్ళిపో యేక, దాని కొడుకు లేక యిల్లంతా వెలవెల పోయేది. వాడో పెద్ద సెంటర్ ఆఫ్ ఎట్రాక్షన్ మాకందరికీ. నాన్నగారు రిటైరై ఖాళీగా వున్నా రేమో వాడితో బాగా కాలక్షేపం అయ్యేది ఆయ నకి. ఎప్పుడూ వాడి దగ్గరే కూర్చునేవారు.



"వాడు వెళ్ళిపోయాక ఎం తోచటం లేదు కదూ నాన్నగారూ! యింకొన్ని రోజులు వుంచుకోవల్సింది" అంటే

"వాడు ఎప్పటికయినా వాళ్ళింటికి వెళ్ళాల్సిన వాడేరా. మన యిల్లు కళకళలాడాలంటే మనింట్లోకి బిడ్డ రావాలి" అనేవారు. అది



గుర్తుకొచ్చి కళ్ళు వెంట నీరు తిరిగింది. నాన్న గారు లేరు. నేను తండ్రిని అవుతున్నానని నాన్నగారికి తెలీదు అనుకున్నాను.

"మనం డాక్టరి దగ్గరకు వెళ్ళొద్దా లలితా!"

"అప్పుడే కంగారు లేదోయ్ బుచ్చ బ్బాయ్!"

"మరి నువ్వు వంట చెయ్యగలవా! అమ్మకి టెలిగ్రాంయిచ్చేదా?"

"నాకేమైనా జబ్బా వంట చెయ్యలేకపోవటానికి? అత్తయ్యను కొన్నాళ్ళు ప్రశాంతంగా వుండనీ. తర్వాత చూద్దాం!" లలిత ఈ మాటలు మనస్ఫూర్తిగానే అంది. అందులో స్వార్థం ఏమీ లేదు.

ఆఫీసుకు వెళ్ళగానే ఈ వార్తను ఆత్మీయులెవరికయినా చెప్పాలన్పించింది. వర్ధన్‌కి ఫోను చేసి చెప్పాను. అమ్మకి రాద్దామా అనుకున్నాను. కానీ అమ్మ వచ్చేస్తుంది. అపుడే అమ్మకి తెలియచెయ్యకూడదని నిశ్చయించుకున్నాను. ఆఫీసులోనే కూర్చుని పుట్టబోయేవాడికి కట్టబోయే మేడ వరకు ఆలోచించేశాను. తల్లి దండ్రుల కలలు ఇలా వుంటాయికాబోలు అనిపించింది. ఎంత వద్దనుకున్నా నాన్న గారు పదేపదే గుర్తుకొస్తున్నారు. నాన్నగారూ! నాన్నగారూ! అని నా ఆత్మ ఆక్రోశించింది.

ఆ సాయంత్రం లలితకు చీరె కొన్నాను. ద్రాక్ష, దానిమ్మ, బత్తాయిపళ్ళు, స్వీట్స్, పూలు కొన్నాను. ఇంటికి వెళ్ళేసరికి నా వుత్సాహమంతా నీరుకారిపోయింది. పూర్ లలిత! తోటకూరకాడలా వడిలిపోయి పడుకునివుంది. లక్ష్మి చెప్పింది "మీరెళ్ళినాక ఆరు వాంతులు అయ్యాయిబాబూ!" అని లలిత నా చేతిలోని సరంజామా అంతా చూసి

"యిదంతా నామీద ప్రేమే!" అని ఆశ్చర్యపోయింది. పూలనీ, చీరెనీ పట్టించుకోలేదుకానీ ద్రాక్షపళ్ళు కడిగి యివ్వమంది. లలిత ద్రాక్షపళ్ళూ, దానిమ్మ గింజలూ అవురావురుమని తింటోంటే నాకు చాలా జాలి కల్గింది. మమ్మల్ని భోజనప్రియులని విమర్శించటం కోసమే తిండిపట్ల నిరాసక్తత ప్రదర్శించే లలిత వారం రోజులుగా వస్తువున్న దానిలాగా వాటిమీదకు లంఘించింది.

"ఏం లలితా! బాగాఆకలిగావుందా?" అనడిగాను. నా బిడ్డకు తల్లి కాబోతున్న లలిత నా కళ్ళకు పసిపిల్లలా తోచింది.

"ఏం తిన్నా యిమడలేదు బాబూ! యిదేదో పుల్లగా నోటికి రుచించినట్టుంది" అంది లక్ష్మి.

"థాంక్స్ కృష్ణా! నిజంగా థాం..."

లలిత మాట పూర్తి కానేలేదు. లోపలకు వెళ్ళినదంతా తిరిగి వాంతయ్యింది. చాలా బాధన్పించింది. అంత మధురమయిన అనుభూతికి యింత చేదు ఫలితమా? అనుకున్నాను. చాలా బాధ కల్గింది.

'బ్లడీ ఫూల్! ఎవడ్రావీడు? నా భార్య కడుపులో చేరి ఆమెనే కష్టపెడుతున్నాడు' అని తిట్టుకున్నాను.

"లాభం లేదు లలితా! పద డాక్టర్ వద్దకు వెళ్దాం. స్కూటర్ వెనుక కూర్చోగలవా? రిక్షా తేనా?" అంటూనే "లక్ష్మీ! మేము వచ్చే వరకు యింట్లోనేవుండు" అని చెప్పాను.

ఆ రాత్రి వంట లేదు. నేను తెచ్చిన స్వీట్స్ తిని మంచినీళ్ళు తాగి పడుకున్నాను.



మర్నాడు నేను లేచాను. లలిత లేవలేదు. లక్ష్మివచ్చింది. అలవాటయిన మనిషి కనుక తనంతటతానే యింటిపనంతా చేసింది. నాకు అన్నం కూడా వండి వెళ్ళి పోయింది. నేను నాకు చేతనయినంతలో లలితకు సహాయం చేయబోయాను. జడవేయటానికి ప్రయత్నించాను. చీరె కట్టడానికి ప్రయత్నించాను.




నా ప్రయత్నాలు ఫలించలేదు. జుట్టంతా చిక్కు చేశాను. లలిత చీరె కట్టుకునే ప్రయత్నం విరమించుకుని నైటీ వేసుకుని పడుకుంది. ఆఫీసుకు వెళ్ళానేగానీ మనసంతా లలిత చుట్టూ తిరుగుతోంది. ఎలావుందో? ఏమయినా తిన్నదో లేదో! వాంతయిందేమో! కళ్ళు తిరిగి పడిపోయిందేమో! సాయంత్రం ఆఫీసునుండి వచ్చేవరకు అశాంతిగానే వుంది నాకు. ఒక వారం రోజులు దుర్భరంగా గడిచాక అమ్మకు టెలిగ్రాం యివ్వక తప్పింది కాదు నాకు. అమ్మ వచ్చాక లలిత ఆరోగ్యం కొంత కుదుటపడింది. మైథిలి కూడా యింత కష్టపడిందేమో! నేను గమనించలేదు. మగవాడెంత స్వార్థపరుడు! ఇంతలో సర్వీసు కమీషన్ పరీక్షలకు రమ్మని లలితకు తాఖీదు వచ్చింది. వాంతులు కొంతవరకు తగ్గాయికానీ యింకా నీరసంగానే వుంటోంది. అంత నీరసంలోనూ లలిత పరీక్షలకు చదవటం మొదలుపెట్టింది. ''వద్దు లలితా! అలిసిపోతావు. ఆరోగ్యం చూసుకోముందు''అన్నాన్నేను.

''పీజీ చేసి యిడ్లీలు వేసుకుంటూ, అట్లు పోసుకుంటూ గడపటం నావల్ల కాదు. నేను వుద్యోగం చెయ్యాల్సిందే! చదివి తీరతాను'' అన్నది లలిత శపథం చేస్తున్నట్లు.

''ఓసి పిచ్చిదానా? ఉద్యోగం చేస్తే మాత్రం ఆడదానికి అట్లు వెయ్యడం తప్పుతుందా? అసలు ఆధునిక స్త్రీ యిలా రెండు పనులూ చేసి అలసిపోతోంది తెలుసా? మా కంటే ఉద్యోగం చెయ్యక తప్పదు కానీ మీకేం ఖర్మ? హాయిగా కాలు మీద కాలు వేసుకుని మహారాణీలా అనుభవించక''

దీనికి లలిత చాలా పెద్ద సమాధానం యిచ్చింది.

''అట్లు పోసుకోవటం, గొబ్బిళ్ళు పెట్టుకోవడం అదృష్టం అనుకునే తరం అత్తయ్యవాళ్ళది. వాళ్ళకి బయటి ప్రపంచం తెలియదు తమకంటూ ప్రత్యేక వ్యక్తిత్వం లేదు. భర్త క్షేమంగావుండాలి. బిడ్డలు పైకి రావాలి. అవే జీవిత లక్ష్యాలు. ఇప్పుడు తరం మారింది. నేటి స్త్రీ బుద్ధిజీవి. ఆమె కూడా తన మేధస్సు ప్రపంచానికి తెలియాలని ఆశిస్తుంది. బయటి ప్రపంచంలోకి వెళ్ళాలని, తన ప్రతిభను నలుగురూ గుర్తించాలని ఆశిస్తుంది. 'నువ్వు వేసే అట్లు స్వర్గానికి మెట్లు' అనే పొగడ్తకు స్త్రీ పొంగిపోరాదు. 'నా యిల్లే నాకు హద్దు. త్రిలోకాధిపత్యం కూడా వద్దు' అనుకోరాదు. పురుషుడి వలెనే ఆమెకూ మేధవుంది. తెలివి తేటలున్నాయి. ఈ సంధికాలంలో స్త్రీకి యింటి పనీ, బయటి పనీ కూడా తప్పదు. అలిసిపోతున్నాను కదా అని స్త్రీ ఆర్థిక స్వాతంత్ర్యాన్ని బయటి ప్రపంచాన్ని వదులుకున్నదా, వంటింటి కుందేలుగానే మిగిలిపోతుంది. దానివల్ల ఈ తరానికీ, ముందు తరానికి కూడా చాలా అపకారం జరిగిపోతుంది''

నా ఖర్మేమిటంటే నాకు ఎవరు ఏది మాట్లాడినా అది సరయినదే అన్పిస్తుంది. యిప్పుడూ అలానే అన్పించింది. అందువల్ల నేను లలితను పరీక్షకు తయారు కావద్దు అని మళ్ళీ అడగలేదు. నాకు వుద్యోగంతో క్షణం తీరిక వుండదు. అమ్మ పుట్టెడు దుఃఖంలో వుంది. లలితకు పరీక్షల హడావుడి. లక్ష్మి మీద ఎంతకని ఆధారపడను? యిల్లు రోజురోజుకీ అస్తవ్యస్తంగా తయారవుతున్నది. లలిత పరీక్ష రోజు రానేవచ్చింది. ఆపసోపాలు పడుతూనే లలిత పరీక్ష రాసివచ్చింది. నేను కొంచెం వూపిరి పీల్చుకోగలిగాను.

లలితకు ఏడవనెల రాగానే వాళ్ళ నాన్నగారు, అమ్మా వచ్చి లలితను పురిటికని తీసుకు వెళ్ళిపోయారు. లలిత లేకుండా ఆరునెలలు గడపాలంటే కష్టమేననిపించింది.

''వస్తుంటారుగా'' అంది లలిత. దీనికి నేను ఎటువంటి సమాధానమూ ఇవ్వలేకపోయాను. నేను ఊరు వెళ్ళితే అమ్మ ఒంటరిగా ఉండవలసివస్తుంది. ఆ మాట నేను లలితతో అనటానికి సందేహించాను. లలిత సంతోషంగా వుంది. ఆమె సంతోషానికి భంగం కలిగించేలా మాట్లాడ్డానికి నా మనసొప్పలేదు. అమ్మ అలాగే నిర్వికారంగా వుంది. ఏ భావమూ వ్యక్తం చేయదు.

★ ★ ★

అమ్మ మౌనం నా మనసును కోస్తోంది. నా నిస్సహాయతమీద నాకే కోపం వస్తోంది. లలిత కూడా లేని ఇల్లు భీతావహంగా వుంది.



"అమ్మా! నువ్వు మైథిలి దగ్గరకు వెళ్ళకూడదా!" అనడిగాను ఒకరోజు

అమ్మ మాట్లాడలేదు.

ఈ మౌనం, ఈ నిర్లిప్తత నన్ను పిచ్చివాడిని చేస్తున్నాయి.

"నీ బాధ నేను చూడలేకుండా ఉన్నానమ్మా. నేను రోజంతా ఆఫీసులో వుంటాను. నువ్వు ఒంటరిగా, దుఃఖంతో ఇంట్లో వుండటం నేను సహించలేకుండా ఉన్నాను. దాని దగ్గరయితే నీ మనసుకు ఊరటగా ఉంటుంది. దింపి వస్తాను పద" అన్నానోరోజు.

"ఆడపిల్ల వద్ద ఎంతకాలమని వుంటాను నాన్నా!" అంది.

"బావగారు మంచివారమ్మా! తప్పుగా ఎప్పటికీ అనుకోరు. నీకు మొహమాటమయితే చెప్పు. నేను డబ్బు పంపిస్తాను. కానీ నువ్విలా వుంటే చూడలేనమ్మా. నాన్నగారు మనని యిలా అర్ధాంతరంగా వదలిపోవటం అన్యాయమే. దానికి నాకీ శిక్ష వేస్తావా అమ్మా" అసంకల్పితంగానే నా గొంతు రుద్ధమయింది.

అమ్మ చటుక్కున దగ్గరకు వచ్చి నా తల తన హృదయానికి హత్తుకుంది.

"పిచ్చి సన్యాసీ! అమ్మంటే ఎంత ప్రేమరా నీకు? ఇందుకా ఇంత దిగులుగా ఉన్నావు? ఇదంతా లలిత లేనందువల్లే అనుకున్నానురా, మూర్ఖురాలిని. నేను నా దుఃఖంలో నా స్వార్థమే చూసుకున్నానుగానీ బిడ్డ బాధపడుతున్నాడని గ్రహించలేకపోయాను. ఇందుకు నన్ను పైనున్న మీ నాన్నగారు కూడా మెచ్చరు"

అమ్మా, నేనూ నాన్నగారు ఆరోజే పోయినట్టుగా ఒకరినొకరు పట్టుకుని చాలాసేపు ఏడ్చాం. అయితేనేం ఘనీభవించిన మంచుతెరేదో కరిగినట్టయింది. మనసులు తేలికయినాయి.

సాయంత్రం పనిలోకి వచ్చిన లక్ష్మి మా వాలకం చూసి కంగారుపడింది.

"ఏమయింది అమ్మగారూ! అంతా బాగానే వుండారుగదా! లలితమ్మ కాణ్ణించి జాబేమైనా వచ్చిందా?" అని అడిగింది.

అమ్మ చాలారోజుల తర్వాత నన్నిగా నవ్వి "ఏంలేదే! పద. అంట్లు వేస్తాను" అని లేచింది.

★ ★ ★

శనివారం సాయంత్రం నేను ఆఫీసునుండి వచ్చేటప్పటికి ముందుగదిలో బ్రీఫ్‌కేసు, స్టీలు కేన్ పెట్టివున్నాయి.

"ఎవరొచ్చారమ్మా!" అంటూనే నేను క్యాన్ మూత తెరిచి అందులోనుండి ఒక కజ్జికాయ తీసుకున్నాను.

అమ్మ చప్పున వంటింట్లోనుండి బయటకు వచ్చి నా చేతిమీద ఒకటి వేసింది.

"ఛ! వెధవా! అది ముందు క్యాన్‌లో పెట్టు. నీకు కావాలంటే వేరే ఇస్తాను. రేపు ఆదివారంకదా! లలితను చూసిరావూ? ఎదురుచూస్తూవుంటుంది పాపం!" అంది.

"దానికీ, ఈ సామానుకీ ఏమిటి సంబంధం?"

"ఇది నీ బ్రీఫ్‌కేసేరా వెర్రినాగన్నా! నువ్వు ఆలస్యం చేస్తావని బట్టలు సర్దివుంచాను. ఇవి లలితకోసం నేనే చేశాను. కొప్పడకు లక్ష్మి సహాయం చేసిందిలే. స్నానంచేసి బయలుదేరు. కాఫీ ఇచ్చేస్తున్నాను. వెంటనే బయలుదేరావంటే, రాత్రి 10 గం॥కి వెళ్ళిపోతావు" అని తొందరపెట్టింది.

శనివారం రాత్రి ఎలాగూ మేము భోజనం చెయ్యము.

"మరి నువ్వు ఒంటరిగా వుండొద్దూ!" అని సందేహం వెలిబుచ్చాను.

"నన్ను పిల్లి ఎత్తుకుపోతుందా ఏం? మరీ విడ్డూరం చేయకు. ఇప్పటికే మీ అత్తగారి తరఫువాళ్ళంతా నవ్వుకుంటున్నారు నిన్ను చూసి అమ్మ కూచివని" అంది అమ్మ కొంచెం అలిగినదానిలాగా.

"ఇప్పుడా బిరుదు పోగొట్టుకోవడానికి అక్కడికి వెళ్ళాలంటావా ఏం?"

"అమ్మ మాటమీద గౌరవం ఉంటే వెళ్ళు. లేకుంటే మానెయ్యరా. నీతో నేను వాదించలేను"

"నువ్వూరా... ఇద్దరం వెళాదాం"

కోపం నటిస్తూ నావంక చూసి విసురుగా వెళ్ళిపోయింది. నేను బయల్దేరక తప్పలేదు. అయితే, బస్టాండునుండి వర్ధన్‌కి ఫోను చె





య్యడం మాత్రం సురిచిపోలేదు.

"ఓరేయ్ వర్ధన్! అమ్మ ఒంటరిగా వుంటుంది. నేను మా అత్తగారింటికి వెళ్తున్నాను. సోమవారం ఉదయం వస్తాను. ఇవాళా, రేపూ రాత్రుళ్ళు మా ఇంట్లో పడుకో. అసలే ఊరి చివరికొంప" అని.

"నా కొట్టు కట్టేటప్పటికి రాత్రి పదకొండవుతుంది. అనంత్‌ని పంపిస్తాలే. పోనీ నేనైనా వెళ్తాను. ఏదో ఒకటి చేస్తాన్లే. నువ్వు నిశ్చింతగా పోయిరా" అన్నాడు.

అనంత్ వాడి తమ్ముడు. వర్ధన్ అమ్మ బాధ్యత తీసుకున్నాక నాకు నిశ్చింతగా అన్పించింది. మనసు రెక్కలు కట్టుకుని లలిత ముందు వాలితే, శరీరాన్ని బస్సులో చేర్చాను.

★ ★ ★

లలిత నా రాకను ఊహించలేదు.

"అత్తయ్య ఒకరే వుంటారుకదా! రారేమో అనుకున్నాను" అంది.

"నేనూ వద్దామనుకోలేదు. అమ్మ పంపింది" అందామనుకున్నాను. కానీ నాకు అప్పుడప్పుడూ విచక్షణాజ్ఞానం పనిచేస్తుంది. అందువల్ల ఆ మాటలను గొంతులో నొక్కేసి.

"వర్ధన్ తమ్ముడిని పంపుతున్నాడు అమ్మకు తోడుగా వుండేందుకు" అని చెప్పాను.

"మంచిపని చేశారు. అసలే ఊరి చివరి ఇల్లు" అంది.

"ఎలా వున్నారు?" అని అడిగింది. సన్నగా, తీగేలా వుండే లలిత విరగబూచిన మల్లెపొదలా వుందిప్పుడు. అదే చూపించాను సౌంజ్ఞలతో "వెడల్పుగా వున్నావు" అంటూ.

కంఠ ఊడేలాగా గిల్లింది. "నేను లేకుండా ఇల్లు ఎలా వుంది?" అనడిగింది.

"బాగాలేదు. చాలా బోసిపోయినట్టుగా వుంది అంటోంది అమ్మ" అనబోయాను. మళ్ళీ నా విచక్షణాజ్ఞానం పనిచేసింది.

"నువ్వు లేకుండా బోర్ కొడుతోంది" అని చెప్పాను. ఇంతకంటే కళాత్మకంగా నా ఒంటరితనాన్ని వివరించటం చేతకాలేదు నాకు. కొందరు తమ ప్రేమను ఎంత చక్కగా వ్యక్తీకరిస్తారు! లలిత నా భార్య. నేను ప్రేమించి పెళ్ళి చేసుకుని వుండకపోవచ్చు. కానీ పెళ్లిచేసుకున్నాను. ఆమెను ప్రేమించాను. అభిమానించాను. ఇది నాకు మాటల్లో చెప్పటం చేతకాకపోవచ్చు. ప్రేమంటే ఏమిటి? అని నాకు మళ్ళీ సంశయం కలిగింది. లలితను నేను ప్రేమిస్తే నా మనసులోని భావాలన్నీ ఆమె ముందు వెల్లడి చేయటానికి జంకుతానెందుకు? అని నన్ను నేను ప్రశ్నించుకున్నాను. చాలామంది మగవాళ్ళలాగానే నాకు సంఘర్షణ ఇష్టంలేదు. నా భావాలు, లలిత భావాలు అన్నివిధాలా ఏకీభవించవు. భిన్నమైన భావాలున్నవాళ్ళ మధ్య ప్రేమ వుండదా? దానికి నా సమాధానం ఇది. అటువంటి దంపతులు అదృష్టవంతులు. నేను ఆ కేటగిరీలోకి రాను. నా భావాలను లలిత ఖండిస్తే చిన్నబుచ్చుకుంటాను. ఉదాహరణకి నాకు మా అమ్మ గొప్ప 'ఐడియల్ షి'. ఆదర్శ వనిత అన్నమాట. మూర్తీభవించిన స్త్రీ అంటే ఆమే. మరొకరు లేరు. తల్లిగా, భార్యగా, గృహిణిగా ఆమె నూరుశాతం విజయం సాధించింది. నేను ఆ మాటంటే లలిత ఒప్పుకోదు.

"మీకు మీ అమ్మగారూ, చెల్లెలూ, వర్ధనరావుగారి భార్య రజని తప్ప యింకే ఆడవాళ్ళు తెల్సు గనుక. అయినా స్త్రీ అంటే మంచి భార్యా, మంచి తల్లీ అయితే చాలన్నమాట. ఇంతెందుకు? పప్పుసుద్దలా ఇళ్ళల్లో కూర్చునే స్త్రీలు మీకు ఆదర్శమూర్తులు" అంటుంది.

అప్పుడు నాకు లలితమీద చాలా కోపం వస్తుంది. కానీ నేను దానిని ప్రకటించను. లలిత భావాలు తప్పు అని వాదించను. మరి నాకు లలితమీద ప్రేమవున్నట్టా? లేనట్టా? నా ఆలోచనల్లో నేనుండగానే లలిత క్యాన్ తెరిచి కజ్జికాయలు చూసింది.

"అత్తయ్య చేశారా? ఎందుకండీ అంత శ్రమపడటం?"

"లక్ష్మి సహాయం చేసిందట" అన్నాను.

"షి ఈజ్ ఎ డార్లింగ్" అంది.

నా మనసుకు చాలా సంతోషం కలిగింది. లలితను ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నా

హాయిగొలిపే...
మియామి హవాయి






# మియామి ఫ్యాషన్

డిస్ట్రిబ్యూటర్స్:

**ప్రాఫిటబుల్ ఫుట్ వేర్**

ను.

★ ★ ★

సోమవారం మధ్యాహ్నం ఇంటికి భోజనాని కని వచ్చాను. ఊళ్ళోకి ఉదయమే వచ్చాను గానీ బస్సు దిగేసరికే ఆఫీసుకు టైమయింది. ఇంటికి వచ్చి ఆఫీసుకు వెళితే ఆఫీసుకు ఆలస్యమవుతుందని ఇంటికి రాలేదు. అటు నుండి అటే ఆఫీసుకు వెళ్ళిపోయాను. మధ్యాహ్నం భోజనానికి వచ్చినప్పుడు ఆ మాటే చెప్పాను అమ్మతో.

"సారీ అమ్మా! రాత్రి రాలేదు" అన్నాను కొంచెం సిగ్గుపడుతూ.

అమ్మ "మంచిపని చేశావు నాన్నా! వెళ్ళాక ఓ పూటయినా వున్నట్టు వుండొద్దుటరా వాళ్ళకు మాత్రం. మొన్న రాత్రి వెళ్ళి నిన్న రాత్రి వచ్చేస్తే లలిత చిన్నబుచ్చుకోదూ! మరి ఉదయం టిఫినెక్కడ చేశావూ?" అంది.

అందుకే అమ్మంటే నాకిష్టం. మనం హొటల్లో గొంతువరకూ భోంచేశాక, పక్కవారు ఇంకా ఆర్డరిచ్చుకుంటుంటే "అబ్బ! ఎలా తింటారో" అన్పిస్తుంది. పదినిమిషాల క్రితం మనమూ అదే పరిస్థితిలో వున్నామనే విషయం తాత్కాలికంగా మరిచిపోతాం. మనకూ ఆకలి వేస్తోంటేగానీ పక్కవాడి ఆకలి మనకు అర్థం కాదు. అలాగే వయసులో వున్నపుడు తాము శృంగారం కోసం ఎంత ఆరాటపడేవారో చాలా మంది వృద్ధాప్యంలో అడుగిడగానే మర్చిపోతారు. తమ పిల్లలను ఆ విషయమై విమర్శిస్తారు. "పెళ్ళాం కొంగు తగిలింది. మమ్మల్ని మరిచిపోయాడు" అంటారు. కొడుకు స్థానంలో తాముంటే ఎల్లా ప్రవర్తించేవాళ్ళో ఊహించుకోరు. అమ్మ ప్రత్యేకత అదే. నా స్థానంలోనూ, లలిత స్థానంలోనూ, మా అత్తామామల స్థానంలోనూ కూడా తనను ఊహించుకుంటుంది. అందుకే అమ్మకు సాధారణంగా ఎవరి ప్రవర్తనలోనూ తప్పు తోచదు. "నేను అడుగుతుంటే నువ్వెక్కడో ఆలోచిస్తున్నావేమిట్రా!" అంది అమ్మ.

"ఏంటి?" అన్నాను ఉలిక్కిపడి.

"టిఫినెక్కడ చేశావురా ఉదయం?"

"నీకు తెలియందేముందమ్మా! వాళ్ళింట్లో రెండు రోజులుంటే నెలకి సరిపడా గ్రాసం పెడతారు. అందుక్కాదూ నాకు అక్కడికి వెళ్ళాలంటే భయం? అమెరికాలో వున్న నా తోడల్లుళ్ల వాటా కూడా నాకే పెట్టేస్తాగనుకుంటా. నువ్వు తిడతావని తినాలిగానీ నిజానికి ఇప్పటికీ ఆకల్లేదు" అన్నాను.

భోజనం చేస్తుండగా గుర్తుకొచ్చింది.

"అమ్మా... ఉదయం మనింట్లో టిఫినేమిటి?"

"ఇడ్లీ. ఏం ఎందుకూ అడుగుతున్నావు?" ఎదురు ప్రశ్నించింది.

సాయంత్రం వర్ధన్‌ని కలిసినప్పుడు అడిగాను.

"అవున్రా! పిన్ని అసలు వంటచేసుకోలేదు. నాకు మీ ఇంటి అలవాటు తెల్సుగా శనివారం రాత్రి మజ్జిగ తప్ప ఏం తీసుకోరని. ఉత్తినే తోడుపడుకోమంటే పనిమనిషిని పడుకోమన్నా పడుకుంటుంది. నువ్వు పనిగట్టుకుని ఫోన్ చేశావంటే నీకు అమ్మని వదిలివెళ్లటం ఇష్టంలేదని అర్థం అయింది. ముందు అనంత్‌ని వెళ్ళి పడుకోమన్నాను. ఆ అంట్ల వెధవ రెండోఆట సినిమాకు వెళ్ళి, ఏ సమయానికి చేరతాడో అని నేనే వెళ్ళి పడుకున్నాను. నా సంగతి నీకు తెల్సుగా. ఉదయం లేచేటప్పటికి పదిగంటలయింది. పిన్ని వంటింట్లోకి వెళ్ళిన సూచనలుగానీ, వెళ్ళే సూచనలుగానీ లేవు.

"పిన్నీ! నేను ఇటునుండి ఇటే 'క్లినిక్'కి వెళ్ళాలి. కాఫీతోపాటు కొంచెం టిఫిన్ చేసివ్వు" అన్నాను. ఆశ్చర్యంగా చూసింది. ఉప్మా చేసిచ్చింది. తర్వాత తింటాను. అని కాసేపు తలాయించింది గానీ నా పెంకితనానికి లొంగి నాతోపాటే టిఫిన్ తిన్నది. కానీ భోజనం చేసివుంటుందని నేననుకోను. నా సంగతి తెలుసుకదరా! తీరికవుండదు..." వాడేదో సంజాయిషీ ఇవ్వబోయాడు.

"ఫర్వాలేదురా! ఆ మాత్రం చేశావు. చాలా థాంక్స్" అన్నా మన స్ఫూర్తిగానే.

★ ★ ★

మరునాటి శనివారం ఆఫీసుకు వెళ్ళే ముందే అమ్మను హెచ్చరించాను.

"చూడమ్మా! ఈ నెలంతా నాకు పని చాలా ఎక్కువగా వుంది. ఆదివారాలు కూడా ఆఫీ

సుకు వెళ్ళాలి లలిత దగ్గరకు వెళ్ళేందుకు కుదరదు. నువ్వు సాయంత్రం నేను వచ్చేసరికి బ్రీఫ్‌కేసులూ, స్టీలు క్యాన్‌లూ తయారుచేసి వుంచకు''

''గర్భంతో వుంది. భర్తను చూడాలని వుంటుంది. ఈ ఒక్కసారికి వెళ్ళిరారా'' అని బ్రతిమాలింది.

''కుదరదంటున్నానుకదా!'' అని విసుక్కున్నాను.

ఆ సాయంత్రం లలితకు ఫోన్‌చేసి చెప్పాను.

''లలితా! నాకు రెక్కలు కట్టుకుని నీ దగ్గరకు రావాలనేవున్నది. అమ్మ నేను లేకపోతే వంట కూడా చేసుకోవటంలేదు. వర్ధన్‌ని ఎంతకని కష్టపెట్టను? అందుకే ఈసారికి రావటంలేదు''

''అలాగే మీరేమీ బాధపడకండి. నేను బాగానే వున్నాను. అత్తయ్య జాగ్రత్త. పైనెలలో మీ ఇద్దరూ కలిసిరండి'' అందిఅటువైపు నుండి.

లలిత అమ్మని ప్రేమించినకొద్దీ నాకు లలితమీద ప్రేమ పెరుగుతూ వుండటం గమనించాను. 'మొగుడి పొట్టలోనుండి హృదయానికి దారి' అనేది పాత సామెత.

'ఎవరి హృదయానికయినా దారి హృదయంనుంచే'

ఆ సాయంత్రం మజ్జిగగ్లాసు అందిస్తూ,

''నీ ఫ్రెండుని కాపలా పెడుతున్నావుగదా నాకు? ఇంకా ఊరు వెళ్ళటానికి అభ్యంతరం దేనికి?'' అని అడిగింది అమ్మ.

''అమ్మ కూచిని కాబట్టి'' అన్నాను.

కొంచెం గర్వంగా నవ్వుకుంది.

★ ★ ★

పాపాయి రాక ఒక అద్భుతం. ఆనందం.

లలిత పాపాయిని ఎత్తుకుని ఇంటికి వస్తే నాకు మా జీవితాల్లో శిశిరం గడిచి వసంతం వచ్చినట్టుగా తోచింది.

పాపాయి అచ్చు లలితలానే వుంది. తెల్లగా, సన్నగా జాజిమొగ్గలా

ముందు వరండాలో ఈజీఛెయిర్ వేసుకుని నాన్నగారు కూర్చునేవారు. అమ్మ తరచు కాఫీ టీలు ఆయనకు అక్కడికే అందించేది. పేపరు చదువుతూ క్రాస్‌వర్డ్ పజిల్స్ పూర్తిచేస్తూ తననుతాను బిజీగా వుంచుకునేవారు. మరీ విసుగనిపించినప్పుడు రోడ్డుమీద వచ్చేపోయే జనాన్ని గమనిస్తూ వుండేవారు. రిటైరయిన ఆ ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరు మనసులో ఏవి భావాలు పరుగెత్తేవో తెలీదు. అమ్మా, ఆయనా తరచు ఆ కాలనీ చివరి బజారుకు వెళ్ళి మార్కెట్ చేసేవారు. కాసేపు గుడిలో కూర్చునేవారు. చిన్నప్పుడు నాకూ మైథిలికి శలవులొచ్చినపుడు మాకు ఎక్కువ సమయం నాన్నగారితో గడపాలని వుండేది. అప్పుడాయన బాధ్యతలుగల ప్రభుత్వోద్యోగి.

''మీకు శలవులొచ్చాయని నాకు తీరిక వుండొద్దూ. నేను రిటైరయ్యేక ఆడుకుందాంలే'' అనేవారు.

మేము అమాయకంగా చాలా సంతోషపడేవాళ్ళం. ఒకసారి అమ్మ విని...

''పిచ్చి నన్నాసుల్లారా! ఆయన రిటైరయిపోయినా మీరు ఆటలాడుతూ వుంటూనే వుంటారేమిట్రా! పెద్దయిపోరూ! నాన్నగారు మిమ్మల్ని మోసం చేస్తున్నారు'' అని వివరించింది.

దానికాయన ''నేను అలా అన్లేదే. వాళ్ల పిల్లల్తో ఆడుకుంటానన్నాను'' అన్నారు తెలివిగా.

తీరా నేను బిడ్డ తండ్రిని అయ్యేటప్పటికి ఆయన లేకుండాపోయారు. నాన్నగారు లేకపోయినా నాకా ఈజీఛెయిర్ తీయడానికి మనసొప్పలేదు. అది వరండాలో అలాగే వుండిపోయింది. పాపాయి వచ్చిన సాయంత్రం లలిత దాన్ని మడిచి తీసేయబోయింది. నేను ఒప్పుకోలేదు.

''వద్దు లలితా! దానిని అక్కడే వుండనీ'' అన్నాను.

''పాపాయికి పాకుతూ ఆడుకోవటానికి స్థలం చాలదండీ'' అంది.

''సర్దుకోమను'' అన్నాను కావాలనే కోపంగా.

లలిత లోపలికి వెళ్ళి అమ్మను తీసుకువచ్చింది. అమ్మ వస్తూనే ''నాన్నా! కుర్చీ నా




గదిలో పెట్టు. ఎందుకిక్కడ దిష్టిబొమ్మలా!'' అంది.

అమ్మ కంఠంలో ఏ భావంలేదు. చాలా నిర్వికారంగా అంది.

కానీ అమ్మ మనసును ఎంత రాయిచేసుకుని ఆ మాట అని వుంటుందో లలిత వంటి వాళ్ళకు అర్థంకాదు.

లలిత స్వయంగా తానే దాన్ని మడిచి అమ్మ గదిలో పెట్టివచ్చింది. నాన్నగారు వుండగా ఆ కుర్చీలో మేమంతా చాలాసార్లు కూర్చున్నాం. కానీ ఆయన పోయేక నాకెన్నడూ అందులో కూర్చోవడానికి మనసు రాలేదు. క్రింద కూర్చుని అందులో తలపెట్టుకుంటే ఆయన ఒళ్ళో తలపెట్టుకున్నట్టే వుండేది. నాకు మూఢనమ్మకాలు లేకపోవచ్చు. కానీ సెంటిమెంట్లు వున్నాయి.

తర్వాత లలిత సంతోషంగా వరండా అంతా తుడిచి డెట్టాల్‌తో కడిగి పాపాయినీ, బొమ్మలను అక్కడ వదిలింది. అమ్మ ఈ తతంగాన్నంతా కళ్ళు విప్పార్చుకుని చూసింది.

''చూశావా కృష్ణా! చదువుకున్న పిల్లలు ఎంతయినా చదువుకున్న పిల్లలే! డెట్టాల్‌తో కడిగి పాపాయిని వదిలింది. అలా చేస్తేనే కదా బిడ్డలు ఆరోగ్యంగా పెరిగేది'' అని లలితకు సర్టిఫికెట్ యిచ్చింది.

పాపాయి పుట్టిన తర్వాత లలితకు పని ఎక్కువైంది. ఇది వరకు లక్ష్మి అంట్లుతోమి, యిల్లూ, వాకిలీ తుడిచేది. ఒక చాకలి మనిషి వచ్చి బట్టలు వుతికి వెళ్ళేది. యిస్త్రీ బట్టలు యింటి ముందుకు వచ్చిన 'మొబైల్ లాండ్రీ'కి యిచ్చి చేయించుకునే వాళ్ళం. అమ్మ వంట చేసేది. లలిత యిల్లు శుభ్రంగా వుంచటం, కాఫీవంటి చిన్నవి చేయటం, ఎవరయినా అతిథులు వస్తే వాళ్ళను ఎంగేజ్ చెయ్యటం వంటి పనులు చేసేది. పాపాయి రాకతో లలితకు పని ఎక్కువై నలిబిలి కాసాగింది. ఆమెకు వంటపట్ల ఏనాడూ ఆసక్తిలేదు. మా యింట్లో అమ్మే వంట చేసేది కాబట్టి ఆ సమస్యే రాలేదు. అమ్మలా వంటపనిని ఎంజాయ్ చేసినవాళ్ళను నేను చూళ్ళేదు. ఒక్క వర్ధన్ మాత్రం దీనికి మినహాయింపు. వాడికి వంట హాబీ. వంటని, యింత ఉత్సాహంగా, కుటుంబ సభ్యులు సంతృప్తిగా తింటే తన జీవితం ధన్యం అనుకునేలా తపస్సులా చేసే ఆడవాళ్ళను నేను చూడలేదు. ఆ మాటంటే లలిత ''సర్లేండి...మీ అమ్మా, మైథిలీ, రజనీ తప్ప మీకు తెల్సిన ఆడవాళ్ళెవరనలు'' అనేది. పోనీ వాళ్ళిద్దరినే తీసుకున్నా మైథిలి ఓపిగ్గానే చేస్తుంది. వినుక్కోదు. కానీ, అమ్మలా అంకితభావంతో చేయదు. రజని హోమ్‌సైన్సుతో గ్రాడ్యుయేషన్ చేసింది. కానీ వంట చేస్తున్నంత సేపూ ఆడ జన్మనీ, వాళ్ళ అత్తగారినీ, ఆడబడుచుల్నీ యిటువంటి సంబంధం చేసిన తల్లిదండ్రుల్ని తిడుతూనే వుంటుంది. అమ్మకు వంటపనిలో లలిత బాగా సహాయం చేసేది. అమ్మకి అసలు సహాయం అవసరం లేదు. కానీ తన ధర్మంగా లలిత సహాయం చేసేది.

పాపాయి వచ్చేక అమ్మకు సహాయం చేసేందుకు లలితకు కుదరలేదు. తన పనితోనే సరిపోయేది. యింకా అమ్మే లలితకు పాపాయి పనిలో సహాయం చేసేది. అమ్మ లలితకు అసిస్టెంట్, పాపాయికి నాయనమ్మకాదు అన్పించేది నాకు. యిలా నేను అనటానికి కారణం లేకపోలేదు.

మైథిలికి కొడుకు పుట్టినపుడు మా యింట్లో కొన్ని నెలలు గడిపింది. దానికి తనమీద కంటే కూడా అమ్మమీద ఎక్కువ నమ్మకం.

''మైథిలీ! నీ కొడుకు లేచాడు'' అని అమ్మ పిలిస్తే ''పాలు కలిపి పొయ్యమ్మా! నాకు బద్ధకంగా వుంది'' అనేది.

''బాబుకి రొంప చేసింది చూసుకోవే'' అంటే అద్దెకు తెచ్చుకున్న తెలుగు నవలలు చదువుతూ మాట్లాడేది కాదు. అమ్మ తులసిరసం, తేనె, కరక్కాయలు, తన అనుభవమూ జోడించి వాడికి రొంప తగ్గించేది. మైథిలికి తన బిడ్డపట్ల నిర్లక్ష్యం ఏమీ లేదు. ఇద్దరు బిడ్డల తల్లి అమ్మకంటే తనకు ఎక్కువ తెల్సునా. అని దాని అభిప్రాయం. అమ్మ మీద నమ్మకం, గౌరవం.

లలితకు అమ్మమీద అపనమ్మకంగానీ, అగౌరవం కానీ ఏమీ లేవు. కానీ లలిత ఆధునిక

యువతి. అమ్మవి పాత పద్ధతులనీ, మారుతున్న కాలానుగుణ్యంగా పిల్లల పెంపకం మారిందనీ లలిత అభిప్రాయం.

లలిత మా యింటికి పాపాయిని ఎత్తుకుని రాగానే అమ్మ పాపాయి స్నానానికి వేడినీళ్ళు తోడింది. లలిత ఆ నీళ్ళలో చేయిపెట్టి హారర్ సినిమాలో పాత్ర లాగ కెవ్వునకేక వేసింది. అమ్మ అయోమయంగా చూసింది.

"ఇంత వేడేమిటి అత్తయ్యా! పాపాయి వుడికిపోదూ?" అంటూ నీళ్ళను గోరువెచ్చగా చేసింది. అమ్మ చిన్నబుచ్చుకున్నదో, లేదో తెలియదు. ఏ భావమూ ప్రకటించకుండా లోపలకు వెళ్ళి సున్నిపిండీ, నూనె తెచ్చింది. లలిత 'ఏరియల్ ఎడ్వర్టయిజ్‌మెంటు' కోడలి లాగ బేబీసోపు టబ్ ముందుపెట్టుకోగానే అమ్మ నిశ్శబ్దంగా లోపలకు వెళ్ళిపోయింది. కానీ యీ పీజీ చదివిన కోడలు తన మనుమరాలిని ఏం చేస్తుందో అని భయపడుతున్నదానిలాగ కొంచెం టెన్షన్‌తో ఆ చుట్టు ప్రక్కల తిరిగింది. కానీ లలిత చులాగ్గా దానికి స్నానం చేయించి మా గదిలోకి తీసుకువెళ్ళిపోయాక నిశ్చింతగా ఒక నిశ్వాసం విడిచింది. లలిత పాపాయికి స్నానం చేయించిందేకానీ ఎక్కడి వస్తువులు అక్కడ వదిలేసివెళ్ళిపోయింది. అమ్మ ఒక పది నిమిషాలు చూసి అవన్నీ ఎక్కడివక్కడ సర్దింది.

పాపాయి వచ్చిన రోజు ఉదయమే స్నానం దగ్గరా, సాయంత్రం మడత కుర్చీ దగ్గరా అనవసరంగా సీను క్రియేట్ చేసి లలిత అమ్మ మనసును నొప్పించిందనే నాకు అనిపించింది.

★ ★ ★

లలిత పాపాయితో పడే పాట్లు చూసి ఒక్కోసారి అమ్మ సహాయం చేయబోయేది. పాలు కలపాలనీ, బట్టలు మార్చాలనీ ప్రయత్నించేది. కానీ లలిత అమ్మను వారించేది.

"పద్ధత్తయ్యా! మీకు తెలీదు" అనేది.

లలిత ఆ 'పద్ధత్తయ్యా!' పదాన్ని ఎంత ఎక్కువగా వాడుతుంటే అమ్మ యిద్దరు పిల్లల [illegible] పిల్లల పెంపకం గురించి ఏమీ తెలియదని నిజాయితీగా నమ్మి మరీ అలా అనేది.

ఒక రోజు ఉదయం నేను గడ్డం చేసుకుంటున్న వాణ్ణి లలిత గావుకేక విని పరుగుపరుగున భోజనాల గదిలోకి వచ్చాను. భోజనాల బల్లవద్ద పాపాయిని ఒళ్ళో కూర్చోపెట్టుకుని, దానికి అరటిపండు పెడుతోన్న అమ్మ ఆ కేకకు గాభరాపడి పండు క్రిందకు వదిలేసింది.

"అలా పూర్తిగా తొక్క ఒలిచి పెట్టకూడదత్తయ్యా! మీ చేతిని పండు తాకుతున్నది గదా! అలాగే పిల్లలకు జబ్బులు వస్తాయి" అన్నది లలిత.

దీని కోసమా ఈవిడ ఎప్పుడూ గొణిగినట్టు మాట్లాడే ఈ మహారాణి యింతగావు కేక వేసింది.

నాకు లలితను చాచిపెట్టి కొట్టాలనిపించింది.

అమ్మ మాత్రం పండు తీసుకెళ్ళి బయటపారేసివచ్చింది.

"మీరు సరదా పడుతున్నారని పెట్టమన్నాను. ఒక క్షణం ఆగితే నేను వచ్చి పెట్టేదాన్నే"

"లలితా! దయచేసి యిక నోరు మూస్తావా?" నాకు సహనం చచ్చిపోతోంది.

"నేనేమన్నాను" అంది లలిత అమాయకంగా.

"లలిత చెప్పింది నిజమేరా! నాకు ఈ పద్ధతులన్నీ తెలియవు. మా రోజుల్లో మేమంతా అయోమయపు మేళం అనుకో. అందుకే చెల్లాయికి ఎప్పుడూ విరేచనాలే. యిప్పుడు చదువుకున్న అమ్మాయిలు పిల్లల్ని జాగ్రత్తగా పెంచుతున్నారు. మేము మూర్ఖుల్లాగ ఆముదాలు పోసి, సాంబ్రాణి పొగలు వేసి పిల్లల్ని హింసించేవాళ్ళం. అది చంటిది కదా, నేను తొక్కతీసి పండుపట్టుకుంటే మరి నా చేతి మురికంతా దాని చిన్ని పొట్టలోకి వెళ్ళదూ?" అంది అమ్మ లలితనే సమర్థిస్తూ.

అమ్మ లలితను దెప్పి పొడవలేదు. లలిత పిల్లల పెంపకాన్ని మెచ్చుకున్నది. తనుకూడా యితోధికంగా లలితను సాయపడటం మొదలు పెట్టింది. పాపాయి ముఖ్యమైన పనుల్లో తాను జోక్యం చేసుకోవటం మానేసింది. నీరు మరిగించి, బుద్ధి మంతురాలైన దాసీలా లలి





తను కేకవేసేది.

"అమ్మాయ్! నీళ్ళు ఫ్లాస్కులో పోసుకో" అనేది. స్నానానికి నీళ్ళుతోడి బాత్‌రూంలోపెట్టి సబ్బూ, తువ్వాలు అమర్చి లలితను పిలిచేది. లలిత పాపాయికి స్నానం చేయించేశాక మళ్ళీ ఎక్కడి వస్తువులు అక్కడ సర్దేసేది.

పాపాయి ఆకలివేసి ఏడిస్తే, ఆ సమయానికి లలిత బాత్‌రూంలో వుంటే స్పూన్లు, గిన్నె సీసా, వేడినీళ్ళ ఫ్లాస్కు, పాలపొడి డబ్బా అన్నీ తయారుగావుంచి దాన్ని ఎత్తుకుని తిప్పేది.

"ఒక్క క్షణం ఆగు చిట్టి తల్లీ! అమ్మ వచ్చేస్తుందిగా. నా తల్లివి కాదూ! ఏడవకమ్మా! హాయీ! హాయీ..." అంటూ ఆడించేది.

"ఏంటమ్మా ఛాదస్తం. పాలు కలిపి పోసెయ్యక" అని నేను విసుక్కుంటే

"వద్దు నాన్నా! దానికేదో లెఖ్ఖవుంది. లలితకు తెల్సు. మనకి తెలీదు. నేను కలిపితే పాపాయికి తేడా చేస్తుంది" అనేది.

లలిత ఏ స్నేహితురాలింటికో వెళ్ళి నపుడు మాత్రం వంటింటిని వదిలి పాపాయికి ఎదురుగా కూర్చునేది. దానికి పాలు ఎన్నింటికి పట్టాలి? ఎన్ని బిస్కెట్లు యివ్వవచ్చు. ఎన్నింటికి యివ్వాలి? వగైరా వివరాలన్నీ లలిత చెప్పి వెళ్ళేది. అమ్మ తూ.చా. తప్పకుండా లలిత ఆజ్ఞను పాటించి అవన్నీ ఒక కాగితం మీద రాసి వుంచేది.

"పాపాయి అరబిస్కెట్టు తిన్నది. మిగిలినది పారవేశాను. పాలు నువ్వు కలిపినవే యిచ్చాను. గబగబా తాగేసి యింకా ఏడ్చింది. కానీ నువ్వు చెప్పలేదు కదా! మళ్ళీ కలిపి యివ్వలేదు. ఒక అరగ్లాసు మంచినీళ్ళు తాగించాను" అంటూ లలిత రాగానే అమ్మ గబగబా పాఠం ఒప్ప చెప్పేది.

కానీ లలితయింట్లో లేని ఆ రెండు గంటలూ అమ్మ విశ్రాంతి లేని దానిలా కన్పించేది. పాపాయికి తాను ఏమిలోటు చేస్తానో, అది లలితను నొప్పిస్తుందేమో అనే భీతిలో వున్నట్టు తోచేది. అమ్మ పాపాయి సంరక్షణను అందరు నాయనమ్మల్లా, ఎంజాయ్ చేయలేకపోయింది. అది ఒక గురుతరమయిన బాధ్యతగా స్వీకరించింది. ఆ బాధ్యత అమ్మను క్రుంగ దీసేది. మైథిలి కొడుకుని కూడా అమ్మ చాలాసార్లు వాళ్లు సినిమాలకు వెళ్ళినపుడు, బయటకు వెళ్లినపుడు తన దగ్గర వుంచుకునేది. కానీ ఏనాడు యిలా అలిసిపోలేదు. ఒక్క సంవత్సరంలోనే అమ్మ ముసలిదైపోయిందంటే నా మనసు అంగీకరించలేదు.



"పాపాయికి గౌన్లు కొన్నానమ్మా" అని ఒక అరడజను గౌనులు తెచ్చి యిచ్చింది అమ్మ లలితకు.

"బావున్నాయండీ" అని ఉత్సాహంగా అందుకున్న లలిత "అబ్బ! పాలియెస్టర్‌లా వున్నాయే. ఉక్క పోస్తుందేమో! చల్లగా వున్నపుడు వేద్దాం లెండి" అని ప్రక్కన వుంచేసింది.

"అప్పటికి పాపాయి పెద్దదయిపోతుంది. ఈ గౌనులు చాలవు" అన్నాను నేను.

లలిత పుట్టింటికి వెళ్ళి వచ్చిన ప్రతిసారీ అమ్మ పట్ల కొంత రిజిడ్‌గా ప్రవర్తిస్తుంది. వాళ్ళమ్మగారు హితోపదేశం ఏదో చేసి పంపిస్తారని నా అనుమానం. తనను మళ్ళీ మా యింటి కోడలిగా చేయడానికి అమ్మ చాలా ప్రేమని పెట్టుబడిగా పెట్టాలి. లలిత తిరిగి మెత్తపడటానికి రెండు, మూడు నెలలు పడుతుంది. ఈమధ్యలో మా అత్తగారు మా యింటికి వచ్చిందా కథ మళ్ళీ మొదటికి వస్తుంది.

"పాపాయి పెద్దదైపోతుందని, ఉక్కపొయ్యే గుడ్డలు వెయ్యమంటా వేమిట్రా! మనకు తెల్సిన కొట్టేలే. సాయంత్రం, నువ్వూ, లలిత వెళ్ళి మార్చుకుని నచ్చినవి తెచ్చుకోండి" అంది అమ్మ.

లలిత తప్పుచేసిన దానిలాగ తలవంచు

కుంది. "పోనీ ఒకటి వుంచుదామా? బయటకు తీసుకెళ్ళినపుడు వేయొచ్చు" అంది.

"అఖ్ఖర్లేదు" అన్నాను నేను కొంచెం కఠినంగానే.

ఆ సాయంత్రం లలిత "గౌనులేవీ?" అనడిగింది.

"ఏ గౌనులు?" అని ఎదురు ప్రశ్నించాను, అమాయకత్వం నటిస్తూ.

"ఆ పాలియెస్టర్ గౌనులిచ్చి కాటన్‌వి తెమ్మన్నాను కదా" అంది.

"అవి యిచ్చేశాను. వాటికి మారుగా నేను రెండు లుంగీలు తెచ్చుకున్నాను"

"ఏం? ఎందుకని?"

లలిత ప్రశ్నకు నాకు సమాధానం యివ్వాలనిపించలేదు.

"మీకూ, మీ అమ్మగారికీ చాలా కోపం వచ్చినట్టుంది"

"చూడు లలితా! మా అమ్మను అనవసరంగా ఈ వాదనల్లోకి లాగవద్దు"

"మరి గౌనులు మార్చమన్నందుకు మీరింత రాద్ధాంతం ఎందుకు చేస్తున్నారు"

"నేను రాద్ధాంతం చెయ్యటం లేదు లలితా! మా అమ్మ మీ దృష్టిలో చాలా పాతకాలపుది. ఎప్పుడో ముప్ఫై ఏళ్ళనాడు యిద్దరు పిల్లల్నికనేసి గాలికి వదిలేసింది. కానీ మా అదృష్టవశాత్తూ బ్రతికి బట్టకట్టాం. అందువల్ల, ఆ ముసలావిడకు పోస్టుగ్రాడ్యుయేట్స్‌కి పుట్టిన పిల్లలకి ఎటువంటి బట్టలు కొనాలో తెలియదు. నేనూ ఆవిడ కొడుకునేగదా! ఆమెకు లేని అభిరుచి నాకు మాత్రం ఎక్కడినుండి వస్తుంది? పాపాయికి బట్టలు ఈసారి మీ వూరెళ్ళినపుడు కొను. మీ అమ్మగారు మంచి సలహాలిస్తారు. ఆమెకు, కొడుకులూ, అల్లుళ్ళూ, మనుమలూ అంతా అమెరికాలో వున్నారేమో గొప్ప అభిరుచి వుంటుంది.

"మైగాడ్! మీరు ఎంత క్రూరంగా మాట్లాడగలరు?" అంది లలిత గుండెమీద చెయ్యివేసుకుని.

'ఓగాడ్! నువ్వు మాట్లాడకుండానే మనుసుల్ని ఎంత హింసించగలవు' అనుకున్నాను మనసులోనే.

"అమ్మ పాపాయికి గొలుసు చేయించింది తెలుసా?" అంది కాసేపటికి గొణుక్కుంటూ. నేను దిమ్మెర పోయాను. అయితే, మౌనంగా వూరుకోదల్చుకోలేదు.

"మా అమ్మ తన బంగారమంతా అమ్మి నాకు వుద్యోగం కొనిచ్చింది. తెల్సా?..." అన్నాను లలిత లాగానే నెమ్మదిగా అనడానికి ప్రయత్నిస్తూ.

"మీ అమ్మగారి మీద ఈగ వాలనివ్వరు. నిజంగా ఆవిడండీ అదృష్టవంతురాలు. కొడుకంటే మీలాగ వుండాలి"

"థాంక్స్‌ఫర్‌ది కాంప్లిమెంట్. కానీ ఈ రికార్డ్ బాగా పాతదయిపోయింది. క్రొత్తది మరేదైనా పెట్టు" అనేశాను.

★ ★ ★

"అన్నట్టు మీకో శుభవార్త చెప్పటం మరిచిపోయాను. నేను రాసిన సర్వీసు కమీషన్ పరీక్ష తన్నేసింది" అంది లలిత.

నేను మాట్లాడలేదు.

లలిత దెబ్బలాటకు సిద్ధంగా వుంటోందీమధ్య. మళ్ళీ తనే అంది.

"బ్యాంకింగ్ సర్వీసు పరీక్షలు రాశాను. మీకు ఫోనులో చెప్పటం మర్చిపోయాను"

"మంచిది" అన్నాను. యింకా మౌనంగా వుండటం చేతగాక.

యింతలో... అమ్మ గది గుమ్మం ముందుకు వచ్చి "లలితా! పాపాయికి గుడ్డు పెడతానన్నావుగా యివాల్టి నుండి. వుడికింది చూడు" అంది.

లలిత బయటకు నడుస్తూంటే అమ్మ సందేహిస్తూనే అడిగింది.

"గుడ్డు అరుగుతుందంటావా లలితా? దీని కంటె బియ్యం వేయించి, విసిరి, వామువేసి, ఉక్కిరి చేసి పెడితే మంచిది కాదూ!" "మహబాగా అరుగుతుంది యింకా మీరు చెప్పే బియ్యమే అరక్క కడుపు నెప్పి రావొచ్చు" అని లలిత సమాధానం యిచ్చింది.

"రజని హెూమ్‌సైన్సు చదువుకున్నది. ఆ అమ్మాయికూడా ఉక్కిరే మంచిదన్నదే" అంది అమ్మ యింకా సందేహ నివృత్తికాక.





లలిత మాట్లాడలేదు.

"మీ యింటి పద్ధతులు చాలా మంచివని మీ కందరికీ గాఢ నమ్మకం. ప్రపంచం ఎంత ముందుకు పోయినా, మీరు మాత్రం అక్కడే వుండి పోయారు" అని సణిగింది రాత్రి పడక గదిలో నాముందు.

పాపాయి పెంపకంలో లలితకు అమ్మ సహాయం అవసరం లేదు. సరిగదా, అభ్యంతరం కూడా ఉంది. ఈ విషయం అమ్మ గ్రహించేలా లలిత చేయగలిగింది. అందులో లలిత ప్రదర్శించిన అత్యద్భుతం చతురత ఫలితంగా అమ్మ క్రమంగా పాపాయికి నాయనమ్మలా కాక, వాళ్ళమ్మకి 'అసిస్టెంట్'గా స్థిరపడి పోయింది.

పాపాయి పాలూ, భోజనమూ, తాగేనీరు, పడక, నిద్ర, స్నానం వేటిల్లోనూ అమ్మకు ప్రధానపాత్ర లేదు. లలిత వాటిని ఒక తపస్సులా చేసేది. అందువల్ల సహజంగానే ఆమె చాలా అలిసిపోయేది. కానీ, ఈ విషయమై ఎవరిని తప్పు పట్టాలో లలితకు అర్థంకాలేదు. అందువల్ల, చాలా విసుగ్గా కుబుసం విడువని పాములా చాలా అసౌకర్యంగా వుండేది.

★ ★ ★

ఒక రెండు, మూడు నెలలు లలిత కష్టం చూశాక అమ్మ ఒక మంచి సలహా యిచ్చింది. లక్ష్మి కూతురు రాములు వున్నది. పన్నెండు, పదమూడు సంవత్సరాల వయసుంటుంది. ఆ పిల్లను పాపాయి పనులకోసం పెట్టుకుంటే లలిత పని కొంచెం సులువు అవుతుందని.

ఈ సలహా లలితకు కూడా నచ్చింది. అమ్మకు 'అసిస్టెంట్' పనినుండి కొంచెం రిలీఫ్ చిక్కింది.

రాములు కొద్ది కాలంలోనే లలితకు కుడి భుజం అయిపోయింది. పాపాయిని చాలా ఎక్కువగా ఆడించేది. అందువల్ల ఆ పిల్లంటే లలిత చాలా అభిమానం పెంచుకుంది. లలిత దన్ను చూసుకుని రాములు ఒకటి రెండుసార్లు పాపాయి విషయమై అమ్మకు సలహాలు యివ్వబోయింది.

"అప్పుడే నీళ్ళు కాచేసేరేటండి. పాపగార్కి తానానికి టైము కాలేదు"

"గుడ్డు యింకా బాగా వుడకాలండీ" వగైరా. నేను దానికి గట్టిగా వార్నింగిచ్చాను లలిత ఎదురుగానే.

"అమ్మా! యిప్పుడు రాములు వుందికదా! ఆ గుడ్లు, నీళ్ళూ అది చూసుకుంటుందిలే. నువ్వు వూరికే హైరాణ పడకు! చూడు రాములూ, పాపాయి పన్లు యికనుండి నువ్వూ, మీ లలితమ్మా చూస్కోండి. యింకోమాట. యిక్కడ పని చెయ్యాలనుకుంటే నోర్మూసుకుని పని చెయ్యి. వాగాలనుకుంటే మేమెవరమూ లేనపుడు మీ లలితమ్మతో వాగు. అమ్మతో గానీ, నాతోగానీ మాట్లాడేవా, తాట వలిచేస్తాను"

"అంటే నేను దాని వాగుడు వినేదానిలా కన్పిస్తున్నానా..." అంటూ యింకా ఏదో అనబోయింది లలిత.

"లలితా! డోన్ట్ మేక్ ఫస్ యిన్ ఫ్రంట్ ఆఫ్ ద సర్వెంట్స్" అని హెచ్చరించాను.

ఈ సంఘటనవల్ల అమ్మ మనసు కష్టపడి వుండొచ్చు. కానీ, శారీరకంగా అమ్మకు చాలా విశ్రాంతి దొరికింది. ఓ రోజు "మీరు పాపాయిని అసలు దగ్గరకు తీయటంలేదు" అంటూ ఆరోపించింది లలిత నన్ను వుద్దేశించి.

"చూడు లలితా! నీకు ఖాళీ ఎక్కువైపోయినట్లుంది. అందుకే ప్రతి చిన్న విషయమూ భూతద్దంలో కన్పిస్తోంది. ఆ బ్యాంకు ఉద్యోగం వచ్చినా బాగుండేట్టుంది. దాన్ని దగ్గరకు తీసుకోవాలంటే నువ్వు సవాలక్ష కండిషన్లు పెడతావాయె. చేతులు కడగాలి. బూట్లు విప్పాలి. చెమట కారకూడదు. దానికి జుట్టు అందనివ్వకూడదు. యిన్ని షరతులమధ్య ప్రేమను వ్యక్తపరచడం నావల్లకాదు. నాకు రాదు. నన్ను వదిలెయ్" అన్నాను.

అమ్మ కూడా దాన్ని చాలా సందేహిస్తూనే ఎత్తుకుంటుంది. లలిత బాత్రూంకి వెళ్ళినపుడు పాపాయి దొడ్డికి వెళ్తే దాన్ని శుభ్రం చేస్తుంది కానీ, ఆ ప్రదేశం శుభ్రం చెయ్యదు. "అదేంటమ్మా!" అంటే.

"లలిత చూడాలిరా... విరేచనంలో ఏమయినా తేడాలుంటే తల్లి చూసుకోవద్దూ!" అనేది.

"ఆ విషయం నాకు తెలీదుగానీ, ఈ దృశ్యా



లు చూళ్ళేక నాకు వాంతులయేట్టున్నాయి'' అనేవాడిని నేను.

లలిత బజారుకో, స్నేహితులింటికో వెళ్ళినపుడు మాత్రం పాపాయి దొడ్లోకి వెళ్తే శుభ్రం చేసేది. కానీ దానిని వర్ణిస్తూ ఒక పేజీ వ్యాసం రాసి వుంచేది. ఏ టైముకి వెళ్ళింది? ఏ రంగులో వెళ్ళింది? ఏ కన్సిస్టెన్సీలో వెళ్ళిందీ. వగైరా వివరాలతో.

ఇద్దరు పిల్లల తల్లి అమ్మకి పిల్లల పెంపకాన్ని నేర్పే కోడలి గడుసుతనాన్ని ఎలా అభివర్ణించాలో అర్థమయేది కాదునాకు.

★ ★ ★

లలితకు ఉద్యోగం వచ్చింది. ఆ అపాయింట్‌మెంట్ ఆర్డరు నేనే తెచ్చియిచ్చాను. ఇందులో సంతోషించవలసిన విషయం ఏమిటంటే ఈ వూరిలోనే వుద్యోగం వచ్చింది. అది కూడా మా కాలనీలో వున్న బ్యాంకు బ్రాంచీలోనే. ఆ మాటే చెప్పాను.

''నాన్నగారు హైద్రాబాదువెళ్ళి మేనేజ్ చేశారు'' అంది కించిత్తు గర్వంగా.

వాళ్ళు అంతకు సమర్థులేనని నాకు తెల్సు. మా నాన్నగారు కాబట్టి ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరు ఉద్యోగం చేసి, ఈ వూరి చివర యిల్లు కట్టారుగానీ- అదీ గ్రాట్యుటీ డబ్బుతోనూ, ప్రావిడెంటుఫండుతోనూ. అదే మా మామగారయితే ఆంధ్రప్రదేశ్‌లో అరడజను భవంతులు కట్టి వుండేవారు. ఆయన దురదృష్టమో, దేశప్రజల అదృష్టమో ఆయన అటువంటి వుద్యోగాలేవీ చేయలేదు.

తన వుద్యోగం మీద నా అభిప్రాయం వినాలని లలిత చాలా కుతూహలపడుతున్నట్టు నాకు తోచింది. అయితే ఆమెతో యిన్నాళ్ళ సహవాసం చేశాక నాక్కూడా కొంత నిగ్రహం అలవడింది. అందువల్ల నేనేమీ మాట్లాడలేదు. రోజూలాగే అమ్మయిచ్చిన టీ తాగేసి బయటకు వెళ్ళిపోయాను.

తన వుద్యోగవిషయం అమ్మకు నేనే చెప్తానని లలిత ఆశపడితే ఆమెకు నేను ఆశాభంగంకలిగించినట్లే. నేను అటువంటి ప్రయత్నం ఏమీ చెయ్యలేదు. రాత్రి కూడా భోజనం చేసి, ఫైల్స్ చూసుకుని మంచం ఎక్కేశాను





అప్పుడు లలిత అడిగింది.

''ఏం చెయ్యను?''

''పడుకో''

''చాలా తెలివిగా సమాధానం యిచ్చాననుకుంటున్నారా?''

''నేనా? నేను తెలివిగలవాడిని అనే అపోహ నాకు చాలా కాలం క్రితం వుండేది. మన పెళ్ళయ్యాక ఒక్కసారి కూడా నా కటువంటి అభిప్రాయం కలగలేదు. సెల్ఫ్‌రియలైజేషన్ అనుకుంటా''

నా ఈ సమాధానానికి మరొకప్పుడయితే లలిత చాలా కఠినంగా సమాధానం చెప్పి వుండేదే. ఇది సందర్భం కాదనుకున్నదనుకుంటా.

''నా వుద్యోగంమీద మీ అభిప్రాయం ఏమిటి?'' అనడిగింది. నేను మాట్లాడలేదు.

''నేను ఉద్యోగంలో చేరుతున్నాను'' అంది తనలో తనే గొణుక్కుంటున్నట్టు. దానికీ నేను మాట్లాడలేదు.

''మాట్లాడరేం?'' అని రెట్టించింది.

''నువ్వు స్టేట్‌మెంటు యిచ్చావో, అనుమతి అడుగుతున్నావో, నీ అభిప్రాయాన్ని వెలిబుచ్చుతున్నావో నాకు అర్థంకాలేదు **లలితా!** అందుకనే మాట్లాడటం లేదు''

లలిత చూపులకే శక్తివుంటే నేను భస్మం అయివుండేవాడిని.

''మీ అమ్మగారికి చెప్పారా నాకు వుద్యోగం వచ్చిందని'' తనను తాను నిగ్రహించుకుంటూ అడిగింది.

''లేదు'' అన్నాను ముక్తసరిగా.

''ఈ దేశంలో ఆడదానిగా పుట్టడమంత దౌర్భాగ్యం మరొకటి లేదు'' అంది.

''ఇదే మీకు వచ్చివుంటే సెలబ్రేట్ చేసి వుండేవాళ్ళు కాదూ! నాకు వుద్యోగం వస్తే ఆ ముక్క మూడో మనిషికి కూడా చెప్పలేదు'' అంది దెప్పుతూ.

ఈ ఆరోపణలో నిజంలేదు. నేను అపాయింట్‌మెంట్ ఆర్డర్ యింటికి సాయంత్రం తెచ్చాను. కానీ, మధ్యాహ్నమే వర్ధన్ దగ్గరకు వెళ్ళి నా గోడు వెళ్లబోసుకున్నాను.

''పాపాయి లలిత సమయమూ, శక్తీ హరించి వేస్తున్నదో లేక అది లలిత స్వయంకృ

తాపరాధమో తెలియదు. మొత్తానికి పాపాయితో లలితకు ఒక్కక్షణం కూడా తీరటంలేదు. ఇప్పుడీ వుద్యోగం చేయద్దు అంటే పురుషుల దౌర్జన్యం, స్త్రీల అణచివేత అంటుంది. చెయ్యి అన్నానా పాపాయి సమస్య వుండనే వున్నది. పాపాయి పనులు అమ్మ చేస్తేనే లలితకు నచ్చవు. మరిక పనిపిల్ల చేస్తే నచ్చుతాయా? అసలు అమ్మకు పాపాయిని సంబాళించగల శక్తివుందా? వంట అమ్మ చేయటానికి ముఖ్యకారణం నేను. అమ్మ మైథిలి దగ్గరకు వెళ్ళివున్న నెలరోజుల్లో నేను చాలా చిక్కిపోయానట. లలిత కుకింగ్ మేడ్ ఈజీ అనీ, దేశాభివృద్ధి కుంటుపడటానికి నావంటి భోజన ప్రియులే కారణమనీ, అసలు రుచి అనేది ఒక మానసిక బలహీనత అనీ, నా అలవాట్లు ముఖ్యంగా భోజనపు అలవాట్లు చాలా చెడ్డవనీ ఎన్ని ఉపన్యాసాలు యిచ్చినప్పటికీ వాటిని శ్రోతగా విని ఆనందించానే తప్ప ఆచరణలో పెట్టలేకపోయాను. నాకు అమ్మ చేతివంట అలవాటయిపోయింది. ఐదు నక్షత్రాల హొటల్ భోజనమయినా సరే నేను సరదాకి, స్నేహితుల సాహచర్యం కోసం తినాలి తప్ప నాకు రుచిగా తోచదు. అది నాఖర్మ. లేక నన్ను యిట్లా తయారుచేసిన మా అమ్మ తప్పో. మొత్తానికి నా గురించి అమ్మ యింకా వంట చేస్తోంది. అమ్మకి ఎప్పుడయినా ఒంట్లో బాగోకపోతే లలిత చెయ్యబోయేది.

"వద్దులేే లలితా! వాడు పేచీ పెడతాడు. యివాల్టికి ఒకటే కూర చేస్తాలే" అని అమ్మ ఓపిక చేసుకుని వంటింట్లోకి వచ్చేది. నేను భోజనానికి ఏనాడూ పేచీ పెట్టలేదు. కానీ అమ్మ వంట చేసినప్పుడు నేను ఎక్కువ తింటాననీ, లలిత చేస్తే తక్కువ తింటాననీ ఆ ఆడవాళ్ళిద్దరి అభిప్రాయమూ. బహుశా నిజమే కావొచ్చు. వాళ్ళు మాత్రం ఎందుకు అబద్ధం ఆడతారు!

మరి వంటచేయటానికే శ్రమపడే అమ్మ పాపాయి బాధ్యతను ఎలా నిర్వర్తించగలదు? అదీ లలిత చెప్పే సూత్రాలననుసరించి.

నా గోడంతా వర్ధన్ఎప్పుడూఓపికగా వింటాడు. యిప్పుడూ అలాగే విన్నాడు

కానీ, వాడు నాసమస్యకు పరిష్కారం ఏమీ సూచించలేదు. "నాకు నిద్రొస్తోందిరా ఈ ఆడవాళ్ళ గొడవలు ఎప్పుడూ వుండేవే. మీ యిల్లు చాలానయం. మా అమ్మనీ, రజనినీ చూస్తే నేనింకా సన్యాసుల్లో ఎందుకు కలవలేదా అని నాకు గొప్ప ఆశ్చర్యం" అన్నాడు ఆవలిస్తూ

అమ్మని అందరు ఆడవాళ్ళతో సమానంగా పోలిస్తే నాకు చాలా కోపం వస్తుంది. ఆ మాట ఈ గాడిదకి ఎన్నిసార్లు చెప్పినా అర్థంకాదు.

'ఇప్పుడు నీకూ వుద్యోగం రావటం శుభవార్తే లలితా!' అని నేను మన స్ఫూర్తిగా అన్లేకపోయాను. ఎందుకంటే నేనది శుభవార్త అనుకోలేదు కాబట్టి. మరిక సెలిబ్రేట్ చేయాలనే ఆలోచన ఎట్లా వస్తుంది?

"చూశారా మీరు మూడో మనిషికి కూడా నావుద్యోగం గురించి చెప్పలేదు" అనే లలిత ఆరోపణకి సమాధానంగా నేను 'వర్ధన్‌కి చెప్పాను లలితా!' అని వుండవచ్చు. కానీ అది చేజేతులా కొరివితో తల గోక్కోవడం అవుతుంది.

"చూశారా! అదీ కథ. మీకు భార్యకంటె వర్ధన్ ముఖ్యం" అనే ప్రమాదం వుంది.

నేను చిన్నపుడు ఎక్కడో చదివిన జ్ఞాపకం. బొట్టు ముఖ్యమా? పూలు ముఖ్యమా? అంటే దేనిస్థానం దానిదేనట. జుట్టులో బొట్టు పెట్టుకోవడం ఎంత అపసవ్యమో, నుదుట పూలు కట్టుకోవటం కూడా అంతే. "వర్ధన్ లెటజ్ హావ్ సెక్స్" అన్లేను కదా. అలాగే వర్ధన్‌తో మాట్లాడవల్సిన విషయాలు లలితతో మాట్లాడలేనుగదా! అసలు నా సమస్యే లలిత. దానిని స్నేహితుడితో చర్చిస్తే ఉపయోగం కానీ, లలితతో ఏమని చర్చిస్తాను

నా ఈ ఆలోచనలన్నీ నేను లలితతో చెప్పలేదు."సెలిబ్రేట్ చేయటానికి, నీకు వుద్యోగం వచ్చిందని వూరంతా టముకు వేయడానికీ నువ్వు వుద్యోగం చేయదల్చుకున్నావో, లేదో తెలియదుకదా!" అని మాత్రం అన్నాను.

"అంటే నన్ను వుద్యోగంలో చేరవద్దంటారు" అంది లలిత కొంత తీక్షణంగానే.

"డోన్ట్ ప్రెస్యూమ్ థింగ్స్ లలితా! నేనేమీ అన్లేదు"

లలిత మళ్ళీ మొదటికి వచ్చి "అయితే యిప్పుడేమంటారు?" అనడిగింది.

"ఎప్పుడూ ఏమీ అనను లలితా! యిది నీ స్వవిషయం. నువ్వు ఆలోచించుకో మమ్మల్ని యిందులోకి లాగకు..."

"మమ్మల్ని... అంటే మీ అమ్మగారిని కూడానా?"

"చూడు! అమ్మని అసలు ఎందులోకీ లాగకు. దయచేసి ఆమెను ప్రశాంతంగా వుండనీ"

"నేను వుద్యోగం చేస్తానంటే ఏమంటారో" తనలోతనే సన్నగా అనుకుంది.

నాకు మా అమ్మ సంగతి తెలుసు. ఏమీ అనదు. తన అధికారానికి లోబడే వాళ్లను అమ్మ యిట్టే గ్రహిస్తుంది. నాన్నగారి విషయంలో, నా విషయంలో, మైథిలి విషయంలో అమ్మకు ఎటువంటి సందేహాలూ, సంకోచాలూ లేవు.

'ఇది మీకు మంచిది యిలా చెయ్యండి' అని చెప్తుంది.

'ఫలానా పని వద్దు. దాని జోలికి వెళ్ళకండి' అంటుంది.

మాకు కూడా అమ్మమీద అపారమయిన నమ్మకం. మేము ఏనాడూ ఆమెను ఎదురు ప్రశ్నలు వేసి విసిగించలేదు.

అమ్మ ప్రేమ సామ్రాజ్యంలోకి కొంతవరకు బావగారు కూడా వచ్చారు. 'యిది మంచిది కాదేమో బాబూ!' అని అమ్మ అన్నదా, యిక ఆయన ఆ పని చేయరు. అమ్మంటే ఆయనకు చాలా అభిమానం నేను ఆయనను గౌరవించటానికి బహుశా యిదే ముఖ్యకారణం అనుకుంటా.

లలిత, ఎందువల్లనో అమ్మ ప్రేమకు లోబడలేదు. తనమీద మా అత్తగారి ప్రభావమూ, మైథిలి అత్తగారి ప్రభావమూ చాలా వున్నాయి వియ్యపురాలు కావటంవల్ల కాబోలు వాళ్ళిద్దరికీ కూడా మా అమ్మ మీద గొప్ప గౌరవంలేదు లలితకు అంతేనేమో. బయట పెట్టదు కానీ అమ్మ అధికారాన్ని లలిత సహించదు. అటువంటి వాళ్లమీద అమ్మ అధికారాన్ని ప్రదర్శించదు. నేను యిదంతా లలితతో చర్చించను.

"చెప్పమంటారా అత్తయ్యతో, నేను వుద్యోగంలో చేరుతున్నానని" అనడిగింది లలిత చివరగా లైటార్పేస్తూ.

"నీయిష్టం" అన్నాను కళ్ళు గట్టిగా మూసుకుని.

"నాకు ఉద్యోగం వచ్చింది అత్తయ్యా! బ్యాంకులో. అదీ మన కాలనీ బ్రాంచ్‌లోనే" అంది లలిత.

ఆమె అమ్మను అనుమతి అడుగుతుందని నేను అనుకోలేదు. నా అంచనా తప్పుకాలేదు. లలిత స్టేట్‌మెంట్ మాత్రం యిచ్చింది.

"మంచిదమ్మా!" అంది అమ్మ.

"ఏమీ సంతోష పడుతున్నట్టు లేరు" అని సణిగింది లలిత.

"లలితా! ప్లీజ్ డోంట్ ప్రెస్యూమ్‌థింగ్స్" అన్నాన్నేను అసహనంగా. మధ్యాహ్నం భోజనంలోకి అమ్మ పాయసం చేసింది.

చాలామంది యిళ్ళల్లోలాగ మా యింట్లో పాయసం గ్లాసునిండా పోసి యివ్వరు. చిన్న చిన్న బౌల్స్‌లో యిస్తుంది అమ్మ. అయితేనేం! కిస్మిస్, జీడిపప్పులతో, లేత గోధుమరంగులో సువాసనలు వెదజల్లే అమ్మ చేతి పాయసానికి మరెవరిదీ సాటిరాదు. ఆ మాటే అంటే, "అసలు మీరు ఎవరింటిలోనయినా ఏదయినా తినడానికి యిష్ట పడితేగదా!" అంటుంది లలిత.

"ఏంటమ్మా స్పెషల్ చేశావు?" అనడిగాను.

"లలితకు వుద్యోగం వచ్చింది కదు నాన్నా!" అంది.

లలిత గిల్టీగా తలవంచుకుంది.

అమ్మని ఏ రంగంలోనయినా ఎవరయినా ఓడించగలరేమో కానీ ప్రేమించటంలో ఓడించలేరు. ప్రేమించటంలో తనకుతానే సాటి అమ్మ. లలితను అమ్మ ఓడించిన ప్రతిసారీ నా ఛాతీ రెండంగుళాలు ఉబ్బుతుంది గర్వంతో.



"అయితే ఉద్యోగంలో చేరుతున్నావా లలితా? పాపాయిని ఏం చేస్తావు?" అనడిగాను, అమ్మ ఖాళీగిన్నెలు తీసుకుని వంటింట్లోకి వెళ్లాక.

"చూసేరా! మీ అమ్మగారు ఎంత తెలివయినవారో. లోపలకు వెళ్ళిపోయారు" అంది లలిత అమ్మ వెళ్ళిన వైపే చూస్తూ.

"నీకు వుదయం కూడా చెప్పాను కదూ లలితా! ఊహాగానాలు మానెయ్యి. అలా వెళ్ళటం తెలివి అనుకోకు. సంస్కారం అంటారు దాన్ని. కొడుకూ, కోడలూ వాళ్ళ స్వవిషయాలు మాట్లాడుకుంటోంటే వినడం, ఆ సంభాషణలో పాల్గొనటం మా అమ్మ స్వభావం కాదు. నువ్విప్పుడు 'మీ అమ్మగారు అదృష్టవంతులండీ మీ వంటి కొడుకున్నాడు' అంటూ రికార్డు పెట్టకు. పాపాయిని ఎవరు చూస్తారు? ఉద్యోగమూ, పాపాయి పనీ కుదురుతుందా? అన్నీ ఆలోచించుకున్నావా?" అనడిగాను.

"అత్తయ్య సహకారం లేనిదే కష్టమే" అంది.

తెలుసన్నమాట అమ్మ విలువ. తెలిసీ మరి పెడసరంగా మాట్లాడుతుందేం? అన్పించింది నాకో క్షణం.

"రాములును మనింట్లోనే వుండే ఏర్పాటు చేసుకుందాం. మధ్యాహ్నం దానికి భోజనం పెట్టవల్సి వుంటుంది" అంది.

"అలాగే అమ్మకి కూడా చెప్పు. పాపాయి జాగ్రత్త గుర్తుంచుకో. నిన్ను ఉద్యోగం చెయ్యమని అమ్మకానీ, నేను కానీ ఒత్తిడి చేయటం లేదు" అన్నాన్నేను.

* * *

కొన్ని సామెతలుంటాయి. అసలు సామెతలంటేనే పాతదయినా కొత్తతరాలకు కూడా వర్తిస్తాయని అర్థం. 'ఓల్డ్ ఈజ్ గోల్డ్' అని బహుశా అటువంటి వాటినే అంటారనుకుంటా. ఎవడి పిచ్చి వాడికానందం అనే సామెత నాకు చాలా యిష్టం. అలాగే 'దిగితే కానీ లోతు తెలియదు' అని యింకో సామెతవున్నది. మొదటి దానితో నాకేమీ సంబంధం లేదుగానీ రెండో సామెత మాత్రం లలిత వుద్యోగం పట్లం అక్షరాలా నిజమైంది. అదెలాగంటే...

లలిత ఉద్యోగంలో చేరిన మొదటి రోజే పాపాయి ఎనిమిది గంటలకు నిద్ర లేచింది.

అది బాత్‌రూంకి వెళ్ళడమనేది పెద్ద కార్యక్రమం. లలిత మెట్టు మీద కూర్చుని దాన్ని కాళ్ళమధ్య యిరికించుకుని ఉష్షూ అంటూ ఒక మ్యూజిక్ కొడుతుంది. అప్పుడు గానీ దానికి బవుల్స్ మూవ్ కావు.

యిన్నాళ్ళూ లలితకు పనేమీ లేదు కాబట్టి ఆర్.డి.బర్మన్ లెవెల్లో మ్యూజిక్ కొడుతూ కూర్చునేది. ఇవాళ కుదరలేదు. పాపాయిని రాములికి అప్పగించి, తను స్నానానికి వెళ్ళిపోయింది. తీరా స్నానాలగదిలోకి వెళ్ళేక పాపాయి పాలు కలపడానికి నీళ్ళు కాచలేదని గుర్తుకొచ్చింది. అక్కడినుండే బయటకు ఒక కేకవేసింది. అమ్మ స్టవ్ మీదనుండి కూర దించి, నీళ్ళు కాచింది. లలితకూ, నాకూ టిఫిన్ చేయటం, వంటపనిలో అమ్మ బిజీగా వుంది. అంట్లు, బయట ఊడవటంతో లక్ష్మికి ఖాళీలేదు. రాములు పాపాయికి సంగీత సహకారం అందిస్తోంది. కానీ దానికి ఫలితం ఏమీ కన్పించడం లేదు. చివరకు టిఫిన్ కూడా తినకుండా విసుక్కుంటూ అసంతృప్తిగానే లలిత బ్యాంక్‌కు వెళ్ళింది.

యిదంతా నాకు సంతోషంగా ఏమీ లేదు గానీ, గమ్మత్తుగా వుంది. లలిత వుద్యోగంవల్ల ఎఫెక్ట్ లేని వాణ్ణి నేను ఒక్కడినే. నేను మామూలుగానే తీరిగ్గా టిఫిన్ తిని, కాఫీ త్రాగి ఆఫీసుకు వెళ్ళటానికి స్కూటరు బయటకు తీస్తోంటే అమ్మ స్టీలు భరిణె ఒకటి నా చేతుల్లో పెట్టి

"ఆఫీసుకెళ్తున్నావుగదా! ఈ టిఫిన్ లలితకిచ్చెయ్యి. పాపం! ఉత్తి కాఫీ త్రాగి వెళ్ళింది" అంది.

"ఇదొక వనా నాకు? నా ఆఫీసు అటూ, లలిత బ్యాంకు యిటూ" అని సణిగాను.

"ఏడ్చావ్‌లే... లేటయినా స్కూటర్ మీద ఎంతసేపు? నాలుగు గజాలు వెనక్కువెళ్ళి, టిఫినిచ్చి వెళ్ళలేవూ?" అంటూ లోపలికి వెళ్ళిపోయింది.





"అయ్యో! మీరు తెచ్చారా?" అంది లలిత నిజంగానే ఫీలవుతూ.

"అలాంటివన్నీ పెట్టుకోకు. ఉద్యోగం చెయ్యలేవు" అన్నాను నేను నిజాయితీగానే.



మధ్యాహ్నం నేను భోజనానికి వచ్చేటప్పటికి అమ్మ తన గదిలో నిద్రపోతున్నదల్లా బయటకు వచ్చింది.

మా చిన్నప్పటి సంగతి వేరు, కానీ, నాన్నగారు రిటైరయ్యాక అమ్మ మధ్యాహ్నాలు నిద్రకి అలవాటు పడింది. వయసు పెరుగుతున్నది కదా! త్వరగా అలిసిపోతుంది. నా మధ్యాహ్న భోజన సమయానికి అమ్మ మంచి నిద్రలో వుంటుంది. రోజూ లలితే నాకు భోజనం వడ్డించేది. ఈ రోజు వచ్చి భోజనం చేసి, తిరిగి బ్యాంకుకు వెళ్ళిపోయిందట. లలిత బ్యాంక్ టైము వేరూ, నా ఆఫీసు టైము వేరూ.

"నువ్వు పడుకోమ్మా! నేను వడ్డించుకుంటాలే" అన్నాను మొహమాటానికి. నాకు నిజంగానే అన్నం పెట్టుకు తినడం అలవాటు లేదు.

లలిత వూరికినే అన్నదా మా అమ్మ నాకు ఒక్క మంచి అలవాటూ చెయ్యలేదని.

"చాల్లేరా" అంటూ నాకు భోజనం పెట్టి నా ఎదురుగా కూర్చుంది.

"పాపాయి ఏదమ్మా! యిల్లంతా యింత నిశ్శబ్దంగావుంది"

"ఇప్పటివరకూ ఏడ్చి యిప్పుడే పడుకుంది. అదేమో నాకు అలవాటు కాలేదు. (నిజానికి లలిత అలవాటు కానివ్వలేదు అమ్మ ఆ మాట అనదు) రాములు దగ్గరే నయం. కాసేపు ఆడింది. యింతలో వాళ్ళమ్మ వచ్చింది. ఎత్తుకోమని ఏడుపు. ఆ అమ్మాయికేమో ఎక్కువ టైము లేదయ్యే"

అమ్మ యింకా ఏదో చెప్పబోయి ఆగిపోయినదానిలా తోచింది. నేను భోజనం ముగించి వెళ్ళిపోయాను. అమ్మకు సాయంత్రం నాలుగు గంటల వరకూ విశ్రాంతి అలవాటు. ఈ పాపాయితో ఏం విశ్రాంతి తీసుకోగలదో నాకు అనుమానమే.

★ ★ ★

సాయంత్రం నేను ఆఫీసునుండి వచ్చేక అమ్మ నాతోపాటు లలిత క్కూడా కాఫీ తెచ్చియిచ్చింది. నాకు బాధ కల్గింది. లలిత ఆర్థిక స్వాతంత్ర్యానికి అమ్మ ఆరోగ్యం బలి అన్పించింది. అమ్మ ముఖం వడిలిపోయి వుంది. కళ్ళు అలసటగా వున్నాయి.

"అయ్ ఫీల్ గిల్టీ" అంది లలిత.

నాకు అర్థమయింది. కానీ అర్థం కానట్టు చూశాను, "అత్త గారు కోడలికి కాఫీ అందించటమేమిటి? చేయవలసిన వయసునాది. విశ్రాంతి తీసుకోవలసిన వయసు ఆవిడదీ" అంది.

"ఫర్వాలేదులే అలవాటయిపోతుంది" అన్నా.

"ఏమిటీ కాఫీలు అందించటమా?" లలిత నవ్వటానికి ప్రయత్నించింది.

"కాదు... నువ్వు గిల్టీ ఫీలవడం. యివాళ మొదటి రోజుకదా! అందువల్ల ఫీలయ్యావు. రేపటికి కొంచెం అలవాటవుతుంది. పది రోజుల తర్వాత రాగానే కాఫీ యివ్వకపోతే అరుస్తావు అదంతా పరిణామ క్రమం"

"అంత దుర్మార్గురాలిలా కన్పిస్తున్నానన్న మాట మీకంటికి"

ఇంతలో పాపాయి వచ్చి గబగబా లలిత కాళ్ళకు చుట్టుకుంది.

"ఇదొకత్తి... నన్ను ప్రశాంతంగా కాఫీ కూడా తాగనివ్వదు. అత్తయ్యా! దీన్ని..." వాక్యం పూర్తి చేయకుండా నా వంక చూసి.

''రాములూ! పాపాయిని తీసికెళ్ళవే'' అని కేకేసింది.

''రాములు లేదు. మన ఎదురుగానేగా పిండిమరకు వెళ్ళింది'' అన్నాన్నేను.

ఆ పిల్ల లేదని లలితకూ తెల్సు. కానీ నేను వూరుకోదల్చుకోలేదు. అమ్మ వచ్చి గింజు కుంటున్న పాపాయిని అవతలకు తీసుకుపోయింది.

ఎప్పటిలా అమ్మ చేతులు శుభ్రంగా వున్నాయో, లేదో లలిత పట్టించుకోలేదు.

★ ★ ★

ఒక పది రోజులు యిలాగే అస్తవ్యస్తంగా భారంగా గడిచాయి. అమ్మకు ప్రత్యేకమయిన అనారోగ్యం ఏమీలేదు. కానీ సన్నగా వుంటుంది. నాన్నగారి మరణం తర్వాత మరింత క్రుంగిపోయింది. లలిత వుద్యోగంతో అమ్మ వడలిపోయింది. ఈ పది రోజుల్లోనూ అమ్మ వయసు కనీసం నాలుగయిదేళ్ళు పెరిగినట్టు తోచింది నాకు.

అమ్మ పూజగదిలో మోగించే గంటల రవళికి మెలకువ వస్తుంది నాకు. నేను దైవ భక్తుడిని కాదుగానీ ఉదయం లేవగానే ఆ అగరువత్తులూ, కర్పూరపు పరిమళము, సన్నని గంట శబ్దం నా మనసుకు చాలా ప్రశాంతతను చేకూరుస్తాయి.

''ప్రొద్దుటే ఒక గంట పూజకు వేస్ట్. మళ్ళీ వంట కాలేదని కంగారుపడతారు'' లలిత సణిగింది.

మొగుళ్ళు పెళ్ళాలను ఎందుకు కొడతారో అర్థమైనట్టు తోచింది నాకు. అమ్మ పెంపకంలోని సంస్కారం నన్ను ఆ పని చేయకుండా ఆపివుండాలి. లేకుంటే చాచి పెట్టి కొట్టేవాడిని. ఉద్యోగం తన సరదాకోసం చేసుకుంటోంది. శ్రమ మాత్రం అమ్మ పడాలి. యిటువంటి వాళ్ళకు సమిష్టి కుటుంబాల్లోని సుఖాలన్నీ కావాలి. కష్టాలను, నష్టాలను మాత్రం భరించరు. తన సరదాకోసం తను కష్టపడుతోంది. అమ్మ దైనందిన చర్యను నిర్దేశించటానికి ఈ లలితకేమి హక్కువున్నది.

రాములు పాపాయిని బాగా అలవాటు చేసుకుంది. పాపాయి పుణ్యమా అని దానికి అమ్మ చేతి భోజనం దొరుకుతోందేమో పది రోజులకే ముఖం కళకళ లాడుతోంది.

అమ్మ పాపాయి పనులు చేస్తోంటే అనుక్షణమూ విమర్శించి, అమ్మను దాని జోలికి వెళ్ళకుండా చేసిన లలిత రాములు (ఆ పిల్ల రెండు రోజులకోసారయినా స్నానం చేస్తుందో లేదో దేవుడికే తెలియాలి) పాపాయిని ఎత్తుకు మోస్తోంటే చూస్తూ భరించటం నేర్చుకుంది. అక్కడికీ పాపం, ఆ పిల్లను గోళ్ళు కత్తిరించుకోమని, తలకు నూనె రాసుకుని గట్టిగా జడవేసుకోమనీ గాజు గాజులు వేసుకోవద్దనీ చాలా సలహాలిచ్చింది. అదేమయినా మా అమ్మా! లలిత సలహాలు పాటించటానికి, విని వూరుకుంది. అంతకంటే ఎక్కువ రాముల్ని బలవంతం చేసే ధైర్యం ప్రస్తుతానికి లలితకు లేదు.

★ ★ ★

లలిత దృష్టిలో అమ్మ చేసిన మరొక తప్పు ఏమిటంటే పాపాయి ఎప్పుడేమి తిన్నదో, ఎన్నిసార్లు విరేచనానికి వెళ్ళిందో అమ్మ లిస్టు రాసిపెట్టేది. అసలు మా యింటి విచిత్రం ఏమిటంటే అందరు కోడళ్ళు అత్తగారికి తగ్గట్టు తమను తాము మల్చుకుంటారు. మా యింటి కోడలు తన పోస్టుగ్రాడ్యుయేషన్ తెలివి తేటలతో అత్తగారిని తనకు అనుకూలంగా మార్చుకున్నది. అమ్మకు కూడా వాదించటం, ఘర్షణ పడటం యిష్టం లేదేమో లలిత ఆడించినట్లల్లా ఆడింది.

ఈ లలిత బయటకు వెళ్లినపుడల్లా 'నా కూతురు ఎన్ని గ్రాముల ఆహారం తీసుకుంది? ఎన్ని మిల్లీలీటర్ల నీరు త్రాగింది? ఎన్నిసార్లు బయటకు వెళ్ళింది? నువ్వు లిస్టు రాయి' అని ఆజ్ఞ జారీ చేసినపుడల్లా ఆ పిచ్చితల్లి ఈవిడ ఆజ్ఞల్ని తూచా తప్పకుండా పాటించింది. అమ్మ పాపాయికి నాయనమ్మలాగ సేవ చేయలేదు. ఒక సేవకురాలిలాగ మెయిడ్ సర్వెంట్ లాగ సేవ చేసింది. లలిత అమ్మను ఆ స్టేజ్‌కు దిగజార్చింది. ఏనాడూ ఎవరి అధికారానికి లోబడవలసిన అవసరం అమ్మకు రాలేదు. నా మీద ప్రేమ ఆమె వ్యక్తిత్వాన్ని చంపేసి వుండాలి. ఆమె లలిత అధికారాన్ని మూగగానే అయినా అంగీకరించింది. లలిత సహ





జంగానే నెత్తికెక్కింది. అమ్మని ఒక మంచి సేవకురాలిలాగ మెచ్చుకోలుగా చూసింది. అమ్మ యింకా దిగజారి 'లలిత పెంపకమంతా కరెక్టు. చదువుకున్న అమ్మాయిలు యిలాగే పెంచుతారు' అని మరిన్ని సర్టిఫికెట్స్ యిచ్చి లలిత గర్వాన్ని పెంచింది. యిప్పుడు లలిత వుద్యోగం చేయటం మొదలుపెట్టాక కూడా అమ్మ ప్రతి రోజూ లిస్టు తయారు చేసి యిచ్చేది. లలిత వాటిని అందుకుని, నిరాసక్తంగా ప్రక్కన పడేసేది.

అమ్మ వెళ్ళిపోయాక "నేను గిల్టీగా ఫీల్ అవ్వాలని మీ అమ్మగారు అలా రాసిస్తున్నారు. లేకపోతే ఎందుకు యీ లిస్ట్ నాకివ్వటం" అనేది. ఒకరోజు యీ మాటలు లలిత పూర్తి చెయ్యగానే నేను రిటార్ట్ యిచ్చాను.

"అది అమ్మ చెయ్యటం లేదు లలితా? నువ్వు గిల్టీగా ఫీలవుతున్నావు. నువ్విప్పుడు ఉద్యోగస్తురాలివి కదా! నీ కూతురేం తింటుందో, ఏం త్రాగుతుందో నీకు తెలియదు. అది యింకొకరు చెప్పాలి. అలా చెప్పటానికి మనకొక జీతమూ, బత్తెమూ లేని పనిమనిపి వుంది. ఆవిడను చూసి నువ్వు గిల్టీగా ఫీలయి, ఆవిడకు దురుద్దేశాలు అంట గడుతున్నావు, నపుంసకుడైన మొగుడు పెళ్ళానికి రంకు అంట గట్టినట్టుగా ఉందిది"

"ఛీ! ఛీ! మీరు తల్చుకుంటే చాలా పచ్చిగా మాట్లాడగలరు" అంది లలిత.

'అంతే! మాట్లాడటమే నేను చేయగల్గింది. తియ్యగా మాట్లాడుతూ మనుమల్ని బండ కత్తుల్తో కోయటం నాకు చేతకాదుమరి' అనుకున్నాను మనసులో.

నెలరోజుల చాకిరీ తర్వాత అమ్మ ముసలి శరీరం ఎదురు తిరిగింది. అమ్మకి జ్వరం వచ్చింది. యిక లలిత పాట్లు చూడాలి. యిన్నాళ్ళూ పాపాయి గురించి ఈమె రాములికి డైరెక్షన్స్ యిచ్చేది. రాములు చిన్నపిల్ల. పెద్ద తెలివి గలది కూడా కాదు. అవన్నీ పరోక్షంగా అమ్మకు ఆజ్ఞలే. డైరెక్టుగా మీరిలా చెయ్యండి. అలా చెయ్యండి అంటే బావుండదుకదా! రాముల్ని మధ్యలో నిలబెట్టి చెప్పేస్తే అమ్మ వాటిని అక్షరాలా పాటించేది. పేరుకి కొన్ని పనులు రాములు చేసినా అవన్నీ అమ్మ ఆధ్వర్యంలోనే. అమ్మ జ్వరంతో లలిత యిరుకునపడింది. బ్యాంకుకు వెళ్ళి మధ్యలో ఒకటి రెండుసార్లు పర్మిషన్ పెట్టి వచ్చింది.

"అత్తయ్యా! మీరు కూర్చుని చూస్తుండండి చాలు రాములే చేస్తుంది. మీరు చేయనక్కర్లేదు" అంటూ కొన్ని పనులు అమ్మకు అప్పగించేది. అమ్మ చేయకపోయినా విశ్రాంతి మానుకుని రాములు చేసేలా చూడాలికదా!

ఇటు వంట అటు పాపాయి, అమ్మ అనారోగ్యం, ఆఫీసుపని లలిత వుక్కిరిబిక్కిరయింది. నాకు నిజంగానే లలితను చూస్తే జాలి కలిగేది. పాపం! ఆధునిక స్త్రీ ఇంటా, బయటానలిగిపోతోంది అని జాలి కలిగేది. మళ్ళీ లలిత వంటి స్త్రీ ఏమాశించి వుద్యోగం చేయాలి? అవసరం ఏమున్నది? అమ్మని కష్టపెట్టి పాపాయిని కష్టపెట్టి తననుతాను హింసించుకుని లలిత సాధించేదేమిటి? అనిపించేది.

★ ★ ★

అమ్మకు జ్వరం తగ్గింది. నీరసంగా మాత్రం ఉంటోంది. ఒకరోజు లలిత "మనం ఇన్‌స్టెంట్ కాఫీ ఎందుకు తాగకూడదు?" అని ప్రపోజ్ చేసింది.

అయితే లలిత వూహించినట్టు అమ్మ తెలివిగలది కాదు కాబట్టి ఈ సంభాషణనుండి తప్పించుకోలేదు. "కృష్ణుడికి యిష్టం వుండదు. అయినా ఏదో బంధువులొచ్చినపుడు తప్పదుగానీ మామూలప్పుడు మనకేం ఖర్మ?" అంది అమ్మ.

"టైం కలిసివస్తుంది" అంది లలిత.

"అలాగే నువ్వు తాగు, మాకు అలవాటు లేదు" అంది అమ్మ నవ్వుతూనే.

"మీ అబ్బాయికూడా తాగగలరు. మీరు మైథిలి దగ్గరకు వెళ్లినప్పుడు తాగారు. మీరు తాగలేకపోతే చెప్పండి" అంది లలిత.

ఆ మాట అమ్మని ఎక్కడ హర్ట్ చేసిందో, ఎంత హర్ట్ చేసిందో నాకు మరో పది రోజుల తర్వాతగానీ తెలియలేదు.

ఆ రోజు ఏదో కారణం చేత లలిత సాయంత్రం బ్యాంకునుండి యింకా రాలేదు. నేను మాత్రం ఆఫీసునుండి వచ్చేశాను.

రాగానే అమ్మ కాఫీ కప్పు చేతిలో పెట్టింది. నేను అక్కడే పాపాయితో ఆడుకుంటోన్న రాముల్ని పిలిచి "ఈ కాఫీ నువ్వు తాగెయ్" అని యిచ్చేశాను. అమ్మవైపు తిరిగి "అమ్మా! నాకు ఫిల్టర్ కాఫీ యివ్వు..." అన్నాను.

"లేదురా..." అంది.

"ఉంటుందిలే. నీకని ఫిల్టర్ వేసుకుని వుంటావుగా అదివ్వు. ఇవాల్టికి నీకు వద్దులే"

"లేదు నాన్నా ఫిల్టర్ వెయ్యటంలేదు" అంది.

అమ్మ ఇన్‌స్టెంట్ కాఫీ తాగదు. ఎవరిళ్లకయినా వెళ్లినపుడు కూడా నాకు కాఫీ అలవాటు లేదు అంటుంది తప్ప ఇన్‌స్టెంట్ కాఫీ తాగదు. నేను అయోమయంలో వుండగానే రాములు "పెద్దమ్మగారు కాఫీ మానేశారుగా బాబుగారూ!" అని నా సందేహ నివృత్తిచేసింది.

మరురోజు వుదయం లలిత కాఫీ కలపక ముందే నేను చెప్పాను.

"లలితా! నాకు కాఫీ వద్దు"

"ఏం?" అనడిగింది లలిత అమ్మ వంక అనుమానంగా చూస్తూ-

"నీకు టైం కలిసి రావాలిగా పాలివ్వు చాలు, లేక అవి కూడా మానెయ్యమంటావా. యింకా టైం కల్సివస్తుంది" అన్నాను కసిగా.

అమ్మ గాభరాగా యిద్దరి వంకా మార్చిమార్చి చూస్తోంది.

"కంగారుపడకు పోట్లాడుకోములే. నీకోడలు పోస్టుగ్రాడ్యుయేటు. నేను డబుల్ గ్రాడ్యుయేట్‌ని మరీ అవమానకరంగా అందరి ముందూ తన్నుకుంటామా?" అని భరోసా యిచ్చాను.

★ ★ ★

నాలుగు నెలలు యిలాగే గడిచాయి. పాపాయికి తరచు జలుబు చేసేది. అప్పుడప్పుడూ విరేచనాలతో బాధపడేది. అమ్మ ధైర్యం చేసి ఏవైద్యమూ చేసేది కాదు. మైథిలి కొడుకు విషయంలో అమ్మ చూపించిన చొరవ ఏమయిందో మరి. నాన్నగారు పోయాక యిల్లు వదలని అమ్మ తరచూ రాముల్నీ పాపాయినీ తీసుకుని చిన్నపిల్లల డాక్టరువద్దకు వెళ్ళవలిసి వచ్చేది. ఇదంతా నాకు చాలా బాధాకరంగా వుండేది. ఇంటిపనితో, పాపాయి పనితో అమ్మ చాలా అలిసిపోయేది. ఉద్యోగం చేయటం కష్టం కావొచ్చు. కానీ లలిత అది తనకు తానుగా ఆహ్వానించుకున్నది. అందువల్ల అలిసిపోయినా లలిత ఆనందంగా వుండేది. అమ్మ రోజురోజుకీ కృంగిపోతున్నట్టు తోచేది నాకు. మా ముగ్గురి మధ్యా ఏదో మూగయుద్ధం జరుగుతున్నట్టువుంది. అలా ఎంతకాలమో జరగలేదు. ఒక రోజు లలిత బహిరంగ యుద్ధమే ప్రకటించింది.

"అత్తయ్యా! మీరు వంటింట్లోకి రాకండి. వంట నేను చేస్తాను. ఉద్యోగం చేయాలనుకోవటం నా సరదా. నాకు అటువంటి సరదా కలగటం నా ఖర్మ. దానికి పూర్తి బాధ్యతనాదే, అందువల్ల వంట నేను చేస్తాను. పాపాయిని మీరు చూసుకోండి. నాయనమ్మగా మీరీమాత్రం చేయగలరని నేను అనుకుంటున్నాను. రాములు ఎలాగూవుంది. దాన్ని సూపర్‌వైజ్ చేయండి చాలు" అంది.

ఇది వినటానికి చాలా బాగుంది కానీ ఆచరణయోగ్యం మాత్రం కాదు. లలిత వంట లలిత తినగలదేమో కానీ మేము తినలేం. లలితకు వంట రాదని కాదు. వంట చేయటంలో ఆమె అవలంభించే సులభ పద్ధతులు అరగంటలో వంటయిపోతుంది కాబట్టి ఎప్పుడయినా ఆరోగ్యం సరిగాలేకపోతే చేసుకోవటానికి బాగుంటాయి. కానీ ప్రతిరోజూ ఆ తిండి తినాలంటే మేము జిహ్వా చాపల్యం ఏ మాత్రమూ లేని సర్వసంగపరిత్యాగులమయినా కావాలి. లేక లలితలా తిండి తినేవాళ్లంతా భోజనప్రియులు అని మమ్మల్ని మేము బ్రెయిన్ వాష్ చేసుకుని సెల్ఫ్ హిప్నాటిజమ్‌లో లలిత వంటను మెచ్చుకోవటమయినా నేర్చుకోవాలి!

ఆ రెండూ నాకురావు.

"లలితా! నీ సూచనకు నేను ససేమిరా ఒప్పుకోను. నువ్వు నన్ను చంపినా సరే... నేను నీ వంట తినలేను..." అన్నాను.

"మీ అమ్మగారిమీద మీకంత ప్రేమన్నమాట. మనకి వంట చెయ్యలేక చచ్చిపోతున్నారు ఆవిడ" అంది.





"మనకి వంట చెయ్యలేక కాదు, నీ కూతురికి సేవచెయ్యలేక" అన్నాన్నేను వ్యవహారం యింతవరకూ వచ్చేక తాడో పేడో తేల్చడమే మంచిదని.

అమ్మ కల్పించుకుని "ఎందుకురా? ఉత్తినే పోట్లాడుకుంటారు? వంట నాకు కష్టం కాదులే. నువ్వయినా వూరు కోమ్మా లలితా!" అంది.

"మీరు చాలా శ్రమపడుతున్నారంటున్నారు కదా మీ అబ్బాయి"

"నేను అంటున్నానా? కళ్ళుండే ఏ వెధవయినా ఆ మాటే అంటాడు. లేదూ యిలా నీకూతుర్ని సాకుతూ, నీ మొగుడికి వండిపెడుతూ, నీకు వుద్యోగం చేయటానికి అనువయిన పరిస్థితులన్నీ కల్పిస్తూ చాలా సుఖపడుతుందనాలా? నీకు బుద్ధిలేకపోయినా నాకు వుంది"

"నీకేమయినా పిచ్చెక్కిందేమిరా? తీరికూర్చుని ఆడపిల్లతో పోట్లాటేమిటి?" అని అమ్మ మా తగాదాకు తాత్కాలికంగా తెరదించింది.

★ ★ ★

లలితకు మాటల్లో ఆట్టే నమ్మకంలేదు. కార్యశూరురాలు. అందువల్ల ఉదయం రోజూ కంటె గంటముందులేచి వంట యింటిప్రవేశం చేసింది. నేను కూడా లేచి అమ్మ గదిలోకి వెళ్లి-

"నువ్వు లేవకు... లేచినా వంటింట్లోకి రాకు. ఫో స్నానం చేసి పూజ చేసుకో ఫో" అన్నాను.

"ఇదంతా ఏమిట్రా కృష్ణుడూ! నన్ను కష్టపెట్టదల్చుకున్నావా నాన్నా!" అంది అమ్మ దీనంగా.

"నిన్ను సుఖపెట్టడం నా బాధ్యత, నాధర్మ మైథిలి మగవాడయితే 'ఫో అమ్మా! తమ్ముడి దగ్గరకుఫో' అని తరిమేసేవాడిని. నీకున్నది మంచి వాడినయినా, చెడ్డవాడినయినా నేనొక్కడినే కదా. అందువల్ల నన్ను నమ్మి నువ్వు నిశ్చింతగా వుండు" అన్నాను.

అయితే సమస్య నేననుకున్నంత సులువైనది కాదు. వంటయితే లలిత చేసింది. తినటానికి నేనూ, అమ్మా సిద్ధపడ్డాం కూడా. కానీ పాపాయి పనీ? అది అలాగే వుంది. దాని పని సులువని లలిత అన్నది. కానీ అదే అన్నింటి కంటె కష్టం. నాలాగ, అమ్మలాగ లలిత ఉద్యోగ సమయానికి ఎడ్జస్ట్ అవ్వవలసిన అవసరం దానికి లేదు. దానికి టైమింగ్స్ కానీ టైమ్‌సెన్స్ కానీ లేవు. అమ్మ గడియారంలా ఠంచన్‌గా చేస్తుంది ఏ పనయినా. అమ్మ నిద్రపోయే సమయానికి అది లేచి కూర్చునేది. దానిని ఆడించటం రాములు డ్యూటీ. కానీ దాని ఆహారం అమ్మేకదా చేసుకోవాలి. దానికి వేడినీళ్ళు కాచి, పాలు కలిపి పట్టి అమ్మ నడుం వాలిస్తే అది బట్టలు తడుపుకునేది. నేల రాములు శుభ్రం చేస్తుంది. పాపాయిని అమ్మ శుభ్రం చెయ్యాలి. అదీగాక మైథిలి కొడుకు విషయంలోలాకాక అమ్మ లలితకు జవాబుదారీగా ఫీలయ్యేది. దానివల్ల యింకా అలిసిపోయేది. ఒకసారి అమ్మ మాగన్నుగా కళ్ళు మూసుకుని పడుకుని వుంటే రాములు పాపాయిని పడేసిందట. అదికూడా చిన్న పిల్లేగదా!

"పాపాయి పడిపోయిందమ్మా!" అని రాములు. అనగానే, లలిత...

"అత్తయ్యా ఏం చేస్తున్నారు?" అనడిగింది.

ఆమె గొంతులో అమ్మకు ఏ భావాలు స్ఫురించాయో తెలీదు. మధ్యాహ్నాలు నిద్రమానేసి రాములుతో సమానంగా పాపాయికి కాపలాకాసేది. సాయంత్రం మేము యిల్లు చేరేటప్పటికి అమ్మ నీరు లేక వడిలిన తోటకూర కాడలా వుండేది.

★ ★ ★

"సాయంత్రం గుడికి వెళ్దాంరా కొంచెం త్వరగా రా" అంది అమ్మ. లలితనయితే 'నీకు కుదురుతుందా అమ్మా! వస్తావా? చెయ్యగలవా?' అంటుంది. నన్ను మైథిలిని అయితే ఆజ్ఞాపిస్తుంది. తప్పు లలితలో వుందో, అమ్మలో వుందో చెప్పలేం.

"లలిత వస్తుందా?"

"నాకు ఓపికలేదు బాబూ! నేనురాను" అంది లలిత. ఈవిడకు ముప్పై ఏళ్ళు కూడా పూర్తిగా లేవు. ఉద్యోగం చేసి అలిసిపోతోంది. తాను ఎంతో కోరుకుని చేరిన వుద్యోగం. ముసలి అమ్మ పాపాయి పని చెయ్యాలని ఆశిస్తుంది. యిదేం న్యాయం!

సాయంత్రం అమ్మా నేనూ గుడికి వెళ్ళాము. "ఎక్కగలవా అమ్మా?" అన్నా మెట్లు చూసి.

"ఆహా!" అంది.

మెట్లు ఎక్కువ లేవుగానీ నిటారుగా వున్నాయి. పూలూ, పండ్లూ కొనుక్కుని యిద్దరం మెట్లు ఎక్కుతున్నాం. నాకేమిటో చెప్పలేని అశాంతిగా వుంది. ఇదీ అని చెప్పలేను. ఏమిటో చాలా అసౌకర్యంగా వుంది. పైన గుడిలో గంటలు మోగుతున్నాయి.

"నువ్వు లలితతో తరచు దెబ్బలాడుతున్నావు నాన్నా!" అంది.

"లలిత చేసే పనులకి యింకొకళ్ళయితే తన్నే వాళ్ళు తెలుసా. నేను వామ్మజని కాబట్టి దెబ్బలాడి వూరుకుంటున్నా" అన్నా.

ఆ సందెవేళలో కనీ కన్పడనట్టు నవ్వింది.

"అమ్మా! నువ్వు రంగు చీరెలెందుకమ్మా మానేశావు?"

చాలా అసందర్భమయిన ప్రశ్న.



''మునుపు ఎప్పుడు గుడికి వచ్చినా పట్టుచీ రె కట్టుకునే దానివిగా''

అమ్మ నావైపు తిరిగింది. కళ్ళు కొద్దిగా ఆశ్చర్యంతో విప్పారినాయి.

''నీకు గుర్తుందా...'' ఏదో మాట్లాడబోయి ఆగిపోయింది. యిద్దరమూ గుళ్ళోకి వెళ్ళి పూజ చేయించాము. బయటకు వచ్చి గట్టు మీద కూర్చున్నాం.

''ఏం కోరుకున్నావురా?'' అనడిగింది.

''మా అమ్మని ఎపుడూ సంతోషంగా వుంచే శక్తినిమ్మని కోరుకున్నానమ్మా!'' అన్నాను.

''పిచ్చి సన్నాసి'' అంది అమ్మ. గొంతు కొద్దిగా వణికింది.

''అమ్మా! నిజం చెప్తానని ఒట్టెయ్యవూ!''

అమ్మ సందేహంగా చూసింది. ''ఏం నిజం?''

''ఒట్టెయ్యి''

''ఏడ్చావులే''

''ప్లీజ్ అమ్మా! ఒట్టెయ్యవూ!'' అమ్మ సందే హిస్తూనే తలవూపింది.

''నువ్వేం కోరుకున్నావమ్మా?''

అమ్మ దీర్ఘంగా నిశ్వసించింది. యింకేమ డుగుతానో అని భయపడినట్టుంది. అమ్మని భయపెట్టే విషయాలు కూడా వున్నాయా?

''వద్దురా నువ్వు బాధపడతావు''

''అమ్మా! నువ్వు ఒట్టేసావు''

కొంచెంసేపు సందేహించి అన్నది.

''నన్ను త్వరగా మీ నాన్నగారి దగ్గరకు తీసుకువెళ్ళమని కోరుకున్నాను''

నా గుండెని ఎవరో నొక్కినట్టయింది. నాకు తెలీకుండానే ఏడ్చేశాను.

''కృష్ణుడూ! తండ్రీ! చూశావా? చెప్పేవరకు పీడించావు. తీరా చెప్తే బాధపడుతున్నావు''

''నిన్ను చాలా కష్టపెడుతున్నాము కద మ్మా!''

''లేదు నాన్నా! లేదురా... కానీ మీనాన్నగా రు లేకుండా నేను బ్రతకలేకుండా వున్నాను రా!'' అమ్మ కూడా ఏడ్చింది.

''అమ్మా! లలితంటే పరాయిది. నేను నీ కడుపున పుట్టిన వాడిని కదా! మొహమాటం లేకుండా చెప్పు. పాపాయి పని కష్టంగా లేదూ!''

అమ్మ మాట్లాడలేదు. తనకు మొదటి నుండి మెరమెచ్చు మాటలూ, అనవసరపు అబద్ధాలూ అలవాటులేదు. అందుకే మెదల కుండా వూరుకుంది.

''చెప్పమ్మా!'' అని రెట్టించాను.

''కృష్ణుడూ! నాకు యాభైఅయిదు సంవత్స రాలు దాటాయి. పెద్దదాన్ని అయిపోయాను. మీ చిన్నప్పుడు నేను కూడా చిన్నదాన్ని. అందువల్ల, మీ పెంపకం నాకు బాధ్యతగా తోచలేదు. మీతోపాటు ఆడుతూ పాడుతూ ఆషా మాషీగా పెంచాను. నువ్వు నమ్మవేమోగానీ నాకు మైథిలి కొడుకెంతో, నీ పాపాయీ అంతే, దాన్ని ప్రేమిస్తాను. దానితో ఆడుకుంటాను. కానీ, దాని బాధ్యత స్వీకరించలేను. యిలా అంటే మీ కందరకూ దుర్మార్గంగా అని స్తుందేమో. నాకు శారీరకంగా శక్తిలేదు. మీ నాన్నగారు పోయేక మానసికంగా ఉత్సాహ మూలేదు. నాకు భగవంతుడు పిల్లలమీద వెర్రిప్రేమ పెట్టాడు. మన అదృష్టం బావుండి చెల్లాయికి మంచి భర్త దొరికాడు. పెళ్లయ్యాక అది లావయ్యిందని నువ్వు ఏడిపిస్తున్నావు గానీ దాని కళ్లల్లో మెరుపూ...''

నేను మధ్యలో అందుకుని, ''అవునవును... దాని ఒళ్ళూ...'' ''ఛీరా సన్నాసీ!'' అంటూ అమ్మతనసంభాషణనుకొనసాగించింది.''దాన్ని చూస్తేనే అది సుఖంగా వుందని నాకు అర్థమ వుతుంది దాని విషయంలో నాకు ఏ దిగులూ లేదు''

''దిగులంతా నా విషయంలోనేనా?''

''నీ విషయంలో కూడా నాకు దిగులులేదు. నిన్ను చూస్తే నాకు భయం. లలితకూ, నీకూ మధ్య యింకా బంధం గాఢతరంకాలేదు. యిప్పుడు నేను చచ్చిపోతే, నువ్వేమయిపో తావో అని వణికిపోతాను నేను. యింకా అదే నన్ను జీవితానికి కట్టి వుంచుతున్నది. నువ్వు అన్నం ఒక్క ముద్ద తక్కువ తింటే నా ప్రాణం కొట్టుకుపోతుంది. లలితకు నా బాధ అర్థంకా దు. వంట చెయ్యటం నాకు కష్టం కాదు నాన్నా! పాపాయిని చూసుకోవటం నాశక్తికి





మించిన పని. అదంటే ప్రేమ లేదని అనుకోవ ద్దు. నాకే ఓపిక లేదు. అర్థమయిందా? లేక నువ్వు కూడా అమ్మస్వార్థపరురాలు. చెల్లాయి కొడుకు మీద ప్రేమ. పాపాయిమీద ప్రేమలేదు అనుకుంటున్నావా?''

''అమ్మా! అమ్మా!''

నేను ఏడ్చాను.

ఆ చీకటిలో ఐదారేళ్ల పిల్లవాడిలా ఏడ్చాను.

పాపం! అమ్మ!

తన భావాలు పంచుకునే వాళ్ళు లేక యిన్నాళ్ళూ ఎలా తల్లడిల్లిపోయిందో తల్చు కుని, తల్చుకునీ ఏడ్చాను.

''మీ యిద్దరూ గుడికి వెళ్ళొస్తున్నారా? ఏద యినా సంతాపసభకు వెళ్ళి వస్తున్నారా?'' అనడిగింది లలిత మా ముఖాలు చూసి.

ముందు లలితతో అమ్మ గురించి వివ రించి చెప్దామనుకున్నాను. పాపాయి నీ బిడ్డ. నువ్వు కోరుకుని జన్మనిచ్చిన బిడ్డ. దాని ఆలనా పాలనా నీది. అమ్మని కష్టపెట్టొదు అని. కానీ లలితకు తన వుద్యోగం ముందు ఏవీ ప్రాధా న్యంగా కనపడటంలేదు. పాపాయి పని ఏం కష్టం కాదు అనుకుంటుంది. అనుకోకపోయినా తన స్వార్థంకోసం అంటుంది. ఆ ఆలోచన విరమించుకున్నాను.

ఉదయం లేవగానే యుద్ధం ప్రకటించేశా ను. అలిగినట్టు కాదు. సున్నితంగా కాదు. 'నాకు కాఫీ వద్దులే, పాలివ్వు' అని అమెకు ఛాయిస్ యివ్వటం కాదు. లలితతో ప్రత్యక్ష యుద్ధానికి ఆయత్తమయ్యాను.

''లలితా! ఇంతవరకూ అయిందేదో అయింది. ఇక నాకు ఇన్‌స్టెంట్ కాఫీవద్దు ఫిల్టర్ వెయ్యి...''

తీరా వాక్యం నోటినుండి వచ్చాక నాకు అక్కడ నిలబడి ఆడవాళ్ళిద్దరి ముఖంలోని భావాలు చూసే ధైర్యం లేకపోయింది. బాత్ రూములోకి వెళ్ళిపోయాను. నేను బయటకు వచ్చేటప్పటికి అమ్మ దోసెలు వేస్తూ, లలిత పాపాయికి పాలు పడుతూ కన్పించారు. లలిత నావంక ఒక భావరహితమయిన చూపు చూ సింది. నేను ఒక్కక్షణం బెదిరిన మాట నిజం. కానీ వెంటనే నన్ను నేను సంబాళించుకున్నా ను. యుద్ధం ప్రకటించాక వెనక్కి తగ్గటం వీరలక్షణం కాదు.

''కాఫీ లలితా!'' అన్నాను టేబిల్ ముందు కూర్చుని.

''కనపడటం లేదా? పాపాయికి పాలు పడు తున్నాను కదా!''

''అమ్మా! కాఫీ!''

''అత్తయ్య దోసెలు వేస్తున్నారు కదా!'' అమ్మ తరపున కూడా లలితే సమాధానం చెప్పింది.

''అదంతా నాకు తెలియదు అమ్మా! కాఫీ'' అమ్మ దోసెలపెనం దించింది. నేను అక్కడే పేపరుచూస్తూ కూర్చున్నాను. లలిత కొంచెం సందేహిస్తూనే గొణిగినట్టుగా అంది.

''మీరు పాపాయి పనిలోనయినా సహాయం చేయొచ్చుగా...''

''ఏంటీ? జోక్స్ వేస్తున్నావా, ఉదయమే. ఎట్‌లీస్ట్ ఐ డోన్ట్ రెలిష్ సచ్ జోక్స్. నేను ఆఫీసుకి విశ్రాంతి తీసుకోవడానికి వెళ్ళటం లేదు. పనిచెయ్యటానికి వెళ్తున్నాను. నెలకు ఒకటికాదు రెండుకాదు అయిదు వేలిస్తున్నా రు. దానికి తగ్గట్టు నన్ను పిండి పిప్పి వదులు తారు. ఇక ఇంట్లో పాపాయిని ఎత్తుకోవటానికీ, వంటలో సహాయం చేయటానికి నాకు తీరికా, ఓపికా, ఉత్సాహమూ ఏమీలేవు. నేను మీ అన్నల్లా, బావల్లా అమెరికాలోనూ లేను. అర్థమ యిందనుకుంటా. అమ్మా! కాఫీ''

అమ్మ ఫిల్టర్‌వేసి గబగబా కాఫీ తెచ్చియి చ్చింది.

ఒక్క గుక్క నోటిలోకి వెళ్ళగానే నిద్రమత్తు, బద్ధకం అన్నీ వదిలిపోయాయి. వెధవది నా యింట్లో నేను నాకిష్టమయిన కాఫీ త్రాగటానికి లేకపోతే అదేం బ్రతుకు!

కాఫీ తాగి కప్పు పక్కనపెట్టి.

''అమ్మా! నువ్వు తెల్లవారుజామునుండీ వేస్తున్నావు చూడు అట్లతద్ది అట్లలాగా. అవ న్నీ రాములికీ, లక్ష్మికీ యిచ్చెయ్యి. ఇంకా మిగిలితే నువ్వూ, నీ కోడలూ తినండి. నాకు మాత్రం ఎప్పటిలాగే నేను ఆఫీసుకు వెళ్ళే ముందు వేసివ్వు. ప్లీజ్ లలితా! దయచేసి



నువ్వు వెయ్యొద్దు. నువ్వు చేసేవాటిని దిబ్బరొట్టె లంటారు. నాకు దోసెలు కావాలి'' అన్నాను.

లలిత నిశ్చేష్టురాలై చూస్తోంది. ఒక అర గంట ఆగాక నేను బెడ్‌రూంలో వుంటే వచ్చి-

''వంటయినా నేను చెయ్యొచ్చా?'' అనడి గింది అక్కసుగా.

''మహరాజులా చెయ్యి. కానీ ప్రకృతివైద్యశా లలో పెట్టినట్టు అన్నీ కుక్కర్‌లో వుడికించి, తాలింపులు వేస్తే నేను తినను'' అన్నాను ఖచ్చితంగా.

''నాకు టైం చాలదు''

''చెయ్యకు అమ్మ చేస్తుంది''

''మీ అమ్మగారికి ఓపికలేదు. చెయ్యలేరు''

''అమ్మ తరపున నీ వకాల్తా ఏమిటి? అమ్మా! నాకు తిండిపెట్టడానికి నీకు ఓపిక లేదా; చెప్పు. అలాగైతే ఈ 'లో కేలరీ డైట్' తినటానికి అన్ని కాలరీల శక్తి వృధాచేసుకుని లంచ్ అవర్‌లో ఇంతదూరం రావటం దేనికి? అక్కడే కేంటీన్‌లో ఏదయినా తింటాను'' నేను పడకగ దిలోనుండి బయటకు వచ్చి అమ్మను నిలదీశా ను.

''ఎందుకురా పొద్దుటినుండీ పేచీలకు దిగావు?''

''ఇందులో పేచీ ఏం లేదమ్మా. ఒకరోజు, రెండురోజులు సరదాగానో, కుదరకో అయితే లలిత వంట తినటానికి నాకు అభ్యంతరంలే దు. కానీ లలిత రిటైరయ్యేవరకు ఈ భోజనం నేను తినలేను. నీలాగా చెయ్యమను తింటా ను''

''ఐ కాంట్ బర్న్ మై టైమ్ ఇన్‌ది కిచెన్'' అంది లలిత బుసకొడుతూ.

''డోంట్ బర్న్ లలితా! లెట్ మై మదర్ బర్న్ ఇట్ ఫర్‌మీ. షిలవ్స్ యిట్ టూ'' అన్నాను ప్రశాంతత నటిస్తూ.

ఈ పాచిక పారలేదు. నా ఎత్తువల్ల అమ్మకు పనిఎక్కువయింది. నాశించినట్టుగా వంటపని లలిత పూర్తిగా అమ్మకు వదలివేసింది. నేను కోరుకున్నది కూడా అదే.

కానీ అమ్మకి అసిస్ట్ చెయ్యటానికి ఎవరూలే రు.

లక్ష్మి అంట్లు, ఇంటా బయటా తుడవటం తప్ప మిగిలిన పనుల జోలికి రాదు.

రాములికి, లలితకు పాపాయి పనితో సరిపో తుంది.

మేము వెళ్ళేవరకు అమ్మకు వంటపనితో సరిపోయేది. ఇది అమ్మకు మామూలే. ముందు కూరలు చేసుకుంటుంది. మేము వెళ్ళేముందు టిఫిన్ చేస్తుంది. మేము వెళ్ళాక అన్నం వండి పడుకోవడానికి తన బెడ్‌రూంలో కి వెళ్ళిపోతుంది. నాకు ఊహ తెల్సిన నాటి నుండీ అమ్మ దినచర్య ఇదే. కాకుంటే మా చిన్నప్పుడు మధ్యాహ్నాలు ఇంతసేపు నిద్రపో యేది కాదు. మైథిలి గౌన్లమీద లంగాలమీద పూలు కుడుతుండేది. తర్వాత తర్వాత వయ సు పెరిగినకొద్దీ ఎక్కువసేపు విశ్రాంతి తీసు కుంటుంది.

ఇప్పుడు వంట పూర్తయ్యేసరికి మేమిద్దరం బ్యాంకులోనూ, ఆఫీసులోనూ వుంటాం. పాపాయి ఒక నిద్ర పూర్తిచేసి లేచి కూర్చుంటుంది. ఇక అక్కడినుండి అమ్మకు దానితో సరిపోతుంది. రాములుమీద పూర్తిగా వదిలేందుకు లేదు. అది కూడా చిన్నపిల్ల కావటంతో ఒక్కొక్కసారి దీన్ని వదిలేసి అది నిద్రపోతూవుంటుంది. ఒకసారి అమ్మ మధ్యలో నిద్రలేచి చూస్తే ఈ పిల్ల నిద్రపోతోందట. పాపాయి పాక్కుంటూ బాత్‌రూంలోకి వెళ్లి వుందట. అమ్మకి ఇక నిద్ర ఎలాపడుతుంది. ఇవన్నీ లలితకు అర్థమవుతున్నాయో లేదో! లేక అర్థం కానట్టు నటిస్తోందో తెలియదు.

ఒక ఆదివారం వర్ధన్, రజనీ వచ్చారు మా ఇంటికి. ''నువ్వేమిటి పిన్నీ! ఇలా అయిపోయి నావు?'' అన్నాడు వర్ధన్. వాడు అమ్మని చూసి ఖంగుతిన్నాడు.

అమ్మ ఒక నవ్వు నవ్వింది బలహీనంగా.

''ఉద్యోగం చేస్తోంది'' అన్నాను నేను పొడిగా.

''ఎవరూ? పిన్నా?'' అన్నాడు వాడు తన జోకుకు తానే నవ్వుకుంటూ.

''ఉద్యోగం చేసేది లలిత. కానీ పని అమ్మకు ఎక్కువయింది. అదీ జోకు''

''పాపాయి చిన్నదికదా! ఇలాంటివి తప్ప వులే'' అంది రజని.

కోడలు కావడంవల్ల అర్జెంటుగా లలిత





పక్షాన చేరుతూ.

"అవును. పాపాయి పెద్దయ్యేటప్పటికి మా అమ్మ వుండదు. అసలు ఈ లెక్కన అరగ్గొడుతూ వుంటే దీని చిన్నప్పుడే మా అమ్మ ఉండకుండాపోయే ప్రమాదం వుందనుకో. బొందితో కైలాసం అంటే ఇదే గావును"

నా వ్యాఖ్యానానికి లలిత ముఖం ఎర్రబడింది.

"కృష్ణ ప్రేమించినట్టు తల్లినెవరూ ప్రేమించరు" అంది. ఆ గొంతులో భావాలు చెప్పటం చాలా కష్టం.

"అవును. కానీ, నాది కొంచెం మోటు ప్రేమ. ధృతరాష్ట్రుడికిభీముడిపట్ల వుండే లైపన్నమాట" అప్పుడు కృష్ణుడు ఉండి వాణ్ణి పాడి అవకుండా కాపాడాడు. పాపం! యిప్పుడెవరూ లేక మా అమ్మ నా ప్రేమతో పిండి అయిపోతోంది. ఊరికే నాన్సెన్స్ మాట్లాడక. ప్రేమట ప్రేమ. ఎవడి తల్లిని వాడు అభిమానించడం కూడా గొప్పేనా? మీ కోడళ్ళందరి ఉద్దేశమూ మీరు కాపురాలకు రాగానే మేము అమ్మల్ని నిలబెట్టి కాల్చెయ్యాలనా? సారీ రజనీ"

నేను విసురుగా లేచి వెళ్ళిపోయాను.



"మీరు వంటింట్లోకి రాకండి అత్తయ్యా!" అంది లలిత.

వర్ధన్ వాళ్ళముందు అవమానమయిందని చాలా కోపంగా వున్నట్టుంది.

"ప్లీజ్ లలితా. డోంట్ ట్రైటూ డిక్టేట్ టర్మ్ టు అమ్మ"

"అదేదో తెలుగులో పోట్లాడుకోండర్రా. నాకు అర్థం కావటంలేదు" అంది అమ్మ నవ్వటానికి విఫల ప్రయత్నంచేస్తూ.

"తగాదా అంతా మీ గురించేనండీ" అంది లలిత.

అమ్మ అప్రతిభురాలైపోయింది. కాళ్ళు రెండూ నేలకు అతుక్కునిపోయాయి.

ప్రశాంతంగా జీవితం గడపవలసిన అమ్మ...

నాన్నగారు లేకుండా ఒంటరిగా బ్రతుకు బండిని యీడుస్తోన్న అమ్మ...

దీనంగా, నిస్సహాయంగా, నిస్తేజంగా చూస్తూ నిలబడింది.

లలిత మాట్లాడింది అమ్మకు పూర్తిగా అర్థం అయింది.

నేనేం చేసానమ్మా లలితా! అని అడగటానికా అన్నట్టు నోరుతెరిచింది. కానీ కళ్ళవెంట నీరు బొటబొటా కారింది. గొంతు పెగల్లేదు. నెమ్మదిగా తిరిగి తన గదిలోకి వెళ్ళిపోయింది.

"సంతోషంగా వుందా లలితా! అమ్మని ఏడిపించావుగదా! ఆర్‌యూ హ్యాపీ. నీ ఉద్యోగం కాదుగానీ లలితా మమ్మల్ని చిప్సులాగా వేయిస్తున్నావు"

• లలిత ముక్కుపుటాలు అదిరాయి. గబగబా అమ్మ గదిముందుకు వెళ్ళి,

"నేనేం తప్పుచేశాను అత్తయ్యా! వంట మీరు చేయలేకుండా వున్నారు. నేను చేస్తానన్నాను తప్పా! నేను వుద్యోగం చేస్తూ కూడా నా బాధ్యతలను వదిలించుకోవటంలేదు. మీరెవరూ అది గ్రహించరేమి? వర్ధనరావుగారి కుటుంబంముందు నాకు ఎంత అవమానం జరిగింది? అసలిలా మీరు పాపాయి పనితోనూ, వంటపనితోనూ అలిసిపోతోంటే, నీరసించిపోతోంటే నాకు సుఖంగా వుందనుకుంటున్నారా? నేను ఉదయమే లేచి వంటచేస్తాను. మీరు ఎందుకు విశ్రాంతి తీసుకోరు"

మధ్యలో నేను ఏదో అనబోతుంటే చేతితోనే నన్ను వారించింది.

"అమ్మ... అమ్మ" అనే ఈ పెద్దమనిషి

కూడా భోజనం దగ్గర షడ్రుచులు కావాలంటా రుగానీ సర్దుకునేందుకు ప్రయత్నించరేమి?" అని నాక్కూడా ఒక చురక అంటించింది.

మళ్ళీ నేను నోరు తెరవబోయాను. ఈసారి అమ్మ ఆపింది.

"లలితనే మాట్లాడనీ కృష్ణా! చెప్పమ్మా!" అంది లలితవైపు తిరిగి.

"చెప్పేది ఏంలేదండీ. నేను వంటచేస్తాను. మీరు పాపాయిని చూసుకోండి. అందరికీ సుఖవుగా వుంటుంది"

"అంటే ఎవరు ఏ పనులు చేయాలో తమరు ఆజ్ఞాపిస్తారు. మేము పాటించాలనమాట" నేను గొంతు హెచ్చించి గద్దించాను.

"నాన్నా! నువ్వు నోరు మూసుకో" అంది అమ్మ. లలితవైపు తిరిగింది.

"లలితా! వంట నాకు శ్రమకాదు. అది కష్టమని నేను ఏనాడూ అనుకోలేదు. అది నాకు సరదా! ఉదయం లేచి పూజచేసుకుని, వంట చెయ్యకపోతే నాకు తోచదు. అలాకాదూ! ఈ ఇల్లు నీదీ. నీకు వంట చెయ్యాలని వుందీ అంటావా? తప్పక చెయ్యి. నాకు అభ్యంతరంలేదు. కానీ కృష్ణ కడుపునిండా భోజనం చెయ్యకపోతే నా మనసు కొట్టుకుంటుంది. నీవూ అమ్మవయ్యావు. పాపాయి ఒక గుక్కెపాలు త్రాగితే నీకెంత బాధగా వుంటుందో వాడు భోజనం తక్కువ తింటే, కాఫీ తాగకపోతే నాకూ అలాగే వుంటుంది. నీ బిడ్డతో నీ బంధంకంటే నా బిడ్డతో నా బంధం ఎన్నో ఏళ్ళు పాతది. కాదంటావా?"

"ముప్పైఏళ్ళు దాటిన మనిషికీ, నెలల పసిదానికీ పోలికేమిటండీ?" అంది లలిత విసుగ్గానే.

"పోలిక వుంది లలితా! అది నీకు బిడ్డ. వాడు నాకు బిడ్డ"

"మీ బిడ్డ సౌకర్యమే మీకు ముఖ్యమన్న మాట. నా బిడ్డ గురించి ఎవరికీ అక్కర్లేదన్న మాట"

"అదేం మాటమ్మా? ఎందుకు అక్కర్లేదు? పాపాయి మనింటిదీపం. మనందరికీ దాని మీద ప్రేమ వుంది. నువ్వు నమ్మినా, నమ్మకపోయినా నాకు మైథిలి కొడుకొకటీ, యిదొకటీ కాదు. ప్రేమవేరు. బాధ్యతవేరు. ఈ వయసులో నేను దాని బాధ్యత మోయలేను. ఎప్పుడో పాతికేళ్ళక్రితం చేసిన చిన్నపిల్లల పనులు ఈ ముసలితనంలో నేను చేయలేను"

"మరి దాన్ని గాలికి వదిలేద్దామా?"

"లలితా!" ఈసారి అమ్మ గొంతు కఠినంగానే పలికింది. "గాలికి వదిలేసేదానివి బిడ్డని ఎందుకు కన్నావు? నీ బిడ్డ బాధ్యత నీది. నువ్వు ముందు తల్లివి. దాని తర్వాతే ఏదయినా? నేను నాయనమ్మగా దాన్ని ప్రేమించగలను. కానీ మీలా చిన్న చిన్నపనులు చేయలేను. నాకు విశ్రాంతి కావాలి. మనశ్శాంతి కావాలి. అది పాకుతుంటే క్రిందపడుతుందని భయం. ఎక్కువసేపు నిద్రపోతే జ్వరం తగిలిందా? అని భయం. నీళ్ళబకెట్ వద్దకు వెళితే కాళ్ళు తేలి బకెట్‌లో పడుతుందని భయం. విరేచనమయితే మీ ఇద్దరూ వుండరు. అవి ఆగుతాయో మరిన్ని విరేచనాలవుతాయో అని భయం. ఇవన్నీ నీకు అర్థంకావటంలేదు. చంటిపిల్లని పెంచటం గురుతరమయిన బాధ్యత. ఈ వయసులో నేను నిభాయించలేను. తర్వాత మీ యిష్టం"

అమ్మ నెలలతరబడి తన మనసులో వున్నదంతా వెళ్ళగక్కి తన మనసును తేలికపరుచుకుంది. అమ్మ అలా అనగానే నేను నిశ్చింతగా ఆఫీసుకు వెళ్ళిపోయాను. ఎందుకు అనుకున్నానో తెలియదు. సమస్య తీరిపోయిందనుకున్నాను.

కానీ... ఆ మరురోజే అమ్మ మైథిలి దగ్గరకు ప్రయాణమవుతుందని మాత్రం ఊహించలేదు.

నా ఆలోచనలల్లో నేనుండగానే తెల్లవారిపోయింది.

★ ★ ★

వర్ధన్, నేనూ వాళ్ళ డాబామీద కూర్చున్నాం. నేను నా కలను వాడికి విన్పించాను. వాడు దానికంత ప్రాముఖ్యతను ఇవ్వలేదు.

మనం డాక్టరు కన్పించగానే 'తలనెప్పి డాక్టరుగారూ, ముక్కు నీరు కారుతోంది. ఆకలి లేదు. వెన్నునెప్పి, సాయంత్రాలు జ్వరం'





అంటూ మన బాధలు ఏకరువు పెడతాం. ఆయన అవన్నీ వింటాడో లేదో తెలియదు. కాగితంమీద ఒక గీతగీసి మనముందుకు తోస్తాడు. దీనికి ప్రతిగా మా స్నేహితుడొకాయన మంచిజోక్ చెపుతాడు. మనం హోటల్‌కి వెళ్ళి సర్వర్‌ని పిలిచి 'బాబూ! ఉల్లిపాయలు ఎక్కువేసి పచ్చిమిర్చి అల్లం తగుమోతాదులో తగలనిచ్చి బాగా రోస్ట్ చేసి ఒక పెసరట్టు తెచ్చిపెట్టు' అంటారుట. వాడు వంటింటి దెసతిరిగి 'ఒక్క పెసారా!' అని అరిచి రెండో టేబిల్ దగ్గరకు వెళ్ళిపోతాడు. మనకు కంఠ శోష మాత్రం మిగులుతుంది.

అలా నేను నా కలని వివరిస్తుంటే వాడు పెళ్ళాన్ని కేకేసి,

"మంచి కాఫీ రెండు కప్పులు పట్రావేయ్" అని ఆజ్ఞ జారీ చేశాడు.

"పిన్ని మైథిలి దగ్గరకు వెళ్ళిందని నాకు చెప్పలేదేమిరా? నిన్న రజని మీ ఇంటికి వచ్చిందట. తను చెప్పేవరకు నాకు తెలీలేదే? ఏమన్నా విశేషమా?"

"అవును. నా తద్దినం"

"ఆఁ! మరి నన్ను పిలవలేదేమిరా?"

"ఎక్కువ తింటావని భయపడి"

"ఎందుకురా అంత ఉక్రోషం. అసలేం జరిగిందో చెప్పరాదూ!"

"ఏం చెప్పేదిరా? ఎక్కడినుండి మొదలు పెట్టి చెప్పేది? ఒరేయ్ వర్ధనా, నువ్వు నవ్వకు గానీ మీ ఇల్లు చూస్తే ముచ్చటేస్తుందిరా నాకు?"

నా మాటలకు వాడు పెద్దపెట్టున నవ్వాడు.

"ఇంతంత జోకులేసి నవ్వవద్దనటం న్యాయం కాదురా కృష్ణా! మా నాయనకు నామీద అనుమానం. సంపాదించినదంతా ఇంటికే ఖర్చుపెడుతున్నానా? దొంగ 'బ్యాంకు బేలన్స్' ఏమయినా మెయిన్‌టెయిన్ చేస్తు న్నానా? అని. మా అమ్మకి కూతుళ్ళపిచ్చి. వాళ్ళకి పెళ్ళిళ్లయి పదేళ్ళయి, ఒక్కొక్కళ్ళు ముగ్గురు బిడ్డల తల్లులైనా ప్రతి పండుగకూ నేను వాళ్ళని పిలవనేమీ, వాళ్ళకీ, వాళ్ళ మొగుళ్ళకీ, పిల్లలకు బట్టలరూపేణా, మర్యాదలరూపేణా ఖర్చుపెట్టి దివాళా తియ్యనేమిటీ? అని ఆలోచిస్తుంది.

ఏమన్నా అంటే 'సన్యాసీ! నువ్వు ఆడపిల్లలకు పెట్టాలి- ఇంతకు యింతా మీ మామగారి దగ్గర్నుండి తెచ్చుకోవాలి' అంటుంది.

అలా ఆయన్ని నేను ఎందుకు అడుక్కోవాలో, అక్కర్లేకపోయినా మా అక్కలకు ఎందుకు దానం చేయాలో నాకు అర్థంకాదు.

రజనికి మా అమ్మలో ఒక్క మంచి లక్షణం కన్పించదు. ఆవిడ కీలుగుర్రం సినిమాలోని చిన్న రాక్షసని దాని అభిప్రాయం.

అమ్మ ఉద్దేశ్యంలో రజని నన్ను వాజమ్మని చేసి ఎప్పుడో చెంగున కట్టేసుకుంది.

పిల్లల్లో పెద్దవాడు మా అమ్మా వాళ్ళ పార్టీ. రెండోవాడు రజని గూఢచారి.

ఇట్లాంటి కొంపను చూస్తుంటే నీకు ముచ్చటేస్తుందంటే తప్పక నీది మెంటల్‌కేసే"

"అదికాదురా. ఇవన్నీ ప్రత్యక్షయుద్ధాలు. హిపోక్రసీ లేదు. నీకు సమస్య తెలుసు. మా ఇంటి పద్ధతి అలాకాదు. అమ్మ మైథిలి దగ్గరకు వెళ్ళలేదు. మా ఇంట్లోనుండి వెళ్ళిపోయింది. తప్పు ఎవరిదో నాకు తెలియటంలేదు. అమ్మ లేకపోతే నేను బ్రతకలేను అని బరువైన డైలాగులు చెప్పను. అమ్మ చెల్లాయి వాళ్ళింట్లో వుందీ అంటే నాకు అవమానంగానూ, సిగ్గుగానూ వుంది. చెట్టంత కొడుకునై వుండీ అదీ ఒక్కడినై వుండి అమ్మను ఆడపిల్ల ఇంటికి తరిమేశానంటే ప్రపంచం ముఖాన్న వుమ్ముతుందిరా. అమ్మది తప్పో, లలితది తప్పో, నాదే తప్పో తెలియటం లేదురా. మీ అమ్మలాగా, రజనిలాగా తన్నుకుని అయినా నరే వాళ్లిద్దరూ కల్సివుండటంరా నాకు కావల్సింది"

"ఇదేం పిచ్చిరా నీకు?" అని వాడు పెద్దపెట్టున ఆశ్చర్యపోయాడు.

ఇంతలో రజని వచ్చి "పేషంట్లు చాలా మంది వచ్చారట. కాంపౌండరు ఫోన్ చేశాడు" అని చెప్పింది.

"చూసేవా దేశంలో పిచ్చివాళ్ళ సంఖ్య ఎలా పెరిగిపోతోందో. చివరకు నేను కూడా బిజీ అయిపోతున్నాను" అంటూ వాడు లేచి వెళ్ళిపోయాడు.



నేనూ లేచి వచ్చేస్తోంటే క్రిందకు రాగానే వర్ధన్ తండ్రి పట్టుకున్నాడు నన్ను.

"ఏమి కృష్ణారావూ! నాకు కన్పించకుండానే వెళ్ళిపోతున్నావూ?" అంటూ దీర్ఘాలు తీశాడు.

ఆయనకు నా పేరులో రావులేదని చెప్పీ చెప్పీ విసిగిపోయాను నేను.

"పనుందండీ" అని సణిగాను.

"పనేం పనోయ్. మీ కుర్రకారుకి ముసలివాళ్ళతో మాట్లాడటమే గిట్టకుండాపోతోంది. మీరు మాత్రం రేపు ముసలివాళ్ళు కారూ?" అన్నాడు. నేను మనసులోనే ఆయనకు దొరికిపోయినందుకు నన్ను నేను శపించుకుంటూ ఆయన ముందు కూర్చున్నాను.

"మీ చెల్లాయి పుట్టింటికి వస్తే నువ్వు వట్టి చేతులతోనే పంపుతావటోయ్?"

నేను లా చదువుకున్నాను. ముసలాయన లీడింగ్ క్వశ్చన్‌కి అంత సులువుగా సమాధానం చెప్పదలుచుకోలేదు.

"వచ్చిన ప్రతిసారీ ఏం పెట్టగలం చెప్పండి?" అని ఎదురు ప్రశ్నించాను.

"ఎంత కాదన్నా మా వాడికి స్నేహితుడివి కాదూ! అందుకే అట్టా మాట్లాడుతున్నావు. పోయినసారి మీ చెల్లెలు వచ్చినపుడు పట్టుచీరె పెట్టావు కాదూ?"

"అమ్మ దుర్మార్గుడా! తెలిస్తే మరెందుకు అడిగావు?" అనుకున్నా.

వర్ధన్‌ని బాగా తిట్టాడు ఆయన. తోబుట్టువుల మీద ప్రేమ లేదన్నాడు. బావగార్ల పొడగిట్టదన్నాడు. రజని గీచిన గీత దాటడట.

తన కొడుకు సంపాదనంతా కోడలు పుట్టింటికి తరలించేస్తోందనే గట్టి అనుమానాన్ని వెలిబుచ్చాడు.

ఆయన వుద్దేశ్యం ఈ మాటలన్నీ నేను వర్ధన్‌కి చెప్పాలనే.

కొడుకు ఎదుటపడి ఆయన అనలేని అవాచ్యమైన మాటలన్నీ నా ఎదుట అని తన నోటి దురద తీర్చుకున్నాడు.

ఇంటికి వచ్చేక గుర్తుకొచ్చింది. వర్ధన్ నా కలను విశ్లేషించనేలేదని.

★ ★ ★

అమ్మ వెళ్ళిపోయేక లలిత తెల్లవారు ఝామున ఐదు గంటలకే లేచి పని చేసుకోవలసి వచ్చింది. ఇడ్లీ, వడ, దోసె, పెసరట్ వంటి ఫలహారాలు నాకు హొటల్లో తప్ప యింట్లో కనపడటం మానేశాయి. ఫిల్టర్ కాఫీ రజని యిస్తే తప్ప దొరికే భాగ్యమే లేదు. మునుపు మా యిల్లు అద్దంలా శుభ్రంగా వుండేది. ఇపుడు అశుభ్రంగా వుందని కాదు కానీ ఒక క్రమంలో వుండటంలేదు. అమ్మ అరటి పండు వలిచి చేతితో పట్టుకుందని భయంకరమయిన హత్యను చూసినట్టుగావుకేకలు పెట్టిన లలిత రాములు పాపాయిని పూర్తిగా ఒళ్ళు తుడవకుండా బట్టలు వేసేసినా చూసీ చూడనట్టు వూరుకోవటం నేర్చుకుంది.

అమ్మ వున్నపుడు ఆదివారం వస్తే నేనూ, లలితా స్నేహితుల యింటికో, నది ఒడ్డుకో, సినిమాకో, రెస్టారెంట్‌కో వెళ్ళే వాళ్ళం.

యిపుడు లలిత ఆదివారాలన్నీ బూజులు దులుపుకోవడంలోనూ, వారమంతా పెండింగ్‌లో వున్న చిన్నచిన్న పనులు పూర్తి చేసుకోవటంలోనూ, బట్టలకు అవసరమయిన చిన్నచిన్న రిపేర్లతో, శనివారం నాడు తెచ్చుకున్న సరుకులు సర్దుకోవడంతో గడిచిపోతున్నాయి. చివరకు ఫ్రిజ్‌లో మంచినీళ్ళ సీసాలు కూడా నిండివుండటం లేదు.

"ఇదే కూతురయితే మీ అమ్మగారు అర్ధాంతరంగా యిలా వదిలేసి వెళ్ళి పోయేవారా? కోడలు కాబట్టి వెళ్ళిపోయారు" అంది లలిత.

★ ★ ★

అమ్మ వెళ్ళిపోయినందువల్ల లలిత సుఖంగా, ప్రశాంతంగా వుందని నేను అనుకోవటం లేదు.

పని వత్తిడి, భర్త మనసు చిన్నబుచ్చుకుందని తెలియటం, తన తప్పు ఒప్పు కోలేకపోవటంలోని అశాంతితో ఆమెకు కూడా రెస్ట్‌లెస్‌గానే వుంది.

ఒకవిధంగా చూస్తే లలిత వాదన లలితకు సమంజసంగా వుండి వుండవచ్చు. పాశ్చాత్య దేశాల గురించి నాకు సరియైన అవగాహన





లేదు కానీ, పవిత్ర భారతంలో మాత్రం స్త్రీని చాలా వెనుకకు నెట్టి వేస్తున్నాం.

నేను వుద్యోగం చేయటం పురుష లక్షణం. లలితకు వుద్యోగం ఒక సరదా! హెూదా!

నా జీతం యింటికి అవసరం! లలితకు జీతం లగ్జరి.

నేను జీతం ఇంట్లో ఇవ్వకపోతే చెవులు మెలేసి తీసుకుంటారు. లలిత జీతం తీసుకోవటం నామోషీ!

నాకు వుద్యోగం వస్తే సంతోషం. లలితకు వుద్యోగం వస్తే ఉదాసీనం.

నేను వుద్యోగం మానితే వెర్రివాడినవుతాను. సమస్యలు వస్తాయి. లలిత వుద్యోగం మానితే బయటకు అనే ధైర్యం లేదు కానీ నాకు సంతోషం. చాలా సమస్యలు తీరుతాయి.

భారతీయ సంఘం పురుషుడిది. అతను కెరీర్ మీద దృష్టిని కేంద్రీకరించి పైపైకి వెళ్ళగలడు.

స్త్రీకి అలా కుదరదు, నేను ఆఫీసు వదిలాక కూడా గంటల తరబడి ఆఫీసులో వుండిపోతాను.

నాపై అధికారులు నన్ను మెచ్చుకుంటారు. ప్రమోషన్లు యిస్తారు.

యింట్లో ఎవరూ నన్ను తప్పుపట్టరు. అలిసిపోయేవా? అని సేద తీరుస్తారు.

లలిత బ్యాంకునుండి ఏనాడూ ఆలస్యంగా రాదు.

ఆఫీసులో వున్నప్పటికీ లలిత మనసు పాపాయి చుట్టూ తిరుగుతూ వుంటుంది. వాళ్ళ మేనేజరు ముందుగా వెళ్ళిపోతే యింటికి అరగంట ముందు రావటానికి ప్రయత్నిస్తుంది తప్ప ఆలస్యంగారాదు.

నాకు ఆధునిక స్త్రీ పట్ల సానుభూతి వుంది. కానీ నా సానుభూతి లలితకు ఏ విధమయిన సహాయమూ చేయలేదు.

లలితను ఉద్యోగం మానమని అనటానికి నా సంస్కారం అడ్డువస్తుంది. లలిత ఉద్యోగంతో అమ్మ కష్టపడితే నా మనసు బాధపడుతుంది.

లలితదీ తప్పుకాదు. అమ్మదీ తప్పుకాదు. మరి తప్పు ఎక్కడున్నది! ఈ సమస్యకు పరిష్కారం ఏమిటి?

అటెండరు పోస్టు తెచ్చి బల్ల మీద పెట్టాడు. అందులో మైథిలి వుత్తరంవుంది. అమ్మ వూరు చేరగానే క్షేమంగా చేరినట్టు బావగారు ఫోను చేసి చెప్పారు. మళ్ళీ ఏ కబురూ లేదు నెల రోజులకు యిదే మొదటి వుత్తరం.

"అమ్మ బాగానే వుంది. కానీ పరధ్యానంగా వుంటున్నది. బహుశా నీ మీదా, పాపాయి మీదా గాలి మళ్ళిందేమో తెలీదు. అమ్మకి మా యింట్లో వుండటం మొహమాటంగా కూడా వున్నట్టున్నది. నీ దగ్గర తనకేదో హక్కు అన్నట్టు ప్రవర్తించేది. ఇక్కడ మా దయాదాక్షిణ్యాల మీద బ్రతుకుతున్నట్టు ఒదిగి వుంటుంది. వదిన వుద్యోగం గురించి చెప్పింది. ఆమధ్య నేను వచ్చినపుడు రజని క్రష్ పెట్టాలనే వుద్దేశం వున్నట్టు చెప్పింది. కనుక్కోకూడదా, పాపాయి అక్కడయితే సేఫ్‌గానూ వుంటుంది. వదినకు శ్రమా వుండదు, అదీ మైథిలి వుత్తరంలోని సారాంశం.

తల్లిదండ్రులు ఎంతో ప్రేమతో పిల్లల్ని ముఖ్యంగా కొడుకుల్ని కనిపెంచుతారు. దాని నుండి వాళ్ళు ఏమీ ఆశించకపోవచ్చు.

అలా ఆశించపోవటం వాళ్ళ ఔన్నత్యం అయితే తల్లిదండ్రుల వృద్ధాప్యాన్ని ప్రశాంతంగా, సంతోషంగా గడిచేలా చూడటం కొడుకుల కనీస ధర్మం.

నేనేం కొడుకుని?

భార్యని ఎదిరించలేక, తల్లిని సమర్థించక, మౌనంగా, దీనంగా, బాధతో నా తల్లి నన్ను విడిచి వెళుతోంటే నోరైనా విప్పని వాడిని.

కానీ నాకు నా అసంతృప్తిని వ్యక్తం చేయటం చేతనవును. దానిలో భాగంగానే నేను లలిత వద్ద అమ్మ గురించి మాట్లాడటం మానేశాను.

అప్పుడప్పుడూ నాకు అకారణంగా పాపాయి మీద కూడా కోపం వస్తుండేది. యిది పుట్టాకే లలితకూ, అమ్మకు స్పర్థలొచ్చాయి అన్పించేది. కానీ, అది నిజం కాదని తెలును. పాపాయి పుట్టుక యింటికి సంతోషాన్ని తెచ్చింది. మామధ్య బంధాన్ని కొంతవరకూ





గాఢతరం చేసింది. లలిత వుద్యోగమే యింట్లో కల్లోలాన్ని సృష్టించింది.

★ ★ ★

సాయంత్రాలు యింటికి వెళ్ళడం నాకు యిష్టం వుండటంలేదు.

ఉదయం హడావుడిలో అమ్మలేని లోటు తెలుస్తుంది కానీ కొట్టొచ్చినట్టు వుండదు. కానీ సాయంత్రాలు యిల్లు బోసిగా వుంటుంది.

నీరసంగా అలిసిపోయి సాయంత్రపు వంట చేస్తుండే లలితను చూస్తే జాలిగా వుంటుంది. మనసు కలత బారుతుంది.

నాన్నగారూ, అమ్మా వుండి, నేనూ మైథిలీ మళ్ళీ చిన్నపిల్లలమయితేఎంత బాగుండును అన్పించేది.

వర్తమానం బాగోని వాడే గతంలో జీవిస్తాడా? అని అనుమానం కలిగేది. ఎందుకో తెలియకుండానే గుడి దగ్గరకు వెళ్ళి కూర్చునే వాడిని. క్రింద చెట్టుక్రింద కూర్చుని అమ్మ మెట్లెక్కుతున్నట్టు వూహించుకునేవాడిని. ఆరోజు అమ్మ ఏడవటం గుర్తుకు వచ్చి 'అమ్మా! అమ్మా' అని నా మనసు కొట్టుకుపోయేది.

అమ్మ వెళ్ళిన నెల రోజులలోనూ కనీసం పదిసార్లయినా నాకు ఆ కల వచ్చివుంటుంది. ఆ కలలోని స్త్రీ దేవాలయంలోని భక్తులు తన కోసం ఎదురు చూస్తుంటారని కొలువయ్యేందుకు వెళ్తున్న దేవతలా తోచేది నా కంటికి. ఇవాళ ఏమయినా నా కలని వర్ధన్‌తో ఎనలైజ్ చేయించాలని నిర్ణయించుకుని బయలుదేరాను.

"ఒరేయ్ వర్ధన్! ఈ కలకు అర్థమేమిట్రా"

"కలలకి అర్థాలేమిట్రా... బుద్ధి లేకపోతే సరి" అన్నాడు వాడు.

"తంతాను వెధవా! సైకియాట్రిస్టువి అయి వుండీ అలా మాట్లాడతావేం? సిగ్గులేదూ?"

"మరి ఫీజు యివ్వని వెధవలందరికీ కలలు విశ్లేషించి చెప్పమంటావాఏం?" అన్నాడు నవ్వి.

"జోకులాపేసి చెప్పరా ఏంటి ఈ కలకు అర్థం?"

"మొహమాటంగా వుందిరా. కొన్ని ప్రశ్నల డగాలి"

"ఫర్వాలేదులే... అడుగు"

"వారంలో ఎన్ని రోజులు సెకండ్ షో వుంటుందిరా?"

"అంటే ఏమిట్రా?" నాకు నిజంగానే అర్థం కాలేదు. వాడు బుర్ర గోక్కుని పైకి చూసి "నువ్వూ, నీ భార్యా ఎన్నిసార్లు ప్రేమించుకుంటార్రా" అనడిగాడు.

"ఎంత గాఢంగా ప్రేమించుకుంటారు అంటే అర్థం వుందిగానీ... ఎన్నిసార్లు... ఓ! అర్థమయిందిలే... మేకింగ్ లవ్ అనా నీ వుద్దేశ్యం?"

"అబ్బ! ఏమయినా యిటువంటివి యింగ్లీషులో ఏడవటం చాలా హాయిరా. ఇంగ్లీషురాకపోతే మనం ఏమయివుండేవాళ్ళమో" అని కాసేపు ఆశ్చర్యపోయాడు.

వాడి ప్రశ్నకు నేను ఖచ్చితమయిన సమాధానం చెప్పలేకపోయాను.

"భోజనంలా 'లవ్ మేకింగ్'కి ఏమయినా కోటావుంటుందేమిట్రా వర్ధన్"

"ఉంటుందిరా... ఇట్‌పోస్ యువర్ ఇంటరెస్ట్ టువర్డ్సు ఈచ్ అదర్. మరీ పశుప్రాయులైతే చెప్పలేంకానీ మనలాంటి వాళ్ళల్లో ప్రేమకూ వాంఛకూ సంబంధం వుంటుంది. మొదటిది కానిదే రెండోది కొంచెం కష్టం. అపుడపుడూ జరుగుతుంటుందనుకో. కానీ ప్రేమ లేని వాంఛను పెద్ద ఎంజాయ్ చెయ్యలేం"

"అయితే అమ్మ వెళ్ళేక లలితకు నా మీద ఆసక్తి తగ్గిన మాట నిజమే! మునుపు తప్పు చేసిన దానిలా, నాకు సంజాయిషీలా నా పక్కన చేరేది. యిప్పుడు ఎప్పుడు దగ్గరకు తీసుకోబోయినా ప్లీజ్! యివాళ తలనెప్పి, యివాళ పాపకు ఒళ్ళు వెచ్చబడింది. యివాళ ఆఫీసులో పని ఎక్కువగా వుంది అంటుంది.

"అదన్న మాట కథ! నీ కల దీనికి సంబంధించిందే. ఆ కలలోని స్త్రీ లలితన్న మాట. ఆ కుర్రవాడు నువ్వు" అన్నాడు వర్ధన్ చాలా తేలిగ్గా.

"ఎవడూ? ఆ చీమిడి ముక్కువాడు"

"ఆఁ! అక్షరాలా వాడే. నువ్వు లలితను

ప్రేమభిక్ష అర్థిస్తున్నావన్న మాట'' నేను నవ్వీ నవ్వీ అలసిపోయేను.

''ఒరేయ్ ఫ్రాయిడ్ తర్వాత సైకో ఎనాలిసిస్ చాలా అభివృద్ధి చెందిందని విన్నాను. నువ్వు చూడబోతే అక్కడే ఆగిపోయినట్టున్నావు'' వాడు కొంచెం అలిగాడు.

''రజనీ! వీడిక్కాస్త కాఫీపొయ్యి పోతాడు వెధవ. ఖాళీ ఎక్కువై కలలు కనడం, నేను తేరగా ఒకణ్ణి వున్నానని డబ్బులివ్వకుండా ప్రశ్నలడగటం. నీలాంటి పీనాసి వెధవలకు కావలసింది నేను కాదురా. చెట్టు క్రింద పట్టెనామాల్తో, చిరిగిన గుడ్డ పరుచుక్కూచుంటాడు చూడు. అదే మన తాలూకాఫీసు ఎదురుగా, 'ఇచ్చట కలలకు ఫలితాలు చెప్పబడును' అని బోర్డుతో వుంటాడు వాడు. వాడయితే నీకు నూటవుతాడు. ఫో! వెధవా? ఈ టైములో నేను రెండు కేసులు చూసుకునేవాణ్ణి'' అంటూ లేచిచక్కా పోయాడు.

కాఫీ రజని తేలేదు. వర్ధన్ తల్లి పట్టుకొచ్చారు.

''మీ ఆవిణ్ణి చూసి మా కోడలికి కూడా సంపాదన పిచ్చి పట్టుకుందోయ్. బేబీ కేర్ సెంటర్ పెడుతుందట. లోను కోసం వెళ్ళింది'' అంటూ కాఫీ తాను తేవడం వెనుక కథ వివరించింది.

''అవునూ! మీ అమ్మ వూళ్ళో లేదటగా. చెల్లాయి దగ్గరకు వెళ్ళిందా?'' అని అడిగింది. ఆవిడకు అసలు సంగతి తెలుసు. అయినా అదో సరదా. అలా అడగటం నాకు మంటగా వుంది.

''అవునండీ! మా ఆవిడా, మా అమ్మా పోట్లాడుకున్నారు. మా అమ్మ వూరెళ్ళిపోయింది'' అని చెప్పాను. ఆవిడ నోరు తెరుచుకుని చూస్తూనే వుంది. నేను వచ్చేశాను.

''నవమి, విజయ దశమి రెండు రోజులు బ్యాంక్‌కి శలవు. నేను యింకొక రోజు శలవు పెడుతున్నాను. కొంచెం విశ్రాంతి కావాలి నాకు'' అంది లలిత. అది నిజమే కూడా. ఈ వుద్యోగంతో లలిత కూడా ఏమంత సుఖంగా లేదు. దగ్గరకు తీసుకుని చెక్కిళ్ళు నిమిరాను.

''చిక్కి పోతున్నావు లలితా!''

లలిత వెంటనే అంగీకరించింది.

''అవును... అత్తయ్య కూడా లేరు కదా! తిను తిను అని బతిమాలే వాళ్ళు లేరు. పాపాయి నన్ను లిటరల్‌గా పీక్కు తింటున్నది''

నేను నమ్మశక్యం కానట్టు లలిత కళ్ళల్లోకి చూశాను.

''ఎందుకలా చూస్తారు? అత్తయ్యను పొగిడాననా? మీ తల్లీ కొడుకులిద్దరూ ఏకమై నన్ను వేరు చేస్తున్నారు. ఆమె అంటే నాకు మీలాగ విపరీతమయిన ప్రేమ లేకపోవచ్చు. నా భర్త తల్లిగా, నా బిడ్డకు నాయనమ్మగా అభిమానం వుంది కృష్ణా! కోడలికి అత్తగారంటే అభిమానం అంటే మీ అందరికీ నమ్మకం కలగదు కదా! కానీ, నాకు అత్తయ్యమీద చాలా గౌరవం వుంది. ఏం చేసి నమ్మించాలో నాకు తెలీదు. బహుశా, ఉద్యోగం మానేస్తే నమ్ముతారనుకుంటా'' అంది.

''ఛ! లలితా!''

అంతకుమించి ఏం మాట్లాడాలో నాకు తెలీదు. లలిత స్త్రీ అయినప్పటికీ గుర్తింపు కోరుకుంటుంది. తల్లిగా... భార్యగానే కాదు. ఉద్యోగినిగా కూడా. మగవాడు సంఘంలో తన పనిలో ఎలా గుర్తింపు కోరుకుంటాడో స్త్రీ కూడా అలానే కోరుకుంటుంది. స్త్రీ దురదృష్టం ఏమిటంటే ఆమెను యితరులు హర్షించరు. పురుషుడిని హర్షిస్తారు. అదీ తేడా!

నాకు యిలా వివరించి చెప్పటం చేతకాలేదు. కానీ, లలితను దగ్గరకు తీసుకుని నుదురు చుంబించి...

''నువ్వు వుద్యోగం మానొద్దు లలితా! మానితే అయ్ ఫీల్ గిల్టీ'' అన్నాను.

''నిజంగా!'' అంది ఆశ్చర్యంతో.

''అవును లలితా! నువ్వు వుద్యోగం చేయటంపట్ల నాకు ఎటువంటి అభ్యంతరమూ లేదు. కానీ అమ్మ... వద్దులే... యిప్పుడా ప్రసక్తి వద్దు. మనిద్దరం ఒక యింట్లో అపరిచితుల్లాగ వుంటున్నాం గత కొద్ది నెలలుగా. యిప్పుడు మళ్ళీ ఆ వాదనలెందుకు?''

''మాట్లాడు కృష్ణా! మనుషులు మాట్లాడకనే దూరం అయిపోతున్నారు ఒకరికొకరు. జనరే




## సచిత్ర విచిత్రం



# రమణీమణి - రాక్షసి పీతలు

భీకరంగా కన్పిస్తున్న 'రాక్షసి పీతల్ని' పట్టుకొని కూడా ముఖంపై చిరునవ్వును చెక్కుచెదరనీయలేదంటే ఈమెగారి గుండె ధైర్యం ఏ పాటిదో మీకు అర్థమయ్యే ఉంటుంది. జూలీ వైట్ ఫీల్డ్ అనే ఈ వనితా శిరోమణి టాస్మానియాలో క్రేఫిష్ ఫారమ్‌ను నిర్వహిస్తోంది. తమ ఫారమ్‌లో లభించిన ఈ అపురూప భారీ పీతల్ని ప్రజల సందర్శనకోసం సిడ్నీ జూపార్క్‌కు తరలించే ప్రయత్నంలో ఉందీమె.

“నీటిలోంచి తీసి బయటపడేస్తే ఇవి అరగంటకన్నా బతకవ్. అందుకే వీటి రవాణాలో అత్యంత జాగరూకత వహిస్తున్నాను. కనీసం వీటిలో ఒక్కటన్నా గమ్యానికి ప్రాణాలతో చేరాలన్నదే నా పట్టుదల'' అంటోంది జూలి. ఈమె వాలకం చూస్తుంటే రెంటినీ సజీవంగా సిడ్నీ జూపార్క్‌కి చేర్చేలా ఉంది గదూ?

“బంగారంలాంటి పీతలు దొరికితే హాయిగా లొట్టలు వేసుకొంటూ కూర వండుకు తినక ఈమెగారికిదేం పిచ్చి?'' అని చెవులు కొరుక్కుంటున్నారు ఇరుగుపొరుగు వాళ్ళు.

షన్ గ్యాప్ అనుకుంటాం కానీ మన అసలు సమస్య కమ్యూనికేషన్ గ్యాప్''

''లలితా! అమ్మ కష్టపడితే నేను చూడలేను అది నా బలహీనత. అందరికీ వాళ్ళ అమ్మ ఎలా అన్పిస్తుందో, కన్పిస్తుందో నాకు తెలియదు. నాకు మా అమ్మ చాలా అపురూపమయిన వ్యక్తిలా అన్పిస్తుంది.

చిన్నప్పుడు అమ్మ ఎప్పుడూ ఒక సామెత చెప్పేది 'మొగుడు భార్యని ముండా అంటే ముష్టికి వచ్చినవాడు కూడా ముండా' అంటాడట. భర్త గౌరవించని స్త్రీని ఎవరూ గౌరవించరు.

అమ్మ అదృష్టం అనుకుంటా నాన్నగారి వంటి వ్యక్తి భర్తగా దొరికారు.

అమ్మ పెద్ద చదువుకోలేదు. ఆవిడకు తెలిసిన విద్య ఏమయినా వున్నదా అంటే అది ఎదుటి మనిషిని ప్రేమించటం''

నేను ఒక క్షణం ఆగాను.

''మా అమ్మ గురించి డబ్బా కొడుతున్నాననుకుంటున్నావా లలితా?''

లలిత నా గుండెల మీద పడుకుని వెంట్రుకలతో ఆడుకుంటున్నది. ఈ మాత్రపు సాన్నిహిత్యం కరువై యుగాలయినట్టుగా వుంది నాకు.

''లేదు కృష్ణా! అత్తయ్య మీద నాకు కూడా చాలా మంచి అభిప్రాయం వుంది. నా దురదృష్టం ఏమంటే మీరది నాలో గుర్తించలేకుండా వున్నారు''

''ఈ ప్రేమించటంలో అమ్మ నాన్నను చిత్తు చేసింది. ఆయన్ని మానసికంగా జయించేసింది. మన పెళ్ళికి ముందు ఒకసారి నాన్నగారు చెప్పారు నాకు. ఆయన వాళ్ళ మరదల్ని చేసుకుందామనుకున్నారట. కానీ వాళ్ళ కుటుంబానికి డబ్బు చాలా అవసరంగావుంది. కట్నం ఎక్కువిస్తారని ఆశపడి అమ్మని చేసుకున్నారట తాతగారి కుటుంబం. నాన్న కూడా రహస్యాన్ని అమ్మకు తెలియకుండా చాలా సంవత్సరాలు దాచారు.

సరే... ఆ మరదలికి కూడా వేరే పెళ్ళయిపోయిందనుకో. కానీ ఆవిడ ఎప్పుడో అమ్మని కలిసినపుడు యీ విషయం చెప్పి 'యిప్పుడిలా నవ్వుతూ చెప్పాను కానీ అక్కా, ఎన్ని రాత్రులు నిద్రమాని ఏడ్చానో' అందట.

ఇప్పుడు ఆవిడ బాగానేవుంది. కానీ అప్పటి ఆవిడ పరిస్థితిని తలుచుకుని మీ అమ్మ ఎంత దుఃఖించిందో చెప్పలేను అన్నారు నాన్నగారు.

అమ్మ తాతగారు వాళ్ళని తప్పుపట్టలేదు. నాన్నను తప్పుపట్టలేదు. తన తోటిస్త్రీ బాధను తల్చుకుని తను బాధపడింది.

ఎంతమందికి వుంటుంది చెప్పు అటువంటి ప్రేమ పూరితమయిన మనసు.

ఆవిడ ఆయుధం అదే ప్రేమ!

ఆ తర్వాత నాన్నగారు ఆమెకు దాసానుదాసులయ్యారు.

నా వుద్దేశ్యంలో మా నాన్నగారు మేధావి. విపరీతంగా చదివేవారు. ఆయన బ్రతుకు తెరువుకోసం యింత డ్రైఫీల్డ్ ఇన్‌కంటాక్సులో పని చేశారుకానీ ఎంత సున్నితమయిన భావాలో!

అయినా ఆ దంపతులిద్దరికీ ఎంత స్నేహమనీ! నాన్నగారికి అమ్మంటే ఎంత గౌరవమో!

అమ్మ బుర్రతో ఆలోచించదురా! మనసుతో ఆలోచిస్తుంది అనేవారు. అందుకే ఆమె మాకు కూడా ఎంతో అపురూప వ్యక్తి అయింది.

అమ్మని నేను కదిలే నదిలా హుషారుగా, గుళ్ళోదేవతలా ప్రశాంతంగా, విరగబూసిన మల్లె పొదలా నిండుగా ఎరుగుదును.

ఆవిడ మాటకు తిరుగులేకపోవటమే నాకు తెలుసు. మైథిలి చదువు బియ్యేతో ఆపాలన్నది అమ్మ నిర్ణయమే.

బావగారి సంబంధమే దానికి నిశ్చయించాలన్నది ఆమె నిర్ణయమే. నిన్ను నేను చేసుకోవటం కూడా అమ్మ నిర్ణయమే''

''మీ అమ్మగారు నన్ను చేసుకోవద్దు అంటే చేసుకునేవారుకాదు కదూ!''

''అందులో సందేహమేముంది లలితా! పొరపాటున కూడా చేసుకునేవాడిని కాదు. డూ యూ ఫీల్ బ్యాడ్ ఎబౌట్ ఇట్ లలితా?''

''లేదు కృష్ణా! మీ అమ్మగారు అదృష్టవంతులు''





నేను నవ్వాను.

"ఈసారి నేను దెప్పుతూ అనటంలేదు కృష్ణా! నిజంగానే అంటున్నాను"

"నేను కానీ, మైథిలి కానీ మా జీవిత భాగస్వాములను మేము ఎన్నుకుంటే అమ్మ కాదనేది కాదు లలితా! అలా జరగలేదు. అది వేరే సంగతి. నా విషయంలో నువ్వు నన్ను ఆకర్షించావు. అమ్మాయి బాగుంది అనుకున్నాను. అమ్మ పెంపకంలో ఆడపిల్లల్తో సరదా చెయ్యాలనే ఆలోచనలెప్పుడూ రాలేదు నాకు. పెళ్ళి గురించి నేను ఆలోచించలేదు. ఆర్థిక స్వాతంత్ర్యం లేదు కాబట్టి నాకాహక్కు లేదనుకున్నాను. అమ్మ నీ గురించి చెప్పినప్పుడు ఠక్కున గుర్తుకొచ్చావు నువ్వు.

"గుర్తున్నదమ్మా! సన్నగా, తెల్లగా బాగుంది" అని చెప్పాను.

"నీకు నచ్చిందా?" అనడిగింది.

"నేనా దృష్టితో చూడలేదు. నీకు నచ్చితే నాకు నచ్చినట్టే" అన్నాను.

"అబ్బ! ఏం ట్రైనింగురా మీ అమ్మది?" అన్నారు నాన్నగారు. మన పెళ్ళి అయిపోయింది.

అలాగని మేము అమ్మని ఎదిరించలేదని కాదు. అందరి పిల్లల్లాగే ఎదిరించాము. విసిగించాము. అల్లరి చేశాము. అవన్నీ నాన్నగారు వున్నప్పుడు.

నాన్నగారు పోయేక నాకు అమ్మ అసహాయురాలిలాగ తోచింది, దైన్యంగా ఒంటరిగా.

మైథిలి పెళ్లిచేసుకుని వెళ్ళిపోయింది. అమ్మకు ఈ ప్రపంచంలో ఎవరూ లేరు. ఈ భావన అమ్మకు నన్ను మరింత దగ్గరచేసింది" లలితనుండి ఎటువంటి ప్రతిస్పందనా రాలేదు. తల వంచి చూశాను.

నా గుండెలమీదనే నిద్రపోతున్నది.

నేనూ లైటార్పి నిద్రకుపక్రమించాను.

★ ★ ★

వనుపుపచ్చని చీరెతో, చేతిలో పూసజ్జతో ఆమె మెట్లు ఎక్కుతున్నది. కుర్రవాడు జారుతున్నలాగు ఎగరేసుకుంటూ ఆమె వెంటపడుతున్నాడు. మెట్టు తగిలింది. ముందుకు తూలాడు. మామూలే. నాకు మెలకువ వచ్చేసింది. మళ్ళీ అదే కల. పదేపదే ఒకే కల. ఈ కల వచ్చినపుడు మునుపు ఒక అవ్యక్తానందం కలిగేది. యిపుడు గుండె బరువెక్కుతుంది?

ఎందుకిలా నాకు తరచూ ఒకే కల వస్తోంది?

దీనికి నాకు ఎవరు సమాధానం చెపుతారు?

అమ్మ లేని యిల్లు అసంపూర్తి చిత్రంలా తోస్తోంది.

భగవద్గీతలో కృష్ణుడు అర్జునుడికి బోధించినట్టు నాకు ఏ దేవతామూర్తో ప్రత్యక్షమై 'కృష్ణా! నీ కర్తవ్యం యిదీ' అని చెప్పకూడదా?

నేనెవరిని? కృష్ణని.

ఒక పెద్ద కంపెనీలో లా ఆఫీసర్ని.

మేనేజిమెంటుకి, లేబర్‌కీ కూడా ప్రీతిపాత్రుడిని.

యిద్దరితోనూ మంచి సంబంధాలు కలిగి వుండగల సమర్థుడైన ఆఫీసర్‌ని.

మరి అమ్మ విషయంలోనూ, లలిత విషయంలోనూ యిలా ఫెయిలయ్యానేమిటి?

తల్లితోనూ, భార్యతోనూ కూడా అంటీముట్టనట్టు వుంటే ఈ సమస్య పరిష్కారమవుతుందా?

వర్ధన్ గుర్తుకు వచ్చాడు. వాడు నా ప్రియాతి ప్రియమయిన స్నేహితుడు.

అమ్మ దగ్గరా, లలిత దగ్గరా నేను కొన్ని విషయాలు దాచి వుండచ్చునేమోగానీ వాడి దగ్గర నేను ఏదీ ఏనాడూ దాచలేదు.

నా మనసుకు వర్ధన్ ప్రతిబింబం.

మా వృత్తులు వేరు.

వ్యావృత్తులు వేరు.

అభిరుచులు వేరు.

ఆశయాలు వేరు.

అయినా మాస్నేహానికి యివేవీ ప్రతిబంధకం కాలేదు.

మా స్నేహం మమ్మల్ని దాటి మా కుటుంబాలకి కూడా వ్యాపించింది.

వాళ్ళింట్లోకానీ మా యింట్లోకానీ శుభకార్యాలుకానీ, అశుభకార్యాలు గానీ జరిగితే ఒకరికొకరు ఆహ్వానాలు పంపుకోము. వుయ్ టేక్ పార్ట్

ఇన్ ఇట్. మా చేతుల మీదుగా జరుగుతుంది మంచయినా చెడయినా

వాడూ, నేను ఎన్నోసార్లు కొట్టుకున్నాం. తిట్టుకున్నాం. అభిప్రాయ భేదాలతో మాట్లాడు కోవటం మానేశాం.

అయినా మళ్ళీ ఒకటయ్యాం అదంతా మామూలే అయినట్టు.

రజని వాడిని బాగా విసిగిస్తుంది. లలితలా తెలివైనది కాదు. అందువల్ల యింత సున్ని తంగా అత్తగారిని వెళ్ళగొట్టడం(?) రజనికి రాదు. అసలు ఆ ఆలోచన వున్నట్టు కూడా తోచదు. ప్రతి చిన్న విషయమూ వర్ధన్ వరకూ తెస్తుంది. పడక గదిలో వాడి బుర్ర తినేస్తుంది. వాడికి రజని సణుగుడు అలవాటయిపో యింది. వాడు బెడ్‌రూంలోకి రావటమే యిలాంటి నానె్సెన్స్ అంతా వినటానికి సిద్ధప డివస్తాడు.

విన్నాక, యాంత్రికంగా రజినిని దగ్గరకు తీసుకుంటాడు.



ఆమెతో ఏకీభవించడు.

విభేదించడు.

'అదేమిట్రా' అంటే ఎందుకురా? ఎనర్జీ వేస్టు. యిదంతా సమిష్టి కుటుంబాల్లో మామూలే అంటాడు.

నిజమయిన కర్మయోగి అంటే వాడే.

మైథిలికి నేనంటే చాలా ప్రేమ. మా యింట్లో అందరిలానే దానికి పరోక్షమయిన వాగ్బాణాలు, సాధింపులు తెలీవు. 'అన్నయ్యా ఓ పట్టు చీరె కొనివ్వరా బాబూ! నవంబరులో మా అత్తగారు వస్తుంది. మీ అన్నేమి యిచ్చాడు అంటే నేనేదో హత్యచేసినట్టు తల దించుకోవాలి మళ్ళీ' అంటుంది.

బావగారు, 'మైథిలీ! నేను కొనిచ్చేవాడిని కదా! కృష్ణనెందుకు యిబ్బంది పెడతావ్' అంటే,

'చాల్లెండి. నాకసలే అబద్ధం ఆడటం రాదు. తడబడుతూ చెప్తే మీ అమ్మ ఎక్స్‌రే కళ్లతో చూస్తారు. అవన్నీ నావల్లకాదు' అంటుంది.

బావగారి మనసు చాలా మంచిది. తల్లి ఎలాగూ ఎక్కువకాలం దేశంలో వుండదు. ఆమాత్రం దానికి ఆమెతో వాగ్యుద్ధాలు ఎందుకు? అని ఆయన వుద్దేశ్యం.

లలిత వుద్యోగంవల్ల యిటువంటి పరిస్థితులు తటస్థించాయికానీ లలితకు కూడా నేనంటే ఎంతోప్రేమ. తన స్నేహితురాళ్ళ భర్తలతో పోల్చుకుని మురిసిపోతుంటుంది.

'అత్తయ్యా వాళ్ళ ఛాదస్తంకానీ అడిగితే మా నాన్నగారు, నీకు లక్షయినా కట్నం యిచ్చేవాళ్ళు. అసలీ రోజుల్లో మీలా ఎవరుంటారు? మీ కుటుంబాన్ని చూస్తే, వరకట్నం తేలేదని కాల్చెయ్యటం, తరిమివెయ్యటం యివన్నీ పేపరువాళ్ళ అభూత కల్పనలు అన్పిస్తుంది' అంటుంది.

ఆఫీసులోనూ, యింటాబయటా అంతా నన్ను ప్రేమిస్తున్నారు.

మరి నేనెందుకు సంతోషంగాలేను.

ఎందుకు మన శ్శాంతి లేదు.

మళ్ళీ యిల్లు కళకళలాడాలంటే నేనేం చెయ్యాలి?

అమ్మని తీసుకురానా? మళ్ళీ వ్యవహారం మొదటికి వస్తుంది కదా!

తీసుకురాకపోతే అమ్మ ఎన్నాళ్ళు మైథిలి దగ్గరుంటుంది? అది భావ్యంకాదు.

అమ్మని చూసి యుగాలయినట్టుగావుంది. ముందు ఈ రెండు రోజుల సెలవుల్లో వెళ్ళి అమ్మను చూసి రావాలి.

నిద్ర మెల్లమెల్లగా వచ్చి నన్ను కౌగలించుకున్నది.



ఉదయం ఆఫీసుకు వెళ్తూ లలితకు చెప్పాను.

"లలితా! నా బట్టలు సర్దివుంచు. నేను సాయంత్రం మైథిలి దగ్గరకు వెళ్తున్నాను"

"అయ్యో!" అంది లలిత. దాని అర్థం నాకు తెలియలేదు.

"యిల్లు చాలా అస్తవ్యస్తంగా వుంది కృష్ణా! కొంచెం సర్దుదామనుకుంటున్నాను: మీకూ సెలవులే కదా! సహాయం చేస్తారనుకున్నాను"

"ఎందుకు లలితా! నిన్ను నువ్వు శ్రమ పెట్టుకోవటం? సెలవు కదా! విశ్రాంతి తీసుకో. ఈ రెండురోజులూ నేను కూడా వుండను. బాగా తిని నిద్రపో!"

లలిత మాట్లాడలేదు. కానీ నేను సాయంత్రం వచ్చేసరికి నా బట్టలు సర్దిలేవు.

"నువ్వెళ్ళొద్దు కృష్ణా!" అంది లలిత.

దాని భావమేమిటో నాకు అవగతంకాలేదు.

"మీరందరూ వెళ్ళిపోతే నాకు బాగోదు. మీ యింటికొచ్చి ముందు మీ అమ్మగారిని, తర్వాత మిమ్మల్ని వెళ్ళగొట్టి నేను ఒక్కదాన్నే వుండే క్రూరురాలిలా కన్పిస్తున్నానా?"

"లేదే?"

"ఏమో! నాకలాగే అన్పిస్తోంది. అదీగాక మనం కులాసాగా కాలం గడిపి చాలా రోజులయింది. ఈ రెండురోజులు నాతో గడపకూడదా?" అంది.

నాకు ఏమనాలో అర్థంకాలేదు. నన్ను గురించి బావగారూ, మైథిలీ ఏమనుకుంటున్నారో అని తల్చుకున్నప్పుడల్లా సిగ్గుతో చితికిపోతున్నాను. సినిమాల్లో అయితే తల్లి నగలు తీసుకుని, వాటినమ్మి, ఉద్యోగం కొనుక్కుని, భార్యతో యుగళగీతాలు పాడుతూ తల్లిని ఒంటరిగా, చీకటిలో, వానలో బయటకు వెళ్ళగొట్టిన క్రూరమయిన కొడుకులాగ చిత్రీకరించి వుందురు నన్ను. లలితకూ, నాకూ మధ్య జరుగుతున్న మౌనయుద్ధం రాత్రి జరిగిన 'హార్టు హార్ట్‌టాక్'తో ఒక కొలిక్కి వచ్చిందనుకునేంతలో లలిత నన్ను వూరు వెళ్ళొద్దనటం అశుభసూచకంగా తోచింది నాకు. లలితను వ్యతిరేకించి వెళ్ళటానికి నాకు మనస్కరించలేదు. నిస్సహాయంగా నా ప్రయాణాన్ని రద్దుచేసుకున్నాను. నాతో కులాసాగా గడుపుతానన్నదేగానీ లలిత యింటిని శుభ్రపరుచుకోవడంలో బిజీ అయిపోయింది. నేను వర్ధన్ దగ్గరకుబయలుదేరాను. వాడు చాలా బిజీ అయిపోయాడు. నాతో మాట్లాడేందుకు తీరిక వుండదు. వాడిని రెండు రోజులకొకసారయినా చూడకపోతే నాకు చాలా వెలితిగా వుంటుంది. రాత్రి పదిగంటల తర్వాత వెళ్తాను ఒక్కొక్కసారి. అపుడు వాడు తీరికగా వుంటాడు. పైన డాబా మీద కూర్చుని మాట్లాడుకుంటాము. వాడు మాట్లాడుతూ మధ్యమధ్య వైన్ సిప్ చేస్తూ వుంటాడు. అలాగని తాగుబోతుకాదు. సంపాదనతోపాటు వాడికదీ అలవాటయింది. అలా మాట్లాడుతూనే ఒంటిగంటా, రెండూ అయేసరికి నిద్రపోతాడు. నేను లేచి వచ్చేస్తాను.

"ఇన్ని మంచి అలవాట్లు చేసిన మీ అమ్మగారు ఈ విషయంలో మిమ్మల్ని యిలా వదిలేశారేం?" అంటుంది లలిత.

"నువ్వంటూ వుంటావుగా. మీ అమ్మగారు ఒక్క మంచి అలవాటూ చెయ్యలేదని, అందులో యిదొకటి" అని సమాధానం చెప్తాను నేను.

ఒక్కోసారి వాడికి తీరిక వుండదని తెల్సి వెళ్తుంటాను. వాడికి పేషంటుకీ పేషంటుకీ మధ్య దొరికే టైములో మాట్లాడుకుంటాము.

ఒక్కోసారి నా ఆఫీసు అవగానే మా యింటికి రాకుండా అటు వెళుతుంటాను. వాడు సాయంత్రం నిద్రలేచే టైమది. వాడు ఆసుపత్రికి వెళ్ళటానికి తయారవుతుంటే నేను మంచం మీద పడుకుని కబుర్లు చెప్తాను.

"నువ్వు ఆడపిల్లయితే రజని బదులు నిన్ను చేసుకునేవాణ్ణిరా. సతాయింపు లేకుండా జీవితం హాయిగా వుండేది" అంటాడు.

"ఒరేయ్! సాధించటం భార్య సహజగుణం. నేను పెళ్ళాన్నయినా అదే చేసేవాడిని" అంటాను నేను.

ఇవాళ వాడింటికి వెళ్ళేటప్పటికి ఒకరిద్దరు జంటలు పిల్లల్ని స్కూటర్‌మీద తీసుకువెళ్తూ కన్పించారు. వర్ధన్ అప్పటికే ఆసుపత్రికి వచ్చేశాడు. నా ముఖం మీద ఆశ్చర్యం చూసి,

"ఏమిరా ముఖం అలాగ పెట్టావు?" అనడిగాడు.

"నువ్వు సైకియాట్రిస్టువి కదరా! పీడియాట్రిస్టులాగ యీ పిల్లలేమిటి?" అనడిగాను.

"వారినీ! అదా నీ ఆశ్చర్యం! ఆ పిల్లలు మన యిలాకా కాదురా. రజని జ్యూరిస్ డిక్షన్"

"అంటే..."

"ఒరేయ్ నాయన్నాయనా! నన్ను తినొద్దురా. పైన నాపెళ్ళాం వుంది. ఫో, పోయి దాన్ని అడుగు. నాకు తీరికలేదు" అని తరిమేశాడు. రజని నన్ను చూడగానే,

"ఉండండి... మీకు కాఫీ తీసుకువస్తాను" అని వెళ్ళిపోయింది.

పక్కవాడి విషయంలో ఆడవాళ్ళు చాలా కన్సిడరేట్. భర్తల విషయంలో చాలా కఠినంగా వుంటారే. ఎందుకనో? బహుశా అది వాళ్ళ హక్కు కాబోలు. లలిత ఫిల్టర్ కాఫీ చెయ్యదనీ నాకు చాలా యిష్టమనీ రజనికి తెలుసు. వెళ్ళి వేడి వేడి కాఫీ తీసుకువ

చ్చింది. నేను అడక్కుండా తనే చెప్పింది.

"ఇవాళే బేబీకేర్ సెంటర్ ఒకటి ప్రారంభించాము. పెద్ద హడావుడి ఏం చెయ్యలేదులెండి. మామయ్యగారు రిబ్బన్ కత్తిరించారు. మీ ఆఫీసుకు ఫోను చేస్తే మీరు యివాళా, రేపు శలవు అన్నారు. ఉద్యోగస్తులైన ఆడవాళ్ళ అసౌకర్యాన్ని దృష్టిలో వుంచుకుని మొదలుపెట్టాను. 'ఒడి' అని పేరు పెట్టాము"

"అమ్మ ఒడి అని పెట్టకపోయారా?"

"ఉహుఁ... అమ్మ ఒడికి ఏ బేబీకేర్ సెంటర్ సాటిరాదు" అంది.

"మా పాపాయిని చేర్చుకోరాదూ? మీ దగ్గరుంటే మాకు నిశ్చింత"

"అవుననుకోండి... దూరం కదా! తీసుకురాగలరా. అదింకా స్కూటర్ మీద కూర్చోలేదు కదా!"

అదీ నిజమే. వర్ధన్ నగరం నడిబొడ్డున వుంటున్నాడు. నేనుండేది వూరి చివర. నేను కాసేపు కూర్చుని వుద్యోగినుల కష్టనష్టాలు మాట్లాడి వచ్చేస్తోంటే "నమ్మకమయిన పనిమనుషులుంటే చూసిపెట్టండి" అని అడిగింది.

★ ★ ★

నేను నిద్రలేచేసరికి పరిచయమయిన ఘుమఘుమ ముక్కు పుటాలను సోకింది.

లేచి డైనింగ్ టేబిల్ దగ్గరకు వెళ్ళేటప్పటికి ఆ వానన తాలూకు పదార్థం బల్లమీద కన్పడింది.

ఫిల్టర్ కాఫీ!

హేపీ డేస్ ఆర్ హియర్ ఎగైన్! అని పాడాలన్పించింది. దొడ్లో లక్ష్మి బరబరా పెసలు రుబ్బుతున్నది.

పెసరట్లు వేస్తారా?

గిల్లి చూసుకున్నాను.

కల కాదు. నిజమే.

గబగబా అమ్మ బెడ్‌రూంలోకి వెళ్ళి చూశాను, అమ్మ వచ్చిందేమో అని.

వెతుక్కున్నాను. అనుమానం తీరక రాముల్ని అడిగాను.

"లేదు బాబూ..." అంది.

దీని భావమేమి తిరుమలేశ!

తర్వాత తెలిసింది.

లక్ష్మి పని చేసుకుని వెళ్ళిపోయింది. రాములూ, లలితా యిల్లు పరిశుభ్రం చేసేకార్యక్రమం పెట్టుకున్నారు. దాన్ని బుట్టలో పెట్టడానికి లలిత పెసరట్లు లంచం పెడుతోంది.

నాకు పాపాయిని అప్పచెప్పారు.

యిద్దరూ పడీపడీ యిల్లు సర్దారు. కానీ మరురోజు రాములు పని మానేసింది.

"దానికలవాటులేదుకదమ్మా! ఒళ్ళు నెప్పులంట, రెండురోజులు తాళి వస్తుంది" అంది లక్ష్మి.

రెండురోజులాగితే మళ్ళీ లలిత బ్యాంకుకు వెళ్ళిపోతుంది. ఈ చాకిరీ వుండదు. మంచి ఆలోచనే. అది పనిమనిషి కాబట్టి మానేసింది. నేను అమ్మ దగ్గరకు పోకుండా లలితకు దొరికిపోయాను.

యిద్దరం యిల్లు సర్దటం మొదలుపెట్టాము.

మునిసిపాలిటీ స్వీపర్‌ను పట్టుకుని, అయిదు రూపాయలిచ్చి దొడ్డంతా చిమ్మించాం.

అమ్మ వుండగా ఏం చేసేదో తెలియదు. నాకు చాలా విషయాలు తెలియవు.

పేము కుర్చీలు తెగిపోయాయి. అది నిజంగా పెద్దపని. లాగుడు బండి మాట్లాడుకు వచ్చి, వాటిని రిపేరుకిచ్చి వచ్చాను.

సాయంత్రం పాపాయి సమేతంగా బజారుకు వెళ్ళి కుర్చీల్లోకి దిళ్ళూ, కవర్లూ కొనుక్కొచ్చాము.

బెడ్ రూంలో మంచానికి ఏనాటినుండో నాలుగో కాలులేదు. రాళ్ళతో, డబ్బాలతోనూ నిలబడి వుంది. అది బాగుచేయించుకొచ్చాను.

లలిత శలవు పెట్టడంకాదుగానీ నాకు చచ్చేచావయింది. మర్నాడు ఫొటోలు, ఆల్బమ్‌లు తెచ్చియిచ్చింది.

"కృష్ణా! యివి కొంచెం ఆల్బమ్స్‌లో అతికించెయ్యండి" అంటూ.

"ఇంత శ్రద్ధగా ఆఫీసు పని చేస్తే మీ ఆడవాళ్ళు కెరీర్‌లో కూడా చాలాపైకి వచ్చేవాళ్ళు లలితా! యింటి పనిమీద వున్న శ్రద్ధ





మీకు ఆఫీసు పనిమీద వుండదు'' అన్నాను.

"ఎవరయినా ఒక పనే పూర్తిగా చెయ్యగల రండీ! రెండు పన్లు చేస్తే రెండూ అసంపూర్తి గానే వుంటాయి. అది సహజం. ఆగండాగండి, అప్పుడు యింటిపనే చేయవచ్చు కదా! అన కండి. అది శారీరక శ్రమ. బుర్రా బుద్ధీ వున్న వాళ్ళకు మానసికంగా ఏదయినా పని చెయ్యా లని వుంటుంది. క్రియేటివిటీ అన్నమాట. మేధ మనుషులందరికీ వుంది. మగ వాళ్ళ దుర్మార్గం అనండి, అదృష్టం అనండి. వాళ్ళు మేధాపరమయిన పనులు మాత్రమే చేస్తున్నా రు. మేమిలా వంట యిళ్ళల్లో మగ్గుతున్నాము. మేము ఆదర్శభార్యలంకాదు. ఆదర్శ తల్లులం కాదు. ఆదర్శ కోడళ్ళం కాదు. మా దురదృష్టం ఏమిటంటే ఆదర్శవంతమయిన ఉద్యోగినులమూ కాదు. వియ్ ఆర్ స్ట్రగ్లింగ్ యిన్ ఎవ్విరి ఫీల్డ్. మగవాడు తన శక్తి సామర్థ్యాలన్నిటినీ ఉద్యోగానికి ధారపోస్తాడు. సంతృప్తిపడతాడు. పై ఉద్యోగులు, క్రింది వుద్యోగులు, సాటి వుద్యోగులు పొగుడుతారు. హి గెట్స్ సాటిస్ఫాక్షన్ బై హావింగ్ సెక్స్ విత్ హిజ్ వైఫ్. నేను అలిసివచ్చాను. నన్ను సేదదీర్చు అంటాడు. అతన్ని 'ఒబ్లైజ్' చేసిన భార్య ఆదర్శ గృహిణి. నేనూ అలిసి వచ్చాను. నాకెవరు కాఫీ అందిస్తారు? అనే భార్య చదువు కున్నందువల్ల భర్తని లెఖ్ఖచెయ్యని ఆడది. అక్కడికి తప్పంతా ఆడదానిదే అయినట్టు''

"మీ ఆడవాళ్ళకి సెక్స్'టాబూ' లలితా! మీరు దాన్ని రిలాక్సేషన్ గానే చూడొచ్చు. కానీ ఆబ్లిగేషన్గా చూస్తున్నారుగా. మగవాడు ఎంజాయ్ చేస్తున్నాడు. నేను అతని సంతోషాని కి దోహదకారిని, ఉపయోగపడుతున్నాను అను కోవటం దేనికి, లెటజ్ హేవ్ సెక్స్ అనే భార్యలు ఎంతమంది? ఎప్పుడూ వీడు ప్రాధే యపడటమూ, ఆమె కరుణించటమేకదా'' అన్నాను.

లలిత కొంచెం కళ్ళెగరేసి నవ్వింది.

"యిదేదో కొంచెం ఆలోచించవల్సిన విష యమే సుమండీ!''

★ ★ ★

పాత ఫొటోలు చూడటం గొప్ప నాస్టాల్జిక్గా వుంటుంది.

పాత స్మృతులు బాధాకరమైనవే అయినా సామాన్యంగా మధురంగా వుంటాయి. మంచి స్మృతులైతే మరి చెప్పనే అఖ్ఖర్లేదు. మధురాతి మధురంగా వుంటాయి.

జిడ్డు కృష్ణమూర్తి కాబోలు ఒకచోట అంటా డు, 'మనిషెప్పుడూ తను సుఖంగా వున్నపుడు అబ్బ! నేనెంత సుఖంగా వున్నాను అనుకోడట. దుఃఖంగా వున్నపుడు మాత్రం నేను దురదృష్ట వంతుడిని. నాకన్నీ కష్టాలే అని ఏడుస్తాడు. కాలం గడిచేకొద్దీ దుఃఖం తరుగుతుంది. అప్పుడెన్ని బాధలు పడ్డామనీ అంటాం చాలా తేలిగ్గా.

"అబ్బ! ఆరోజులే వేరులే. ఎంత హాయిగా వుండేవో, రూపాయికి నాలుగు కోడిగుడ్లు యిచ్చేవారు. వందరూపాయలకు కాసు బంగారం వచ్చేది. తెల్లవారుఝామున చలిలో లేచి చదువుకునేవాళ్ళం'' అంటాం చాలా తేలిగ్గా.

ఆ వందరూపాయలు సంపాదించటం ఎంత కష్టమో, ఆ చలిలో లేవటానికి ఎంత గొడవ చేసామో కన్వీనియంట్గా మర్చిపోతాం! అది మానవనైజం అనుకుంటా.

లలిత ఆజ్ఞాపాలన చేసేముందు నేను అన్ని ఫొటోలూ పీకి కుప్ప పోశాను. అన్నీ తేదీలవారీగా వరుసక్రమంలో అంటించాలని తోచింది నాకు. మళ్ళీ కుటుంబపెద్ద కాబట్టి నాన్నగారి ఫొటోలు ముందు అంటించాలనుకు న్నాను.

అప్పుడు కలర్ఫొటోలు లేవు. అన్నీ నలుపూ, తెలుపు ఫొటోలే.

ఈ ఫొటోలన్నీ అమ్మ సంపద. వీటి ఆధా రంగానే అమ్మ జీవిస్తున్నది.

నేను ఎన్నోసార్లు గమనించాను. అది నా తప్పో, కాదో తెలియలేదు. కానీ అమ్మకి వర్తమా నంలో ఆకర్షణ ఏమీ మిగలలేదు. తరచూ ఈ ఫొటోలు తిరగేసుకుంటూ వుండేది. ఒకవి ధంగా మా ఇంట్లో అమ్మ గతంలో జీవించింది. వీటిని ఆర్డర్లో చూసి అమ్మ సంతోషపడు తుంది.

మొదటిది నాన్నగారు మూడు సంవత్స రాల బిడ్డగా వున్నప్పటి ఫొటో.

పుట్టువెంట్రుకలు తీయించలేదు కాబోలు. భుజాలవరకు జుట్టు వేలాడుతున్నది. మెడ నిండా నాలుగయిదు బంగారు గొలుసులు. మొలకు బంగారు మొలత్రాడు. అది కన్పించటానికి కాబోలు బట్టలు వెయ్యలేదు. ఇది తప్పకుండా తాతగారు తమ నగల ప్రదర్శన కోసం తీసిన ఫొటో.

ఆ ఫొటోలో నా పోలికలకోసం వెదుక్కున్నాను. ఆ ఫొటోలో బిడ్డకి నాన్నగారి పోలికలే లేవు. జుట్టుతోనూ, నగలతోనూ నగం దేహం కప్పబడిపోయివుంటే యిక పోలికలేమి తెలుస్తాయి.

తర్వాతి ఫొటోలో నాన్నగారు పదేళ్ళ వయసుబిడ్డ.

వదులులాగూ, చొక్కా. నాయనమ్మగారు, తాతగారు కుర్చీలో కూర్చుని ఉంటే ఆయన వెనుక నిలబడివున్నారు.

అంతే. మళ్ళీ చాలాకాలం ఫొటోలు తీయించుకున్నట్టు లేరు.

తర్వాతి ఫొటో స్నేహితులతో వున్నది. అందరూ జులపాల జుట్టూ, పైజమా, లాల్చీలతో వున్నారు. ఒకళ్ళిద్దరు స్టైలుగా చేతుల్లో సిగరెట్లు కూడా పట్టుకున్నారు. ఆ తర్వాతి ఫొటో డిగ్రీ వచ్చినప్పటిది అయివుండొచ్చు. కాన్వొకేషన్ దుస్తులలో వున్నారు.

ఇంకో ఫొటోలో అమ్మా, నాన్నగారు మెడలో పూలదండలతో, పట్టుబట్టలతో వున్నారు. బహుశా పెళ్ళిరోజుదై వుండొచ్చు. వెనక్కి తిప్పి చూశాను. పెళ్ళి తేదీ వేసివుంది. ఇంకో ఫొటోలో అమ్మ కుర్చీలో వుంటే నాన్నగారు కుర్చీ చేతిమీద కూర్చుని వున్నారు. పాత సినిమాల్లో నాయికా నాయకుల్లాగా.

అమ్మ సన్నగా, విశాలమైన కళ్ళతో బొమ్మలా వుంది. ముఖంలో పసితనం పూర్తిగా తప్పుకోలేదు. శరీరంలోకి యౌవనం వచ్చేసింది. ఇంత చిన్నప్పుడు పెళ్లయిందన్నమాట అమ్మకి. అందుకే మైథిలి బియ్యే పూర్తిచేసినప్పుడు "నీ వయసుకు నాకు నువ్వు కూడా పుట్టేశావు తెల్సా?" అంది. పెళ్ళికి నాన్నగారు కూడా నాకంటే చిన్నగా వున్నారు. ఆ రూలు అమ్మ నాకు వర్తింపచేయలేదు. "సర్లే. సంపాదన లేకుండా పెళ్ళేమిటి? మీ నాన్నగారికి డిగ్రీ కాగానే పెళ్ళిచేశారు. ఉద్యోగం వచ్చేవరకు అమ్మమ్మా వాళ్ళు నన్ను అత్తగారింటికి పంపలేదు. ఆయనిక్కడ. నేనక్కడ" అంది.

"మరే! తాయిలం చూపించి, చూపించి బీరువాలో దాచేసినట్టయిందనుకో నా పని" అన్నారు నాన్నగారు.

పిల్లలెదురుగా అలా మాట్లాడారని అమ్మకి నాన్నగారిమీద ఎంత కోపం వచ్చిందో.

"ఏం మనిషమ్మా" అని విసుక్కుంది.

ఇంకా ఆ మనోహరదృశ్యం నా కళ్లకు కట్టినట్టుగానే వుంది. వాళ్ళ అనురాగమూ, పరస్పరావగాహనా ఎంతమంది దంపతుల్లో వుంటాయి.

నాన్నగారు పెద్ద ఆఫీసరు. బాగా చదువుకున్నారు. అమ్మది వానాకాలం చదువు. మధ్యతరగతి కుటుంబంనుండి వచ్చింది. వాళ్ళది ప్రేమ వివాహం కాదు. అయినా అమ్మకి గొప్ప అండర్‌స్టాండింగ్ వుంది. బహుశా ప్రేమకు అది చాలా అవసరమేమో!

అగరువత్తులు ఆరిపోయేక కూడా పరిమళం ఇంకా గదిలోనే వున్నట్టు అమ్మ వెళ్ళిపోయేక కూడా ఆ మధురస్మృతులు నన్ను వదలటంలేదు.

వర్ధన్ కుటుంబాన్నీ మా ఇంటినీ చూస్తే తేడా కొట్టవచ్చినట్టు కనపడుతుంది. వాళ్ళవన్నీ వ్యాపార సంబంధాలు. వర్ధన్ తండ్రి తానే అల్లుళ్లకు పెట్టవలసి వచ్చినప్పుడు "ఏం అల్లుళ్ళయ్యా! 'దశమగ్రహాలు'" అన్నాడు.

కొడుకు హయాం వచ్చేటప్పటికి అల్లుళ్ళు పాతబడిపోయినా కొత్త కొత్త సాంప్రదాయాలు సృష్టించి కొడుకు అవన్నీ జరపటంలేదని సాధిస్తాడు.

ఈ రోజుకీ మా ఇంట్లో నాన్నగారి డబ్బు, నా డబ్బు అని తేడా లేదు. ఒకసారి వర్ధన్‌కి అదే సలహా ఇచ్చాను. "నువ్వు మరీ డబ్బు మనిషైపోతున్నావురా. కళ్ళేలు వదిలేసి చూడు మీ నాయన ఈ లెవెల్లో ఖర్చుపెట్టడు" అని.

వాడు ఉలిక్కిపడ్డాడు.

"పిచ్చి ఏమిరా నీకు? వచ్చిందంతా తన ముగ్గురళ్ళుళ్లకి పంచిపెట్టి మూడోనాటికి నన్ను ముష్టివాణ్ణిచేసి రోడ్డుమీద నిలబెడతాడు తెల్సా. ఆయన నా తండ్రి. నా సంపాదనమీద ఆయనకు అధికారం వుంది. గొడవంతా





ఎక్కడ వస్తోందంటే ఆయన నా సంపాదన మీద తనకే తప్ప రజనికి ఏ అధికారమూ లేదనుకుంటాడు. అఫ్‌కోర్సు రజని కూడా ఆ మాటే అంటోందిలే. తనకు తప్ప మా నాన్నకీ అధికారం లేదని అందుకే ఇన్ని సమస్యలు''

లలిత నాకు టిఫిన్ తెచ్చింది.

ఆలోచనామగ్నుడనై వున్న నన్ను చూసి "సరిపోయింది. ఉదయంనుండీ మీరు చేసిన ఘనకార్యమంతా ఈ నాలుగు ఫొటోలు అంటించడమన్నమాట. ఏంటీ? వీటిని ముందు పెట్టుకుని సినిమాల్లోలాగా ఫ్లాష్‌బ్యాక్‌కి వెళ్ళిపోయారా!'' అంది.

నేను మాట్లాడలేదు.

"నేను మీ కుటుంబసభ్యురాలినేనా కృష్ణా!''

ఆమె గొంతు విచలితంగా వుంది. నేను లలిత చేతులు నా చేతుల్లోకి తీసుకున్నాను. "అదేం లలితా! అలా అడిగావు. పెళ్ళయిన రెండు సంవత్సరాల తర్వాత నీకీ సందేహం కలిగింది. అంటే తప్పక మాలో ఏదో తప్పు వుందన్నమాట. మైథిలిని వదిలెయ్యి. అది ఈ ఇంటికి అతిథి అయిపోయింది. తప్పు నాదా? మా అమ్మదా?''

"తప్పు నాది కూడా అయివుండొచ్చుగా''

ఆ మాత్రం ఓపెన్ మైండెడ్‌నెస్ వుంటే సమస్యలే ఉత్పన్నం కావు. అయినా త్వరలోనే సమసిపోతాయి.

"అయితే నా ఫొటోలు కూడా తెచ్చిస్తాను'' అని లేచివెళ్ళింది.

లలితకు చాలా ఫొటోలు వున్నాయి. లలిత తల్లీ, బావగారి తల్లీ అక్కచెల్లెళ్ళు కావడంవల్ల వాటిల్లో బావగారి చిన్నప్పటి ఫొటోలు కూడా వున్నాయి. అమ్మా, నాన్నగార్ల పెళ్ళిఫొటోల తర్వాత నా ఫొటో అతికించాలి. వదులు లాగూ, డబ్బాలాంటి చొక్కా. వెనక్కి తిప్పి తారీకు చూశాను. 1957వ సంవత్సరంలోది. జుట్టు ముఖంమీద పడుతోంది. లలిత నా భుజంమీద తలవాల్చి ఫొటోలు చూస్తున్నది.

"మీ పనివాడా?'' అనడిగింది.

లలితవైపు తిరిగి ఏ భావమూ స్ఫురించకుండా "కాదు నేను'' అన్నాను. ఆమె వులికిపాటు నా భుజానికి తెల్సింది. తర్వాత అంటించవల్సిన ఫొటో మైథిలి నెలలబిడ్డగా, బొటనవేలు నోటిలో పెట్టుకుని, బోర్లాపడి గిలక్కాయలతో ఆడుతోంది. నేనూ, అదీ కల్సి తీయించుకున్న ఫొటోలు చాలా వున్నాయి. బుద్ధిగా మేము కుర్చీల్లో కూర్చుని నేనూ అదీ బంతులు చేతుల్లో పట్టుకుని నాన్నగారి ఒడిలో అదీ, అమ్మ ఒడిలో నేనూ కూర్చుని, నగలు పెట్టుకుని పూలజడ వేసుకుని అదీ, పక్కనే మొదటిసారి ఫాంటు వేసుకున్న నేను. ఈ ఫొటోల్లో నా క్రాపు చాలా చిన్నగా వుంది. నాన్నగారికి పెద్ద జుట్టంటే చాలా కోపం, నేను డిగ్రీ చదువుతుండగా పెద్ద క్రాపూ, జీన్సూ ఫేషన్.

"ఏమిట్రా? ఆ జులపాల జుట్టూ, నువ్వూను. చెల్లాయితో పాటు నువ్వూ జడేసుకుని పూలు పెట్టుకుంటావా ఏం?'' అనడిగేవారు. కానీ ఎప్పుడూ క్రాపు తగ్గించుకోమని బలవంతం చెయ్యలేదు. తర్వాత నేను శ్రద్ధగా చదువులో మునిగిపోయాను. ఫాషన్లు వెనక్కిపోయాయి.

"ఇప్పుడా వెలిసిపోయిన పాంట్లు వేసుకోవటం లేదేమిరా?'' అనడిగేవారు. జీన్స్ పాంట్లని ఉద్దేశించి.

"మీరు మాత్రం సిల్కుపైజామాలూ, గిరజాల జుట్టూ వేసుకుని తిరగలేదూ కొన్నాళ్ళు. అట్లాగే వాడూను'' అనేది అమ్మ.

నేను లా పాసవగానే నాన్నగారు నల్లకోటు కుట్టించారు. దానితోనే ఎన్‌రోల్ అయ్యాను. ఎంత గర్వంగా వుందో. ఆ ఫొటో నేనేదో 'సోలీ సొరాబ్జీనో, ఫాల్కీవాలానో అయినట్టు.

అప్పటికి కలర్‌ఫొటోలు వచ్చేశాయి. మైథిలి పెళ్ళిముందు ఒక ఫొటో తీయించుకున్నాము. అమ్మా నాన్నగారూ కుర్చీల్లో కూర్చుని వున్నారు. నేనూ మైథిలీ వెనుక నిలబడ్డాము.

నా చేతులు నాన్నగారి భుజాలమీద వుంటాయి. నాకు ఎంతో ఇష్టమయిన ఫొటో అది.

తర్వాత ఎన్ని ఫొటోలో. అన్నీ కలర్‌వి. ఈ ఫొటోలు తీయటానికి సందర్భం లేదు. స్టూడియోలో తీసినవి కావు. చెల్లాయి ఎక్స్‌కర్షన్‌కి వెళ్ళినప్పుడు, వనభోజనాలు, నా స్నేహితుల పెళ్ళిలో నేనూ, వర్ధన్‌తో కొన్ని లలిత తల్లిదండ్రులు మా ఇంటికి వచ్చినప్పుడు ఇలా

వేరు వేరు సందర్భాలలో తీసినవి. నా పెళ్ళిఫొటోలు, మైథిలి పెళ్ళిఫొటోలు నాలుగు ఆల్బమ్స్‌కి సరిపడేటన్ని వున్నాయి. లలిత అందిస్తోంటే నేను వరుసగా అన్నీ అతికించేశాను. అంతా అయిపోయాక లలిత బాంబులాంటి మాట అన్నది.

"ఎంతయినా మీ అమ్మగారికి మీ చెల్లాయి అంటేనే ఇష్టం. మైథిలికి చూడండి. పసిగుడ్డుగా వున్నప్పటినుండీ ఫొటోలు వున్నాయి. మీకే లేవు"

"నేనూ ఒకసారి అమ్మని ఆమాట అడిగాను. నీ చిన్నప్పుడు ఇన్ని వేషాలున్నాయేమిట్రా. ప్రపంచం రోజురోజుకీ విడ్డూరం అయిపోతోంది" అంది.

"లలితా! ఇకనుండి పాపాయికి ప్రతినెలా ఫొటో తీయిద్దాం. అది మురిసిపోవాలి వాటిని చూసుకుని. అది ఎప్పుడు ఎలావుందో దాని కళ్ళకు కట్టినట్టు వుంటుందన్నమాట. నన్ను చాలా మెచ్చుకుంటుందిలే"

"ఏమీ మెచ్చుకోదు. మా నాన్న మహాపీనాసి. ఈ స్టిల్‌ఫొటోగ్రాఫ్‌లేమిటీ? చక్కగా వీడియో తీయించివుండకూడదా? అనుకుంటుంది"

మా ఇద్దరి ఫొటోల ప్రహసనం అయ్యేసరికి సాయంత్రం అయింది. ఇద్దరం కలిసి సినిమాకి వెళ్లి చాలా రోజులయింది. అమ్మ వుంటే పాపాయిని వదిలి మేమిద్దరం వెళ్ళేవాళ్లం. ఇప్పుడు అమ్మ లేదుగా! అందువల్ల దాన్నీ దాని పాలబుట్టనీ వేసుకుని బయలుదేరాం. నేను హాల్లో వుంటే లలిత దాన్ని ఎత్తుకుని బయట, లలిత హాల్లోవుంటే నేనూ, అదీ బయట అలా లలితా, నేనూ చెరోసగం సినిమా చూసి మిగతా సగంకథ ఒకరికొకరు చెప్పుకుని దానితో మరెప్పుడూ సినిమాకు రాకూడదని ప్రతిజ్ఞ చేసుకున్నాం.

★ ★ ★

విజయదశమి వెళ్ళిపోయింది. లలితా, నేనూ మళ్ళీ రొటీన్‌లో పడిపోయాం. అదే ఇన్‌స్టెంట్ ఫుడ్. అదే యాంత్రికజీవితం. చాలా నిస్సారంగా రోజులు ఈడుస్తున్నాం.

ఒకసారి ఏదో పత్రికలో ఒక ఇల్లాలు రాసుకుంది. తను శలవుల్లో తల్లికి సహాయపడేదట. కొత్త బట్టలు కొనుక్కోవడం, సరదాగా కుట్లు నేర్చుకోవడం, వంటలు చెయ్యడం, బద్ధకంగా తొమ్మిదిగంటలకు నిద్రలేవటం, రెండో ఆట సినిమాలు చూడటం, తమ తరానికి శలవులు సరదాగా గడిచేవి. ఈ తరానికి శలవులంటే కోచింగ్‌లు, డిప్లొమాలు చదవటం, స్విమ్మింగ్ సెంటర్‌లోచేరి ఒళ్ళు తగ్గించుకోవటం ఏమయిపోయాయో ఆ రోజులు అని ఆవిడ చాలా విచారిస్తూ రాసింది.

"అమ్మ అంటూవుండేది. మేము ఆవుపేడతో గొబ్బిళ్ళు పెట్టేవాళ్ళం. బంతిపూలు విరగపూసేవి. భోగిమంటలు వేసుకునేవాళ్ళం. అట్లతద్ది అంటే చీకటితో లేచి భోజనాలు చేసి ఉయ్యాలలూగేవాళ్ళం. ఆ సరదాలేవీ ఇప్పుడు?" అని.

పన్నెండు, పదమూడు సంవత్సరాలు వచ్చే వరకు మైథిలి పనిమనిషి పేడతెచ్చి గొబ్బిళ్ళు చేస్తే తాను పూలతో అలంకరించి, దణ్ణం పెట్టుకునేది. తర్వాత తర్వాత అదీ మానేసింది.

గొబ్బిళ్ళు కూడా పాత తెలుగు సినిమాలలో తప్ప కనపడటం మానేశాయి. పాతదంతా గొప్ప అని నా అభిప్రాయం కాదు. ఆ సంప్రదాయం మారిపోయింది. అది ఒక సంస్కృతి. అది చరిత్రలోకి వెళ్ళిపోయి స్మృతిగా మాత్రమే వుండిపోయింది.

ఈరోజు లలిత ఎదుర్కొనే సమస్యలు అమ్మకి లేవు. తన ఇంటిని చక్కబెట్టుకుంటూ, దానిలోనే అర్థమూ, పరమార్థమూ వెతుక్కుంది అమ్మ. లలిత ఆధునిక యువతి. ఆమె ప్రపంచం పెద్దది. విభిన్నమయింది. నాకు లలితపట్ల సానుభూతి వుంది. మైథిలికి లలిత సమస్యలు ఏమీలేవు. అమ్మ దాన్ని పైకి చదవనివ్వకుండా తప్పుచేసిందని నా అభిప్రాయం. దానికి సుఖమూ, శాంతీ వుండొచ్చుగాక. అభివృద్ధి లేదు. అశాంతితో కూడుకున్నదయినప్పటికీ అభివృద్ధి కుంటుపడకూడదుకదా! ఆక్సిడెంట్లు జరుగుతున్నాయని మనం మోటారు ప్రయాణాలు, విమానప్రయాణాలు ఆపటంలేదే! అలాగే రేప్‌లు ఈవ్‌టీజింగ్‌లు జరుగుతున్నాయని ఆడవాళ్ళను బురఖాలు వేసుకుని




ఇంట్లో వుండమనటం కూడా న్యాయం కాదు. సమిష్టి కుటుంబాలు నమసిపోతున్నాయి. ఉద్యోగినులు ఎక్కువవుతున్నారు. చాలా కుటుంబాల్లో అశాంతి చోటుచేసుకుంటున్నది. విడాకులు ఎక్కువవుతున్నాయి. పిల్లలు ప్రేమకు దూరమవుతున్నారు. ఆ కారణంగా బాల నేరస్థుల సంఖ్య పెరుగుతున్నది. అభివృద్ధి జరిగేటప్పుడు ఇలాంటివి ఎన్నో సమస్యలు ఉత్పన్నమవుతాయి. కాలక్రమేణా వాటిలో నుండే పరిష్కారాలు లభ్యమవుతాయి. అందుకే నేను లలిత ఉద్యోగానికి అడ్డురాలేదు. బ్యాంకులో నాలుగు ఎకౌంట్స్ రాసినంతమాత్రాన దేశాభివృద్ధి జరిగిపోతుందన్న భ్రమ నాకు లేదు. కానీ, ఓ ఎడ్వర్‌టైజుమెంటులో చెప్పినట్టు 'ఏ వుమన్ ఎక్స్‌ప్రెసెస్ హెర్‌సెల్ఫ్ ఇన్ మెనీవేస్' అందులో ఉద్యోగం చేయటం ఒకటి.

ఇంకో పెద్ద కష్టం వచ్చేవరకు మనుమలకు తాము అనుభవించేవే పెద్ద కష్టాలుగా తోస్తాయి. మాకు కూడా అలాగే జరిగింది. రాముల్ని పనిమానిపించేస్తానని కూర్చుంది లక్ష్మి. బట్టలు అద్దకం చేసేచోట నూటయాభై రూపాయలు ఇస్తామన్నారట

లలితకు చాలా కోపం వచ్చింది. "దీనికి నేను భోజనం పెడుతున్నాను. పాపాయి పాలూ, బిస్కెట్లు కొద్దో గొప్పో దొంగతనం చేస్తూనేవుంటుంది. బట్టలు కుట్టిస్తున్నాము. దానికి జలుబూ, జ్వరం వస్తే పాపాయికి ఎక్కడ అంటుకుంటాయోనని మందులిప్పిస్తున్నాను. ఇవన్నీకాక వందరూపాయలిస్తున్నాను. అక్కడ నూటయాభై ఇస్తారు. ఇక్కడ మానేస్తానంటుందేం? నేను నూటయాభై ఇస్తాను. భోజనాలూ, బట్టలు లేకుండా చేస్తుందా?"

చెయ్యదు. రాములికి అద్దకం షాపులో పని దొరికిందనేది నిజమనుకోను. పాపాయి రాములికి అలవాటయ్యింది. లలితకు పాపాయిని చూసేమనిషి అత్యవసరం. లక్ష్మి ఆ అవసరాన్ని ఎన్‌క్యాష్ చేసుకోవాలనుకుంటోంది. అంతే. నేను అదే చెప్పాను లలితతో.

"దానితో తగాదా అనవసరం. ఇవ్వగలిగితే నూటయాభై ఇవ్వు. మనింట్లో పనిమానదు. ఇవ్వలేవూ- మానేస్తుంది. దానికి సిద్ధపడి వుండు"

"ఛీ! ఛీ! విశ్వాసంలేని మనుమలు" అని విసుక్కుంది.

నాకు నవ్వొచ్చింది. బహుశా లక్ష్మి కూడా లలిత గురించి అదే అనుకుంటోందేమో!

సినిమాల్లోలాగా చిన్ననాటినుండి నిన్ను భుజాలమీద ఎత్తుకు పెంచానమ్మా అనే నౌకర్లు మన జీవితాల్లో ఇక కన్పించరు. ఒకమనిషి లేదా ఒక కుటుంబం మరొక కుటుంబానికి జీవితాంతమూ చాకిరీ చెయ్యటం అభిలషణీయం కాదు. ఆచరణయోగ్యం అంతకంటే కాదు. అన్నిటికీమించి అమానుషం కూడా.

లలితదీ, రాములుదీ పరస్పర సహకారం. లలితకు ఆ పిల్లసేవలు కావాలి. తన బిడ్డను తాను లేని సమయంలో కాపాడగల నమ్మకస్తురాలు కావాలి. రాముల్కు తల్లికి డబ్బు కావాలి.

పాపాయిపట్ల రాములుకి వున్నది ఉద్యోగధర్మం. ప్రేమకాదు. ప్రేమ ఉండవలసిన అవసరమూ లేదు. ఆ మాటకు వస్తే లలితకు రాములుమీద ప్రేమ వున్న[illegible] [illegible]నంటి మానవసంబంధాలన్నీ వ్యాపారబంధాలే.

"ఓ.కె. ఓ.కె. నూటయాభై ఇద్దాము. ఇంకో నెల తర్వాత ఈ లక్ష్మి మళ్ళీ జీతం పెంచదని నమ్మకం ఏమిటి?" అంది లలిత.

"నమ్మకం ఏంలేదు లలితా! నెలకాకపోయినా ఆరునెల్ల తరువాతనయినా పెంచమని అడగచ్చు. పెంచకూడదని ఆశించటం తప్ప మనమేం చెయ్యలేం"

"పోనీ నేను ఉద్యోగం మానెయ్యనా కృష్ణా!" అంది చాలా దీనంగా. లలితమీద నాకాక్షణం కొంచెం జాలీ, అపరిమితమయిన ప్రేమా కలిగింది.

"వద్దు, వద్దు. లలితా! ఈ సమస్యలన్నీ పాపాయికి మూడేళ్ళు వచ్చేవరకే. తర్వాత అది బడికి వెళ్ళిపోతుంది. ప్రతి సమస్యకూ ఒక పరిష్కారం వుంటుంది. దీనికీ ఏదో దొరుకుతుంది. నువ్వు ఉద్యోగం మానొద్దు"అన్నాను.

★ ★ ★

"అబ్బా! పిన్ని ఊరువెళ్లటం కాదుకానీ, నువ్వు నన్ను చంపుతున్నావురా?" అన్నాడు వర్ధన్.

నేను లంచ్‌టైంలో వాడింటికి వెళ్లాను. పాపం! వాడికది మధ్యాహ్నం నిద్రపోయే సమయం.

"నీతో నాకేం పనిలేదురా. నువ్వు నిద్రపో. రజనితో మాట్లాడ్డానికి వచ్చాను" అన్నాను.

రజని బేబీ కేర్‌సెంటర్‌లో వుంది. పనిపిల్ల వాడు వెళ్ళి చెప్పగానే వచ్చింది.

"నాతో మాట్లాడేదేముంది అన్నయ్యా!" అని ఆశ్చర్యపోతూ.

"ఫిల్టర్ కాఫీ కావాలేమో!" అన్నాడు వర్ధన్ ఆవులిస్తూ. రజని నవ్వింది.

"మా ఇంట్లో కూడా ఇన్‌స్టెంట్ కాఫీ రోజులు వచ్చేలా వున్నాయండీ. నాకు ఎక్కువ సమయం సెంటర్‌లోనే సరిపోతుంది. అక్కడి కీ లలితకంటే నాపని సులువు. నేను పూర్తిగా ఇల్లు వదలటంలేదు. సెంటర్‌లో ఒక కాలు, ఇంట్లో ఒక కాలుతో మేనేజ్ చేస్తున్నాను. ఒకళ్ళి ద్దరు మంచి పనిపిల్లలు దొరికితే బావుండు ను" అంది.

"అదే నేను మాట్లాడాలని వచ్చాను రజనీ. పాపాయిని మీ ఒడిలో (అంటోంటే నాకు అర్థమయింది- వాళ్ల సెంటర్‌కి ఎంత మంచి పేరు పెట్టారో) వదలాలి అనుకుంటున్నా. మా రాములు మానేస్తానని బెదిరిస్తున్నది. దానికి మీ కేర్‌సెంటర్‌లో ఉద్యోగమివ్వండి. నేను ఆఫీసుకు వచ్చేటప్పుడు ఆ పిల్లనూ, పాపా యిని స్కూటర్‌మీద తెచ్చి ఇక్కడ వదులుతా ను. తిరిగి ఇంటికి వెళ్ళేటప్పుడు ఇద్దరినీ తీసుకువెళ్తాను. పాపాయి మీ దగ్గర వుంటే లలితకూ నిశ్చింత.

రజని సంతోషపడింది.

"తప్పకుండా...మీ ఐడియా చాలా బాగుంది" అని ప్రశంసించింది. నేను ఫీజు ఏమీ ఆఫర్ చేయలేదు. నాకు వూహ తెల్సిన నాటినుండీ వర్ధన్ నా స్నేహితుడు. మా స్నేహం ఎలాగయిందో కూడా నాకు గుర్తు. నేను మూడవ తరగతిలో చేరాను. అమ్మ నా జేబులో బఠాణీలు పోసింది. వాటికోసం చాలామంది నా చుట్టూ మూగారు. ఎవరూ నాకేమీ యివ్వలే దుకానీ నా దగ్గర్నుండి మాత్రం కొంచెం కొంచెం బఠాణీలు తీసుకుపోయారు. వీడు వచ్చి నాకు చాక్‌లెట్ ఆఫర్ చేశాడు. నేను తీసుకుని వాడికి బఠాణీలు యిచ్చాను. పెద్ద య్యాక వాడు అంటుండేవాడు, 'ఒరేయ్! నాక్కూడా బఠాణీలు కావాలని వుండేది. కానీ అడిగేందుకు మొహమాటపడి నీకు చాక్‌లెట్ ఆఫర్ చేశాను. నువ్వెలాగూ బఠాణీలు యిస్తా వని తెల్సునాకు'

వాడిలో నన్ను అమితంగా ఆకర్షించిన గుణం అదే.

ఫ్రాంక్‌నెస్.

వాడికి అందుకనే ఎక్కువమంది స్నేహితు లు లేరు. నేను ఆరవ తరగతికి వచ్చేసరికి నాన్నగారికి బదిలీ అయింది. వాడిని కౌగ లించుకుని ఎంత ఏడ్చానో. తన జ్ఞాపకంగా వాడు నాకొక యింకుపెన్ను కొనిచ్చాడు. కొత్త వూరు వచ్చాక, నేను సాయంత్రాలు ఒంటరిగా కూర్చుని ఏడ్చేవాడిని. ఒకరోజు నాన్నగారు గమనించి దగ్గరకు తీసుకుని కారణమడిగా రు. నాకు సిగ్గేసింది. చాలాసేపు చెప్పలేదు. తర్వాత చెప్పాను, 'వర్ధన్ చాలా గుర్తుకొస్తున్నా డు'. 'ఇక్కడ కొత్తస్నేహాలు చేసుకో' అన్నారు నాన్నగారు. 'చేసుకున్నాను... అయినా గుర్తుకొ స్తున్నాడు'

'అయితే ఇదేదో సీరియస్‌గా ఆలోచించవ లసిన విషయమే' అన్నారు. మరురోజు యిన్ లాండ్ లెటరు కొనిచ్చారు. వర్ధన్‌కి ఉత్తరం రాయి అన్నారు.

'ఏంరాయాలో తెలీదు' అన్నాను.

"యిక్కడ ఎలా వుంది? స్కూల్ ఎలా వుంది? టీచర్ల గురించి, కొత్త స్నేహితుల గురించి రాయి'

రాశాను. మనసు తేలికపడింది. కొన్నిరోజుల పాటు నాన్నగారుసాయంత్రాలు చెల్లాయినీ, నన్ను పార్కుకి తీసుకువెళ్ళేవారు. తర్వాత నాలుగయిదు సంవత్సరాలకు మళ్ళీ ఈ వూరు బదిలీ అయింది. నాన్నగారికి మామీద ఎంత శ్రద్ధంటే - నన్ను మా యింటిదగ్గర స్కూల్లో చేర్పకుండా వర్ధన్ వుండే స్కూల్లో చేర్చారు.

ఈసారి నాన్నగారికి బదిలీ అయినప్పుడు నేను ఏడవలేదు. నాకిప్పుడు నా దుఃఖాన్ని ఎలా అధిగమించాలో తెలుసు. తర్వాతి సంవ




త్సరాల్లో మేము కలుస్తూ, విడిపోతూ వచ్చాము. స్నేహంమాత్రం గాఢతరం అయింది కానీ వలుచబడలేదు. దానిక్కారణం మా స్నేహంలో స్వార్థంలేదు. వాడిది అనుకున్నదంతా నాదీ. నాది అనుకున్నదంతా వాడిది. అందుకే వాడు అమ్మనీ, నాన్ననీ కూడా పిన్నీ బాబాయ్ అని పిలిచేవాడు.

వాడికి మెడిసిన్‌లో సీటు వచ్చినప్పుడుమాత్రం నాకన్పించింది, దానిక్కారణం వాళ్ళ నాన్నేనని. ఆయన పొద్దున్నే లేచి వాడిమీద ఎంత ఖర్చు పెట్టాడో లెక్కలు చెప్పేవాడు.

'హి నోస్ హౌటు మేక్ చిల్డ్రెన్ ఫీల్ గిల్టీ'

దానిలో ఆయనది అందెవేసిన చెయ్యి. కనుక ఆయన కంఠశోష ఫలించింది.

నా విషయంలో నేను సర్వస్వతంత్రుడిని. అందుకే నేను మామూలుగా పాసై డిగ్రీలో చేరిపోయాను. మా వృత్తులు వేరు. కానీ హృదయంమాత్రం ఒకటే. అటువంటి స్నేహితుడికి ఫీజు ఆఫర్‌చేయటం మా స్నేహాన్ని అవమానించటమే.

"పసిపిల్ల శుభ్రంగా, ఆరోగ్యంగా ఉంటుందా?" రజని ప్రశ్నతో నేను ఆలోచనల నుండి బయటపడ్డాను.

"పసిపిల్లలతో గడపాలికదా! అందుకే అడుగుతున్నాను"

"లలిత దానికి చాలా మంచి అలవాట్లు చేసింది రజనీ. మనింట్లో పిల్లల్లానే శుభ్రంగా వుంటుంది. రేపు తీసుకొస్తాను... చూస్తావుగా"

నా హృదయం తేలికపడింది. సమస్య యింత సులువుగా, ఆమోదయోగ్యంగా పరిష్కారమవుతుందని నేను వూహించలేదు. నాకెంత సంతోషం కలిగిందంటే, వర్ధన్ యింటినుండే ఆఫీసుకు ఫోన్‌చేసి మధ్యాహ్నం ఆఫీసుకు రావడంలేదని చెప్పాను. బ్యాంకుకు ఫోనుచేసి లలితకు వస్తున్నానని చెప్పాను. హఠాత్తుగా నేను ఎందుకు వస్తున్నానో తెలియక లలిత గాభరాపడిందట.

నేను చెప్పిన సంగతి విని లలిత వెర్రిగా సంతోషపడింది.

"నిజంగానా కృష్ణా! నిజంగానా?" అని పదే పదే అడిగిందది.

"పాపాయి అక్కడ జాగ్రత్తగా వుంటుంది కదూ!"

"ఈ రాములు స్కూటర్ వెనుక జాగ్రత్తగా కూర్చోగలదా?"

"పాపాయికి ఏం బిస్కెట్లు యిస్తారో. రజనికి ఫోన్‌చేసి దాని బ్రాండ్ చెపుదామా?"

లలిత ఏమిటేమిటో మాట్లాడుతూనేవుంది. పాపాయికి మా యిల్లు ఎంత క్షేమమో, రజని ఒడి అంతే క్షేమమని లలితకు తెలుసు.

కానీ తల్లిమనను...

మా అమ్మకీ యిదే మనసు అంటే లలిత ఒప్పుకోకపోవచ్చు.

"మీరు పెద్దవాళ్ళుకదా! పాపాయికి పదేళ్ళు రానివ్వండి. ఐవిల్‌నాట్ జస్ట్ బాదర్ ఎబౌట్ హర్" అంటుంది.

పదేళ్ళు కాదు పాతికేళ్ళయినా తల్లి బిడ్డగురించి బాదర్ అవకుండా వుండగలదా? ఢిల్లీకి రాజయినా తల్లికి కొడుకేకదా!

లలిత కూడా మధ్యాహ్నం బ్యాంకుకి శలవు పడేసి యింటికి వచ్చేసింది. తల్లిని హఠాత్తుగా చూసేసరికి పాపాయి పడుతూ లేస్తూ వచ్చి లలిత చంక ఎక్కింది.

రాముల్ని "పోయి మీ అమ్మని పిల్చుకురా" అని పంపించాము. లక్ష్మికి నచ్చచెప్పాను. ఆమె కూడా సంతోషపడింది - రజని ఎక్కువ డబ్బు యిస్తుందని చెప్పగానే.



ఆమె వయసు ముప్పైదాటి వుండొచ్చు. పచ్చని పట్టుచీర కట్టుకుని వుంది. కెంపు రంగు పమిటంచుని సుతారంగా నడుముచు

ట్టూ తిప్పిదోపుకుంది. తలంటుకున్న జుట్టులో మల్లెమాల, నుదుటిన వెలుగుతున్న సూర్య బింబంవంటి బొట్టు. ఆమె పూలసజ్జతో గుడి మెట్లు ఎక్కుతోంటే ఆ జగజ్జనని కోవెలలో కొలువయ్యేందుకు వెళుతున్నట్టుగా వుంది. ఆమె అందంగా, ఆరోగ్యంగా, పరిశుభ్రంగా వుంది.

ఐదారు సంవత్సరాల పిల్లవాడు పుసినిండిన కళ్ళతో, జారుతున్న లాగూ ఎగేసుకుంటూ చిల్లర డబ్బులకోసం ఆమెను వెంబడిస్తున్నాడు. ఆమెనే చూస్తూ వెంబడిస్తూ, అడ్డదిడ్డంగా మెట్లెక్కుతున్నాడు. నాలుగు మెట్లెక్కాక దబ్బున తూలాడు 'అమ్మా! అమ్మా' అంటూ.

నాకు మెలకువ వచ్చేసింది. అప్రయత్నంగా నుదురు తడుముకున్నాను. యిప్పటి వరకు కలగన్నానని అర్థమయింది. లేచి మంచినీళ్ళు తాగి అప్రయత్నంగా అమ్మగదిలోకి వెళ్ళి అమ్మ మంచంమీద పడుకున్నాను. అమ్మ ఒడిలో పడుకున్నట్టే వుంది. మైథిలికి పురుటికందుగా ఫొటోలున్నాయి. నాన్నగారికి కూడా... ఆ పాతరోజుల్లో కూడా చిన్నప్పటి ఫొటో వుంది. నాకెందుకు లేదు? మైథిలికి యింగ్లీమ నెలలప్రకారం పుట్టినరోజు చేస్తారు. నాకు కృష్ణాష్టమినాడు ఎందుకు చేస్తారు? మబ్బు విడుతున్నట్టుగా వుంది. నా గుండె దబదబా కొట్టుకుంటున్నది. నా గొంతు తడారిపోయింది. పిచ్చివాడిలాగా ఆల్బంలన్నీ పదేపదే చూశాను. ఈ సందేహం యిన్నాళ్ళూ ఎందుకు రాలేదు? ఇదీ నిజమా? నా భ్రమా? నాకెవరు సమాధానం చెప్తారు? నేను సన్నగా వణుకుతున్నాను.

బయటకువచ్చి, యిల్లు తాళంవేసి వర్ధన్ యింటికి బయలుదేరాను. బుద్ధుడిలా భార్యనూ, బిడ్డనూ వదిలి అర్ధరాత్రి సత్యాన్ని శోధించటానికి బయలుదేరినట్లుంది నాపని. రెండవ ఆట సినిమా కూడా వదిలి చాలాసేవయినట్టుంది. రోడ్లన్నీ నిర్మానుష్యంగా వున్నాయి. వర్ధన్ యింటి కాలింగ్‌బెల్ నొక్కుతుంటే నా చేతులు వణకటం స్పష్టంగా తెలుస్తోంది. వర్ధనే తలుపు తీశాడు. సామాన్యంగా రాత్రుళ్ళు వాడికోసం ఎవరో ఒకరు వస్తూనే వుంటారు. అందుకని మిగిలిన కుటుంబ సభ్యులు కాలింగ్‌బెల్ మోగితే పట్టించుకోరు. ఆ సమయంలో నన్నుచూసి వాడు కంగారుపడ్డాడు.

"ఏమిరా? లలితా, పాపాయి బాగున్నారు కదా!"

"బావున్నారు. పద, పోయి డాబామీద కూర్చుందాం"

యిద్దరం వెళ్ళి డాబామీద కూర్చున్నాం.

"కృష్ణా! ఒంట్లో బాగుందా? ఏంటి అలా వున్నావు?" వాడు ఆదుర్దాగా అడుగుతున్నాడు.

నేను గొంతు పెగుల్చుకున్నాను. వణుకుతున్న గొంతును అదుపులోకి తెచ్చుకున్నాను.

"ఒరేయ్ వర్ధన్! నాకు అమ్మ వెళ్ళిపోయినప్పటినుండీ తరచూ ఒక కల వస్తోంది చూడు... దాంట్లో మనుమలెవరో తెలుసురా... నీకు?" నా గొంతు పూడుకుపోయింది. కంటివెంట నీరు జలజలా కారింది. నాన్నగారు పోయినప్పుడు ఆరోజు గుడిదగ్గర అమ్మముందు ఏడ్చాను. మళ్ళీ యివాళ.

"రిలాక్స్ కృష్ణా! రిలాక్స్"

"ఒరేయ్... ఒరేయ్... యిదెలా సంభవంరా? ఇది నిజమా?"

వాడు నన్ను ఏడవనిచ్చాడు. నేను వూరుకున్నాక మొదలుపెట్టాడు.

"కృష్ణా! నువ్వన్నట్టు నేను ఫ్రాయిడ్‌తో ఆగిపోలేదురా. నీ మాటల్ని సరదాగా తీసిపారేసినట్టు నటించానేగానీ, నిజానికి చాలా సీరియస్‌గా తీసుకున్నాను. నిన్ను ఎనలైజ్ చేయాలని ప్రయత్నించాను. చాలావరకు చేశాను కూడా. నిన్నొక కుర్చీలో కూర్చోబెట్టి ప్రశ్నలడగటం చాలా పాతపద్ధతి. పైగా నీ రహస్యాలు, నీ యిన్‌హిబిషన్స్ నీకుంటాయి. నీ సమాధానాలనుబట్టి నిన్ను ఎనలైజ్ చేస్తానని తెలిస్తే నీకు తెలీకుండానే నువ్వు రిజిడ్ అవుతావు. ఇతరుల దృష్టిలో చులకన అవుతావు, అనుకున్న అంశాలు దాస్తావు. ఇది కావాలని చేయవు. అయినా దాచటం జరుగుతుంది. అందువల్ల నువ్వు కలవచ్చిన మొదటిసారి నాదగ్గరకు వచ్చినప్పటినుండి యిప్పటివరకూ నేను నిన్ను పేషంటుగా అనుకునో... సబ్జెక్టుగా అనుకునో





చూస్తూ, అడుగుతూ, పరిశీలిస్తూనేవున్నాను.

"నీ పరిశీలనలో యిదేనా తెల్సింది?"

వర్ధన్ మాట్లాడలేదు.

"నా అనుమానం నిజమేనా వర్ధన్? నీ పరిశీలనలో ఏం తెల్సింది?"

"నాకు తెలిసినదానికీ, పిన్ని ప్రవర్తనకూ లింక్ అందటంలేదురా"

"ఏం తెల్సిందిరా?"

వాడు కుర్చీని నాకు దగ్గరగా జరుపుకున్నాడు. నా చేతుల్ని తన రెండు చేతులమధ్య సుతారంగా నొక్కేశాడు.

"నీ ఓదార్పు నాకొద్దు. నాకు నిజం కావాలి"

"నువ్వూ, ఒక తాత ఒక చెట్టుకింద వుండేవాళ్ళు. అక్కడొక కొండ, దానిమీద ఒక గుడీ వుండి వుండొచ్చు. అది ఏ దేవుడి గుడో తెలియదు. ఆ విషయమై నీ ఆలోచనలలో స్పష్టత లేదు. బహుశా కొంచెం పేరున్న దేవుడే అయివుండొచ్చు. ఎందుకంటే అక్కడ కొన్ని బస్సులు వచ్చి ఆగుతుండేవి. నువ్వు... నువ్వు ఆ ప్రయాణీకులను..."

"అడుక్కుంటూ వుండేవాడినా?"

"ఊఁ! పిన్ని నిన్ను అక్కడ చూసి తెచ్చుకుని వుండొచ్చు. బహుశా ఆరోజు కృష్ణాష్టమి అయివుండొచ్చు. పిన్నికి పండుగలకు గుళ్ళకు వెళ్ళే అలవాటుంది కాబట్టి యిలా జరిగి వుంటుందని నేననుకుంటున్నాను. పిల్లలు ఎంత త్వరగా విషయాలను గ్రహిస్తారో అంత త్వరగా మరిచిపోతారు. అలా మరిచిపోకుండా వుండాలంటే పెద్దలు వాళ్ళకు వాటిని తరచూ గుర్తుచేస్తూ వుండాలి. నీ అదృష్టమో, దురదృష్టమో నీకు పిన్నీ బాబాయి యీ విషయాలనెప్పుడూ గుర్తుచెయ్యలేదు. అందువల్ల ఈ స్మృతులు నీ మనసు అట్టడుగు పొరలోకెళ్ళి దాగుండిపోయాయి. బహుశా ఎప్పటికీ బయటకు వచ్చివుండేవి కాదేమో. కానీ పిన్ని వెళ్ళిపోవటంతో నువ్వు చాలా డిప్రెషన్‌కి గురయ్యావు. డిస్టర్బ్ అయ్యావు. కొంచెం గిల్టీగా ఫీలయ్యావు. అప్పుడు నీ మనసు పొరల్లోనుండి ఈ నిజం బయటకు వచ్చింది"

"ఆ తాత నాకేమవుతాడు? నా తల్లిదండ్రులెవరు?"

"నేను చెప్పేది జ్యోతిష్యంకాదురా సైకో అనాలిసిస్. అంతకుముందువిషయాలు నీ బ్రెయిన్ రికార్డుచెయ్యలేదుబహుశా చాలా చిన్నవాడివి అయియుండొచ్చు"

నేను నిశ్చేష్టుడినై అలా ఎంతసేపు కూర్చున్నానో నాకే తెలియదు. సినిమాల్లోలాగా, కథల్లోలాగా నాన్న, అమ్మా, మైథిలీ వాళ్ళెవరూ నాకేమీ కారు. నన్ను దగ్గరకు తీసుకున్న నా తండ్రి లాలించి, స్నేహితుడిని మరిపించాలని పార్కులవెంట, ఐసుపార్లర్లవెంట తిప్పిన ఆ ప్రేమమూర్తి ఉత్తరాలు ఎలా రాయాలో, మనియార్డర్లు ఎలా చెయ్యాలో, పరీక్షలు ఎలా రాయాలో, గడ్డం ఎలా గీసుకోవాలో నేర్పిన నా గురువు, అమ్మాయిలను ఆటపట్టించటం దగ్గర్నుండి, భార్య ఎన్నికవరకు సలహాలిచ్చిన నా స్నేహితుడు నాకేమీ కాడు. ఆయనకూ, నాకూ ఎటువంటి రక్తసంబంధమూలేదు. నేను ఆయన ఫొటోలో నా పోలికలు వెతుక్కున్నాను. మీ నాన్నగారిలాగ నీవి పెద్దకళ్ళు అంటే మురిసిపోయాను. అమ్మ మాత్రం... స్త్రీలు పురుషులకంటే స్వార్థపరులనీ, వాళ్ళ ప్రపంచం చాలా చిన్నదనీ అనుకుంటూ వచ్చానుయిన్నాళ్ళు. ఆయాచితంగా వచ్చే డబ్బుకోసం అర్ధాంగులను కాల్చేసే ఈ ప్రపంచంలో జాతి వివక్షతతో వూరు వూరంతటినీ కాల్చేసే ఈ దేశంలో, మతమౌఢ్యంతో కన్న బిడ్డలను బలిచ్చే తండ్రులున్న ఈ భూమ్మీద, యల్టీటీయి, ఉల్ఫా, జెకెయల్ఎఫ్, పంజాబ్ టెర్రరిస్టు అని పేర్లుపెట్టుకుని మనుమలు సాటి మనుమల్ని వూచకోత కోస్తోంటే ఎవరీ మధ్యతరగతి దంపతులు? అనాథని, అడుక్కునేవాడిని, తమ బిడ్డకానివాడిని, తమ రక్తం పంచుకోనివాడిని ఆత్మీయంగా అక్కున చేర్చుకుని తమ బిడ్డతో సమానంగా పెంచారు. ఏమాసించి యిదంతా చేశారు? ఈ చర్యద్వారా కనీసపు గుర్తింపయినా ఆశించలేదే.

నాకు యింటిపేరిచ్చారు, తండ్రిపేరిచ్చారు. కుటుంబసౌఖ్యాన్నీ రక్షణనూ, విద్యనూ, సంస్కారాన్నీ ఈనాడు నేననుభవించే హోదాను... యిన్నింటిని యిస్తే ప్రతిగా నేనేం చేశాను? ఏమీ చెయ్యలేదు. నేను వాళ్ళులేని యింటినుండి, ఆ యింటి యజమానురాలిని

వెళ్ళగొట్టి కుటుంబసమేతంగా వుంటూ వచ్చాను.

కళ్ళుమూసుకుని ఎంతసేపు గడిపానో తెలీదు.

కాకులు అరుస్తున్నాయి. పాలవాళ్ళ కేకలు విన్పిస్తున్నాయి. వర్ధన్ నన్ను తట్టిలేపాడు.

''కృష్ణా''

''ఊఁ!''

''సినిమాల్లోలాగ యిప్పుడు నీ కన్నతల్లి దండ్రుల్ని వెతుక్కుంటూ వెళ్తావా ఏమిరా?'' అన్నాడు - తన పరిహాసంతో వాతావరణాన్ని తేలికచేయ ప్రయత్నిస్తూ.

ఆశ్చర్యం! నాకా ఆలోచనే రాలేదు.

నేను ఎవర్ని?

దానితో నాకేమిటి సంబంధం?

కన్నవారికి అక్కర్లేనివాడిని అయివుండొచ్చు. కన్నవారు లేనివాడిని అయివుండొచ్చు. యిప్పుడది తెల్సుకోవాలనే నాకు ఆసక్తి లేదు.

అటువంటి ప్రయత్నం చేసి అమ్మను అవమానించనూలేను.

''లేదు వర్ధన్! ఉన్నారో లేదో తెలియని, ఉన్నా నేను అక్కర్లేదనుకుని వదిలేసినవాళ్ళ వద్దకు వెళ్ళే ఫూల్‌ని కాదు నేను. తన పేగు తెంచుకుని పుట్టనివాడిని తన బిడ్డతో సమానంగా పెంచటం, ప్రేమించటం ఆవిడకేనా తెల్సింది? యిన్నేళ్ళ తన పెంపకంలో ప్రేమించటం నాకూ చేతనయింది. మా అమ్మ... జీవితం ఎవరినయితే నాకు అమ్మగా పరిచయం చేసిందో ఆవిడకోసం వెడతాను. నేను అనాథనని నాకు తెలియనక్కర్లేదని అమ్మ అనుకుంది. కానీ నిజం తెల్సిందని ఆవిడకు తెలియనక్కర్లేదని నేననుకుంటున్నాను. వర్ధన్! నాకీ సహాయం చేసిపెట్టు. ఈ విషయం ఎవరికీ తెలీనివ్వకు. రజనీక్కూడా! వీలయితే నువ్వు కూడా మర్చిపో. నేనూ మర్చిపోదల్చుకున్నాను''

వాడు నన్ను గట్టిగా కౌగలించుకున్నాడు.

ఇటువంటి స్నేహితుడు, అటువంటి తల్లిదండ్రులు దొరకటానికి ఏ పూర్వపుణ్యం చేశాను? ఏ పూజాఫలంతో వీళ్ళు నాకు లభించారు?

నేను వాడి కౌగిలినుండి విడివడి- ''ఒరేయ్! లలిత నిద్రపోతోంటే తాళంవేసి వచ్చేశాను. కంగారుపడుతుంటుంది, నువ్వెళ్ళి తలుపు తియ్యి. కిందకెళ్ళి నాకో రెండువందలు తెచ్చివ్వు. మైథిలీ వాళ్ళ వూరుకి ట్రైన్ వుందిప్పుడు. నేను అమ్మదగ్గరకు వెళ్తున్నానని లలితకు చెప్పు'' అన్నాను.

''ఇలాగ? యీ లుంగీతో...''

''నీ ప్యాంటు ఒకటి తెచ్చివ్వు... క్విక్ ట్రైన్‌కు టైమవుతోంది''

★ ★ ★

రైల్లో నా శరీరం నెమ్మదిగా వూరు చేరవచ్చు. కానీ నా మనసెప్పుడో అమ్మదగ్గరకు వెళ్ళిపోయింది.

లలిత చిన్ననాటి ఫొటోచూసి 'మీ పనివాడా?' అనడిగింది. అది బహుశా నేను మా యింటికి వచ్చినప్పటిదై వుండొచ్చు.

అమ్మ కృష్ణాష్టమినాడు కృష్ణుడి మందిరానికెళితే దొరికివుంటాను నేను. అందువల్లనే, ఆరోజు అమ్మ గుడివద్ద నేనేం అడుగుతానో అని భయపడింది.

అందుకే గుడిని చూసి నేను అసౌకర్యంగా ఫీలయ్యాను.

''అమ్మా! పాపాయి అచ్చు నీపోలికే' అన్నాను చాలాసార్లు.

అమ్మ ఎంత మధురంగా నవ్వింది?

ఇది మానవమాత్రులకు ఎలాసాధ్యం?

నేను వాళ్ళ బిడ్డనికాదని వాళ్ళు మర్చిపోయారు.

నన్నూ ప్రపంచాన్నీ మరిపించారు.

'ప్రేమించిన ప్రేమ వచ్చును' అనే సిద్ధాంతాన్ని మనసా, వాచా, కర్మణా నమ్మి అనుసరించారు.

ఇది దయాధర్మం అనుకోలేదు. సంఘసంస్కరణ అనుకోలేదు. ఒక బీదవాడిని ఉద్ధరిస్తున్నాం అనుకోలేదు.

ఒక అనాథను ఆదరించి తమలో ఒకణ్ణి చేసుకోవటం?

ఇటువంటి తల్లిదండ్రులు ఏ పురాణాల్లో కన్పిస్తారు? ఏ ఇతిహాసాల్లో వుంటారు?

'నీ యవ్వనం నాకిచ్చి, నా ముసలితనం





నువ్వు తీసుకో నాయనా?' అనే తండ్రిని గురించి చదివాం.

'నాకు పెళ్ళి చేసుకోవాలని వుంది. నువ్వు ఆజన్మ బ్రహ్మచారిగా వుండు నాయనా' అనే తండ్రిని గురించి చదివాం.

కోపంతో 'నిన్ను యముడికిస్తాను' అన్న తండ్రి కూడా మన ఉపనిషత్తుల్లో వున్నాడు.

కళ్ళు తెరవని పసిగుడ్డుని కడలిపాలు చేసిన తల్లి వుంది.

కానీ నా తల్లీ, తండ్రీ దేవతా స్వరూపులు. అమృతమూర్తులు వీళ్ళ గురించి ఎవరూ ఏ పుస్తకమూ రాయలేరు.

ప్రపంచంలో నాకూ, వర్ధన్‌కీ తప్ప వీళ్ళ గురించి ఎవరికీ తెలీదు.

అమ్మా! అమ్మా! ఈ దీనుడి మీద నీకు జాలి ఎలా కల్గింది? అది ప్రేమగా ఎలా రూపాంతరం చెందింది?

మైథిలి యింటి మెట్లెక్కుతుంటే హృదయం ఎన్నడూ ఎరుగని విధంగా స్పందించింది.

మైథిలి భోజనాల బల్ల వద్దకు టిఫిన్‌తీసుకు వస్తోంది అమ్మ కోసం.

నన్ను చూడగానే,

"అమ్మా! అన్నయ్యా వచ్చాడే!" అని చిన్నగా అరిచింది.

"నిన్ను మా అత్తగారు వాళ్ళు ఊరికే అమ్మకూచి అన్లేదురా. అమ్మ వచ్చి రెండు నెలలు కూడా కాలేదు వెనకాలే తయారయ్యావు" అంది మైథిలి.

"కాళ్ళూ, చేతులూ కడుక్కుని రా నాన్నా! టిఫిన్ తిందువుగానీ" అంది అమ్మ.

అమ్మ ప్రక్క కుర్చీలో కూర్చున్నాను. "ఓపిక లేదమ్మా! రాత్రంతా నిద్రలేదు. ఆకలి దంచేస్తోంది. నువ్వు తినిపించకూడదూ?"

"ఎందుకురా నా ముఖంలోకి అలా చూస్తున్నావు?" అన్నట్టు చూస్తోంది అమ్మ కూడా నాకేసి.

అపురూపమయిన వ్యక్తులు పుస్తకాల్లో వుంటారు. జీవితాలలో మనతో కలిసి జీవిస్తుంటే ఆ భావన ఎలా వుంటుంది?

టిఫిన్ పూర్తి చేసి, తలారా స్నానం చేసి గొడ్డులా నిద్రపోయాను. నిద్రలో మళ్ళీ కలవచ్చింది. అదే కల... కానీ యిప్పుడు అమ్మ స్పష్టంగా తెలుస్తున్నది. నేను కూడా స్పష్టంగానే వున్నాను. యిప్పటిలాగే పెద్ద వాడిగా వున్నాను. బహుశా వర్ధన్ విశ్లేషణ వల్ల స్పష్టత గోచరించినట్టుంది నా మనోనేత్రానికి. ఈసారి నేను అడుక్కోవటం లేదు. కానీ మెట్టుమీద నుండి క్రిందకి జారబోయాను. అమ్మ చేయి అందించింది. మెలకువ వచ్చి చూస్తే నేను మంచం మీదనుండి క్రిందపడి వున్నాను. శబ్దానికి అమ్మా, మైథిలీ గదిలోకి వచ్చారు. అది ఒకటే నవ్వు.

"బాబిగాడిలాగ నిద్రలో క్రిందపడటం ఏమిట్రా?"

★ ★ ★

"అమ్మా! యింటికి ఎప్పుడు వెళ్తున్నాం?"

నా ప్రశ్నకు అమ్మ నవ్వింది. సమాధానం చెప్పలేదు. న్యాయమే... అమ్మ మనసుని నేనూ, లలితా గాయపరిచాము. తన యింటి నుండి తనను వెళ్లగొట్టాము.

అమ్మ పిచ్చితల్లి! బంగారుకొండ!

'ఇది నా యిల్లు. నువ్వు ముష్టివాడివి. అడుక్కునే వెధవవి. గుడిమెట్లమీద కొబ్బరి ముక్కలు ఏరుకునే వెధవవి. నా యింటి నుండి నన్ను వెళ్ళగొట్టడానికి నీకేం అధికారం వుంది' అని నన్ను ప్రశ్నించలేదు. ఎండిపోయిన ఆవు తనను కసాయివాడికి అమ్ముతుంటే తలవంచుకుని వెళ్ళిన చందాన కళ్ళనీరు కంటిలోనే నింపుకుని యిల్లువదిలింది.

ఇప్పుడు నేను వచ్చి 'అమ్మా! యింటికి వెళ్దాం' అనగానే ఎగిరి గంతేసి నావెనుకనే రానక్కర్లేదుకదా! ఈమాత్రం శిక్షయినా పడకపోతే నాకు నిష్కృతివుండదు.

నేను మళ్ళీ అమ్మను ఆ ప్రశ్నతో విసిగించదలుచుకోలేదు. అమ్మ తీర్పుకోసం, క్షమకోసం ఎదురుచూడాలనుకుంటున్నాను. ఎంతకాలమయినా సరే!

★ ★ ★

లలితనూ, పాపాయినీ వదిలివచ్చి మూడు రోజులయింది. ఎలా వున్నారో తెలియదు. కానీ

వూళ్ళో వర్ధన్ వున్నాడనే ధైర్యం వుంది. అందుకే నేను మైథిలి యింట్లో వుండిపోయాను. నాకు బాబితో బాగానే కాలక్షేపం అవుతోంది. అమ్మ నాతో ప్రేమగా మాట్లాడుతుంది. ఆపేక్షగా వుంటుంది. కానీ 'ఇంటికి వెళ్దాం' అనే మాట ఎత్తడంలేదు. లలిత ప్రసక్తి తేవటంలేదు. అమ్మ తనచుట్టూ తాను ఒక గిరి గీసుకుంది. ఆ గిరిలోకి ప్రవేశించటం నావల్ల అయ్యేట్టులేదు. కాలుతున్న అడివిమధ్యలో జింకపిల్లలా నాకు వూపిరి అందటంలేదు.

అమ్మ మధ్యాహ్నం నిద్రపోతోంటే మైథిలివచ్చి నాదగ్గర కూర్చుంది

"అన్నయ్యా!"

"ఏంటీ?"



"నేనొక మాట అడగనా?"

"నీకంత మర్యాదెప్పుడు తెల్సిందే? అనుమతి అడిగిమరీ ప్రశ్నలు అడుగుతున్నావు. షూట్ ఇట్!"

"అమ్మా, వదినా పోట్లాడుకున్నారా?"

నేను మైథిలిని పరీక్షగా చూశాను. 'భూమి మీద ఈ మైథిలి అనే ప్రాణి పుట్టివుండకపోతే నా బతుక్కి అన్నా చెల్లెళ్ళ అనుబంధంలోని మాధుర్యం ఎప్పటికీ తెలిసివుండేది కాదుకదా' అనిపించింది. దానితో గిల్లికజ్జాలు, ప్రతిదానికీ పోటీపడటం, దానికోసం ఎక్కడికయినా వెళితే గాజులు, రిబ్బన్లు కొనడాలు, బావగారి వుత్తరాలు దాచేసి దాన్ని ఏడ్పించటం... ఎన్ని మధురానుభూతులు!

"ఏంటన్నయ్యా! మాట్లాడవు?"

"ఏంటమ్మా" ఈలోకంలోకి వస్తూ అడిగాను.



"వదినా, అమ్మా పోట్లాడుకున్నారా?" మళ్ళీ అదేప్రశ్న అడిగింది. ఏంజరిగిందో దీనికి నిజంగా తెలియదా? అమ్మ చెప్పలేదా? లేక అమాయకత్వం నటిస్తోందా?

అమ్మ పెంపకంలో పెరిగిన అదృష్టం నాదయితే, ఆమె గర్భాన జన్మించటం, ఆమె పెంపకంలో పెరగటం రెండూ లభించిన మహద్భాగ్యం దానిది. అటువంటిదానికి నటించటం తెలుస్తుందా... నా పిచ్చిగానీ!

"అమ్మ చెప్పలేదా మైథిలీ!"

"లేదురా! డైరెక్టుగా చెప్పలేదు. నిజంగా పోట్లాడుకున్నా చెప్తుందా? అమ్మకి ఎప్పుడూ నువ్వే ఫస్టు ప్రిఫరెన్సు కదా!"

"నా ఫిర్యాదుకూడా అదే!" అన్నాను అల్లరిగా.

"ఏంటీ? అమ్మకు నేనంటే ఎక్కువ యిష్టంఅనా? నాన్సెన్స్!" అంది.

మా యిద్దరికీ మనసులో తెలును. అమ్మకి మేమిద్దరమూ సమానమే. నాన్నగారున్నప్పుడు ఆయన కూడా మాతో పోటీకి వచ్చేవారు. 'పిల్లల ధ్యాసలోపడి అసలు నన్ను పట్టించుకోవటమే మానేశావు' అనేవారు తరచూ. అమ్మ అందరికీ కావలసిన వ్యక్తికదా!

"మైథిలీ! అమ్మ ఏంచెప్పిందీ?"

"ఏంచెప్పలేదు అన్నయ్యా! 'కొన్నాళ్ళు నీదగ్గర వుండాలని వచ్చాను' అన్నది మొదట. దిగులుగా వుండేది. కానీ, నాన్నగారు పోయిన దగ్గర్నుండీ ఏనాడు సంతోషంగా వుందికనుక. అందుకే నేనూ సీరియస్‌గా పట్టించుకోలేదు. బాబిని చూసినప్పుడల్లా పాపాయిని తలుచుకుంటుంది. 'ఎలాగే మైథిలీ! నేను వచ్చేశాను. మీ అన్నయ్యా, వదినా ఆఫీసుకు వెళ్ళిపోతారు. ఆ పనిపిల్ల నిద్రపోతుందో ఏమిటో అంటుంది ఒకసారి. పాపాయి ఎప్పుడో పాక్కుంటూ నీళ్ళబకెట్ వద్దకు వెళ్లిందటకదా! ఒకరోజంతా అది గుర్తుచేసుకుని తల్లడిల్లిపోయింది. ఇంకొకరోజు 'రాములు, పాపాయి వరండాలో ఆడుకుంటూవుంటారు. ఆ రాములికి నిద్రెక్కువ. మెట్లమీదనుండి పాపాయి జారిపోతుందేమో!' అని తలుచుకుని కంగారుపడి నాలుగుసార్లు బాత్‌రూంకి వెళ్ళొచ్చింది. చివరకు మీ బావగారు అనేశారు.

'చూడండి... మీరు యిక్కడ వున్నారేకానీ మీ మనసంతా కృష్ణ కుటుంబంచుట్టూ తిరుగుతోంది. వదండి... దింపివస్తాను' అని. ఆరోజు నుండి అమ్మ తన భయాలను బయటపెట్టలేదు. మీ గురించి ఎక్కువ మాట్లాడలేదు. కానీ, నాకుతెలునుకదా! అమ్మ పాపాయిగురించీ, నీగురించీ ఆలోచించటం మానలేదు. మంచి భోజనం, చివరకు మంచి కాఫీ చూసినా 'మీ అన్నయ్యకు మంచి భోజనం కావాలి. ఫిల్టర్‌కాఫీతప్ప సహించదు. మీ వదినకు ఆఫీసులో పనితో కుదరదేమో' అంటుంది. నన్ను మీ బావగారిని వుద్దేశించి 'మీ యిద్దరూ ఒకరినొకరు చక్కగా అర్థంచేసుకున్నారమ్మా. మీగురించి నాకు దిగుల్లేదు. అన్నయ్యా, వదినా యింకా పూర్తిగా సర్దుకుపోలేదు. నీకంటె పెద్దవాడేకానీ పూర్తిగా చిన్నపిల్లాడి వ్యవహారం' అంది. నా మట్టిబుర్రకు అర్థంకాలేదు. కానీ అమ్మమాటలనుబట్టి బావగారు బాగానే అర్థంచేసుకున్నారు. ఆయనే అన్నారు.

'లలిత అత్తయ్య మనసును ఏమాత్రమో నొప్పించింది. అందుకే ఆమె మనదగ్గరకు వచ్చారు. నువ్వూ లలితచేసిన పొరపాటే చెయ్యకు' అని.

ఆయన వూహ నిజమేనని నాకు కొద్దిరోజుల్లోనే తెల్సింది. అదీ అమ్మ మాటలద్వారానే తెల్సింది. అమ్మ వదినమీద ఫిర్యాదు చేయలేదన్నయ్యా! నేను ఒకసారి 'మధ్యాహ్నం పకోడీలు చెయ్యమ్మా' అని అడిగాను. దానికి అమ్మ,

'నువ్వూ, మీ వదినా నేను పదహారేళ్ళ బాలాకుమారిననుకుంటున్నారా ఏమిటే? నేనూ ముసలిదాన్ని అయిపోయాను. నావల్లకాదు' అంది. నాకు చాలా ఆశ్చర్యం వేసిందన్నయ్యా! అమ్మ ఎప్పుడూ మనకీ, నాన్నగారికీ వండిపెట్టడమే తన జీవితధ్యేయం అనుకుంటూ వచ్చింది. మనం కూడా అలాగే అనుకున్నాంతప్ప అమ్మ పెద్దదయిపోయింది. ఓపిక తగ్గిపోయింది అనుకోలేదు. నాన్నగారి మరణంతో అమ్మలోని వుత్సాహమంతా చల్లారిపోయింది. కానీ, మన అమ్మ యింకా మనకి వండిపెట్టడం తన కర్తవ్యం అనుకుంటూనే వుంది. కానీ, మీరిన ఆమె వయస్సు, నన్నగి





ల్లిన ఆమె ఓపిక, భర్తృవియోగం అనుభవిస్తున్న ఆమె మనసు అందుకు సహకరించటంలేదు. తన కర్తవ్యానికి, అసమర్థతకి మధ్య అమ్మ నలిగిపోతోంది. పిల్లలమయిన మనం ఆ విషయం గ్రహించి అమ్మకు విశ్రాంతి యివ్వవలసింది. అమ్మ 'ముసలిదాన్ని అయిపోయాను. నావల్లకాదు' అన్న ఒక్కమాటలో నాకివన్నీ అర్థమయ్యాయి. అమ్మ మనని పెంచింది అన్నయ్యా - చాలా ప్రేమగా, చాలా ఓర్పుతో. యిప్పుడు మనం అమ్మను పెంచవలసిన సమయం వచ్చింది అదీ ప్రేమతో, అంతే ఓర్పుతో'

"మైథిలీ! యిలా వచ్చి నాదగ్గర కూర్చో!"

అది వచ్చి నా పక్కన కూర్చుంది. దాని చేతులు నాచేతుల్లోకి తీసుకున్నాను. ఈ రెండు శరీరాల్లోనూ ఒకేరక్తం ప్రవహించకపోవచ్చుగాక. కానీ ఒక తల్లి పెంపకంలోని సంస్కారమే వుంది. అమ్మ నాకు ఒక జీవితాన్ని సంఘంలో ఒక స్థానాన్నేకాదు, ఒక బంగారు బొమ్మని, అనురాగవల్లిని చెల్లిగా యిచ్చింది.

"ఏంటన్నయ్యా?" అనడిగింది అది అమాయకంగా.

"మైథిలీ! నువ్వు నాకంటె చిన్నదానివయినా, పరిస్థితిని బాగా అర్థంచేసుకున్నావే. నేను బుద్ధిలేని వెధవని. అమ్మని చాలా కష్టపెట్టాను"

"నువ్వా!" మైథిలి ఆశ్చర్యపోయింది.

"నేనంటే నేను ఒక్కడినే కాదు. మీ వదినా, నేనూ కలిసి. మీ వదినకు వుద్యోగంవచ్చేవరకూ ఏ సమస్యా రాలేదు. అమ్మా, తనూ చాలా ఆదర్శవంతమయిన అత్తాకోడళ్ళుగా పేరుతెచ్చుకున్నారు. 'అత్తాకోడళ్ళంటే పామూ, ముంగిసలు... ఆ సంబంధంలో సాక్షాత్తూ దేవతలే వున్నా విరోధం తప్పదు' అనే వర్ధన్‌గాడు కూడా వీళ్ళిద్దరినీ చూసి అభిప్రాయం మార్చుకోకతప్పలేదు. 'మా అత్తగారు కోడలిని కూతురిలా చూస్తుందని మీ వదిన అందరికీ చెప్పుకుని గర్వపడింది. 'చదువుకున్నదేగానీ యిసుమంతయినా అతిశయం లేదని' అమ్మా ఆనందపడింది. పాపాయి పుట్టినప్పటినుండి లలితకు కొంత తిక్క మొదలయింది. దాని **తిండికీ, బట్టలకూ, స్నానానికి, నిద్రకూ అన్నిటికీ ఒక టైంటేబిల్ తయారుచేసి** దాన్ని తను అనుసరించటమేగాక మా అందరితోనూ అనుసరింపచేసింది. లలితకు తల్లిగా... పాపాయిపట్ల తనకు చాలా బాధ్యతవుంది. కానీ అమ్మ దానికి నాయనమ్మ. నన్నూ నిన్నూ నీ కొడుకునూ పెంచిన అనుభవం వుంది. లలిత ఆ విషయాన్ని విస్మరించింది. అమ్మ మనసును గాయపరిచింది. అమ్మను ఆయా స్టేజికి దిగజార్చింది. అమ్మ సంగతి నీకు తెల్సుగా. దీనినంతటినీ సహించింది. లలిత చదువుకున్నది. పిల్లల పెంపకం నాకంటె లలితకు బాగా తెలుసు అని కోడలి అభీప్రాయిత్యాన్ని సమర్థించింది. అమ్మే కనుక యితర స్త్రీల వంటిదయితే ఆనాడే అత్తాకోడళ్ళమధ్య తగాదాలు వచ్చివుండేవి. కానీ, అమ్మ తన సహనంతో ఆ పరిస్థితి రానివ్వకుండా ఆపగలిగింది.

ఇంతలో మీ వదినకు వుద్యోగం వచ్చింది. అప్పుడే అసలు కష్టాలు ఆరంభమయ్యాయి. లలితకు పాపాయిని చూసే ఓపికా, తీరికా లేవు. ఆ బాధ్యతను అమ్మకు అప్పగించింది. యిన్నాళ్ళూ ఆ పనులేవీ అమ్మని తాను చెయ్యనివ్వలేదనే సంగతి మర్చిపోయింది. వంటని సింప్లిపై చేయటం మొదలుపెట్టింది. నేను తినలేకపోతుంటే అమ్మ తల్లడిల్లిపోయింది. 'నేను వంటచేస్తాను. మీరు పాపాయిని చూడండి' అంటూ అమ్మకు ఆజ్ఞలు జారీచేసింది. లలిత వంట నేను తినలేను. పాపాయి ఆలనా, పాలనా అమ్మ చూడలేదు. దానిది పాకేవయసు. ఒకచోట తిన్నగా వుండదు. పాపాయికి కాపలా కాసీ, కాసీ అమ్మ ఎండిపోయిందంటే నమ్ము. మామూలుగా లలిత మంచిదే మైథిలీ! ఎదుటివారి కష్టాలు అర్థంచేసుకునే మనిషి కూడా! కానీ తాను వుద్యోగం చేయాలనే దుగ్ధ, పాపాయిని తాను చూసుకోవటం మొదలుపెడితే తనకి వుద్యోగం చేసే అవకాశం వుండదేమో అనే స్వార్థం కలిసి యిలా ప్రవర్తించింది. నేను అమ్మని పాపాయి బాధ్యతనుండి తప్పించాలని చూస్తే తల్లీ కొడుకులం ఒకటై తనతో వుద్యోగం మానిపించాలని కుట్రచేస్తున్నామేమోనని అపోహ. అమ్మ ఆ రాజకీయం అంతా



తట్టుకోలేక నీదగ్గరకు వచ్చేసింది.

మైథిలి నేను చెప్పినదంతా ఓపికగా వింది.

"అయితే మీ బావగారు వూహించింది నిజమేనన్నమాట. చూడరా... అమ్మ నాతో ఏం చెప్పలేదు" అంది.

ఇంతలో ఎప్పుడు నిద్రలేచిందో ఏమో, అమ్మ మా యిద్దరికీ టీలు చేసి పట్టుకొచ్చింది.

"ఏమిరా? అన్నా చెల్లీ యింత సఖ్యంగా కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు? వూరెళ్ళి పోతున్నావేమిటీ?" అనడిగింది.

"చూడమ్మా! తెలివి నీ ఒక్కదాని సొత్తే అనుకోకు. నేను ఒక్కడినే వూరు వెళ్ళబోవ టంలేదు" అన్నాను.

"బాబి లేచినట్టున్నాడు. పాలు యిచ్చివస్తాను" అని మాటమారుస్తూ అమ్మ వెళ్ళిపోయింది.

"చూడవే... సమాధానం చెప్పటం యిష్టంలేక వెళ్ళిపోయింది " అని మైథిలితో ఫిర్యాదుచేశాను.

అది నావంక జాలిగా చూసింది.

"అమ్మ చూడరా అన్నయ్యా! టీ చేసి పట్టుకొచ్చింది. ఎంత వయసుమీరినా సోమరిగా కూర్చోలేదుకదా! పనులు చేస్తుందికానీ ఆ పనులు అమ్మ సంతోషంగా చేయగలిగినవై వుండాలి. డ్యూటీగా తప్పనిసరిగా చేసినట్టయితే అలసిపోతుంది. అది సహజంకూడా"

నేను చెంపలు వాయించుకున్నాను.

"నాకర్థమయిందే బాబూ! నాకు బుద్ధొచ్చింది. నా పెళ్ళానికి బుద్ధిలేదు సరే... కానీ, దానికి అమ్మ నన్ను శిక్షిస్తుందేమిటి?"

★ ★ ★

"మీ స్నేహితుడు వర్ధన్ మా ఆఫీసుకు ఫోన్‌చేశాడయ్యా! నువ్వు యిక్కడికని కట్టుబట్టలు సారి! తన బట్టలతో బయలుదేరావట. 'నాలుగురోజులయింది. కబురూ, కాకరకాయా లేదు. నేనూ, లలిత కంగారుపడుతున్నాం' అని చెప్పాడు. భయమేమీ లేదు. క్షేమంగా చేరావు. యిక్కడ సుఖంగా వున్నావని చెప్పాను. వీలయితే నిన్నొకసారి ఫోనుచెయ్యమని చెప్పాడు" అన్నారు బావగారు.

"అదేంట్రా! వదినతో చెప్పలేదూ వచ్చే ముందు?" అని ఆశ్చర్యపోయింది మైథిలి.

"పెద్దగా అరవకు. అమ్మ వింటుంది. చెప్పలేదు. టైములేదు వచ్చేశాను" అన్నాను.

"దేనికి టైములేదు?" అంది ప్రోబ్‌చేస్తూ.

"దేనికో ఒకదానికిలే. నోర్మూసుకో. అమ్మ వింటుంది. తర్వాత చెప్తాను..."

ఇంతలో అమ్మ బాబిని ఎత్తుకుని ఆ గదిలోకి వచ్చింది.

"అమ్మా! రేపు ఉదయం మనిద్దరం యింటికి వెళ్ళిపోతున్నాం" నేను అంతక్రితం చేసుకున్న నిర్ణయాన్ని తాత్కాలికంగా మరచి అన్నాను నేను. అమ్మ సమాధానం యివ్వకుండా బాబితో ఆడుకుంటోంది. మైథిలి నావంక అర్థవంతంగా చూసింది. అమ్మవైపు తిరిగి,

"ఏం? అమ్మ నాదగ్గర వుండకూడదా?" అంది బుంగమూతి పెట్టి అలక ప్రదర్శిస్తూ. అమ్మ మనసులో ఏముందో తెలుసుకోవాలని దానికీ ఆత్రుతగానే వుంది.

"నువ్వు నోర్మూసుకో. వాళ్ళ కుటుంబ విషయాలు మనకెందుకూ?" అని బావగారు దాన్ని కోప్పడ్డారు.

"హుఁ!" అని లేచి "నేను పోయి కాఫీలు కలుపుకొస్తాను" అంటూ వెళ్ళిపోయింది.

అమ్మ మౌనంగా వుండిపోయింది. బావగారు లేచి వెళ్ళిపోబోతుంటే నేను చేయిపట్టుకుని ఆపాను.

"మీరు చెప్పండి బావగారూ! అమ్మకి చెప్పండి. నేనూ, లలితా అమ్మను చాలా బాధపెట్టాం. క్షమాపణ అడగటానికి నాకేం సిగ్గుగా లేదు. వచ్చెయ్యమనండి"

మైథిలి బావగారికి నిన్నటి మా సంభాషణ అంతా చెప్పినట్టుంది. ఆయన వెంటనే,

"పాపాయిని అత్తయ్య పెంచలేదు కృష్ణా! లలితకు బుద్ధిలేదు. యిప్పుడది వుద్యోగం చెయ్యకపోతే నష్టం ఏమిటట?" అన్నారు వినుగ్గా.

ఈ విషయంలో నేను బావగారితో ఏకీభవించను. లలిత ఆధునిక స్త్రీ. ఆమె కూడా




మాలాగే తన చదువుకూ, ప్రతిభకూ గుర్తింపు కోరుతుంది. లలిత వుద్యోగవిషయమై నేను ఆమెను తప్పుపట్టను. కానీ తన కూతురి బాధ్యతను మా అమ్మమీదకు నెట్టి, ఆమె దానిని నిభాయించలేనందుకు విమర్శిస్తోందే... అదిమాత్రం తప్పు. కానీ, నా అభిప్రాయాలు వెల్లడించటానికి యిది సమయమూ కాదు, సందర్భమూ కాదు.

"బావగారూ! యిప్పుడు పాపాయి సమస్య తీరిపోయింది. రజని బేబీ కేర్‌సెంటర్ ప్రారంభించింది. పాపాయినీ, రాములినీ అక్కడ వదులుతున్నాం. నేను వుదయం యిద్దరినీ స్కూటరుమీద అక్కడ దించుతాను. లంచ్‌అవర్‌లో వెళ్ళి పాపాయిని చూసివస్తాను. మా ఆఫీసుకు వాళ్ళిల్లు దగ్గరేలెండి. సాయంత్రం నేను వచ్చేటప్పుడు తిరిగి తీసుకువస్తాను. అయినా వర్ధన్, రజనీ మనవాళ్ళు. వాళ్ళదగ్గర పాపాయి క్షేమంగా వుంటుంది"

బావగారు అమ్మ అభిప్రాయం కోసమా అన్నట్టు పక్కకు తిరిగారు. అమ్మ చటుక్కున బాబిని వదిలి, "మధ్యాహ్నం జంతికలు చేశాను. కాఫీతోపాటు అవి కూడా తెమ్మనిచెప్తాను మైథిలికి" అంటూ లోపలకు వెళ్ళిపోయింది.

నేను నిస్సహాయంగా ఆయనదెస చూశాను. ఆయన నా భుజంతట్టి "టేకిట్ ఈజీ కృష్ణా! రా! కాఫీ తాగి అలా బయటకు వెళ్దాం..." అంటూ నన్ను బయల్దేరదీశారు.

★ ★ ★

బావగారూ, నేనూ నడిచి ఒక ఖాళీగావున్న పార్కులో చేరాము. కూర్చున్నాక బావగారు అడిగారు

"అసలేమిటి గొడవ?"

ఆయన దేన్ని గురించి అడుగుతున్నారో అర్థం కానంతటి మూర్ఖుడిని కాదు. అందుకే ఎదురు ప్రశ్నించాను.

"మీకు మైథిలి చెప్పలేదా?"

"మీ చెల్లెలు చెప్పకుండా వుంటుందటోయ్, నీ పిచ్చిగానీ. అసలే వాగుడు కాయ గదా! చెప్పింది. నీ తక్షణ కర్తవ్యం ఏమిటి? అనడుగుతున్నాను"

"ఏమీ లేదు"

"ఏమీ లేదా? అంటే ఏమిటి?"

నేను మాట్లాడలేదు.

"మీ అమ్మగారితో పాటు నువ్వూ యిక్కడే సెటిల్ అయిపోతావా ఏమిటి?" నేను ఆయన్ను చురుగ్గా చూశాను.

ఆయన నా భుజం ప్రేమగా తట్టారు.

"జోక్ చేశాను లేవోయ్. అంత తీక్షణంగా చూడనక్కర్లేదు. అత్తయ్య యిక్కడ వుండలేరు. ఆమె మనిషైతే యిక్కడే వున్నారు కానీ మనసంతా నీ చుట్టూ, పాపాయి చుట్టూ తిరుగుతూ వుంటుంది. అక్కడ లలిత ధాటికి తట్టుకోలేరు. యిక్కడ మీ ఎడబాటునూ సహించలేరు. ఆమె మనఃస్థితి డోలాయమానంగా వుంది. అది కూడా అర్థం చేసుకోవాలి మనం"

"బావగారూ! అమ్మ మా యిల్లు వదలివచ్చేనరికి వున్న పరిస్థితి మారింది. ఈసారి వస్తే అమ్మకు పాపాయి బాధ్యత వుండదు. అది బేబీ కేర్ సెంటర్‌లో వుంటుంది గనుక. మా సమస్యల్లా పాపాయి సంరక్షణే. రజని పుణ్యమా అని అది తీరిపోయింది. యింకా యింటికి రావటానికి అమ్మకేమిటి అభ్యంతరం?"

ఆయన చేతులు తలక్రింద పెట్టుకుని గడ్డిలో పడుకున్నారు. "యూ ఆర్ ఏ ఫూల్ కృష్ణా!"

"అదేమిటండీ హఠాత్తుగా అంత మాట అనేశారు?"

"నిజమోయ్! పాపాయి సంరక్షణ ఒక సమస్య అని మనం సహేతుకంగా ఆలోచించి అంటున్నాం. అది నిజం కూడా. పాపాయి పుట్టి వుండకపోతే లలిత అత్తయ్య నెత్తిన ఆ పసిదాని బాధ్యత మోపి వుండేదికాదు. అత్తయ్య శారీరకంగా యింత క్రుంగిపోయి వుండేవారూ కాదు. నిన్ను వదలి అసలు వచ్చేవారూ కాదు. కానీ పాపాయి పుట్టింది. లలితకు వుద్యోగం వచ్చింది. అందువల్ల, ఈ సమస్య వుత్పన్నమయింది. దాని ఫలితంగా అత్తయ్యకూ, లలితకూ భేదాభిప్రాయాలు వచ్చాయి. బేబీకేర్ సెంటర్‌లో పాపాయిని వదలటం ద్వారా పాపాయి సంరక్షణ సమస్య పరిష్కారమయింది. కానీ, లలితకూ, అత్త

య్యకూ మధ్య చెలరేగిన భేదాభిప్రాయాలు అలాగే వున్నాయి కదా! యిప్పుడు సమస్య పాపాయికాదు. అత్తా కోడళ్ళ మనఃస్థితి. వాళ్ళిద్దరూ నీ జీవితంలోని వ్యక్తులు. నీకెంతో కావలసినవాళ్ళు. జీవితాంతమూ నీతో కలిసి వుండవలసినవాళ్ళు. వాళ్ళిద్దరి మధ్యా పరస్పరావగాహన లేకపోతే మీ ముగ్గురి జీవితాలూ సుఖంగా సాగవు. అది ఆలోచించుకో''

''లలిత తన తప్పు తెలుసుకుంది. బాధపడుతోంది'' అప్రయత్నంగా అనేశాను. ఎందుకన్నానో తెలియదు.

''ఆహా! అలాగా! ఆ మాట దాన్ని అత్తయ్యకు చెప్పమను. నువ్వు నాతో అనటంకాదు'' అన్నారు.

★ ★ ★

నేను వర్ధన్‌కి ఫోను చేశాను.

''ఏమయిపోయావురా?'' అన్నాడు ఫోను ఎత్తుతూనే.

''ఏమీ అయిపోలేదురా... అవను కూడా. నా జీవితంలో సంతోషమయిన క్షణాలన్నీ అమ్మ యిల్లు వదలటంతోటీ అయిపోయినట్టున్నాయి. యిక యిలా నిస్సారంగా నిర్జీవంగా నిస్సంతోషంగా...''

''ఆపరా బాబూ! నిస్సంతోషం అనే మాట లేదు. యివాళంతా 'ని'తో మొదలయ్యే విశేషణాలు వుపయోగించాలని నిశ్చయించుకున్నట్టున్నావు. అవునుగానీ ఆ విషయం అమ్మకి చెప్పావా?'' నా గొంతు ఒక క్షణం మూగపోయింది. నేను అమ్మ కడుపున పుట్టలేదు అనే మాట తల్చుకోవటం నాకే యిష్టం లేదు. ఇంకా బయట కూడా అంటానా?

''చెప్పలేదు వర్ధన్. చెప్పను కూడా'' అన్నాను దృఢంగా. వాడు సైకియాట్రిస్ట్. ఫోనులో కూడా నా గొంతులోని భావాన్ని గమనించి వుండాలి. వెంటనే మాట మార్చేశాడు.

''సరే! ఆ సంగతి వదిలెయ్! ఎప్పుడొస్తున్నారు?''

''అమ్మ వస్తానని అవటంలేదు వర్ధన్. మా మీద కోపంలేదు. అది అమ్మ స్వభావం కాదు. కానీ అమ్మ అభిమానవంతురాలు కదా! రావటం యిష్టం లేదనుకుంటా!''

''మరి నువ్వక్కడేం చేస్తున్నావు? మీ యింట్లో ఒక్కొక్కళ్ళే వెళ్ళిపోయి అక్కడ వుండి పోతారా ఏంటి? ఆయన మైథిలిని వదిలేస్తాడేమో చూసుకో''

''నీ జోకు ఏడ్చి, వేడి నీళ్ళతో ముఖం కడుక్కున్నట్టువుంది. ఫోను పెట్టెయ్యి, బిల్లు చాలా అయినట్టుంది. మా యింటికి వెళ్ళి లలిత సమాచారం కనుక్కునివుత్తరం రాయి''

నేను ఫోనుపెట్టేసి బిల్లు చెల్లించి బయటకు వచ్చేశాను.

రాత్రంతా నిద్రలేకుండా ఆలోచించాను. బావగారి మాటలు పదేపదే మనసులో మెదులుతున్నాయి. అమ్మకూ, లలితకూ మధ్య సదవగాహన ఎలాకుదురుతుంది? అందుకే కాబోలు పెద్దలు కాలుజారినా ఫర్వాలేదు. నోరు జారవద్దు అంటారు. నేను ఎన్నాళ్ళు మైథిలి యింట్లో వుండగలను? నా వుద్యోగం ఏమవుతుంది? లలితా, పాపాయి ఒంటరిగా ఎలా వున్నారో. వర్ధన్ వున్నాడని మనసుకు ఎంత ధైర్యం చెప్పుకున్నా కంగారుగానే వుంటుంది. లలిత చదువుకుంది. అమ్మ మనః స్థితి బాగానే అర్థం చేసుకుంది. కానీ తన తప్పును అంగీకరించటానికి ఆమెకు అహం అడ్డొస్తూ వుండివుండవచ్చు. అమ్మ బయటకు ప్రకటించకపోయినప్పటికీ లలిత గురించి మనసు కష్టపెట్టుకుని యిల్లువదలి వచ్చింది. నా దగ్గరా, మైథిలి దగ్గరా వుండనక్కర్లేదు కానీ, కోడలివద్దా అల్లుడివద్దా ఆ మాత్రం అభిమానం వుండటం సహజం.

లలితా, అమ్మా మళ్ళీ ఒక యింట్లో వుండటం సంభవమేనా? లేక నేను పిచ్చివాడిలా అసంభవమైన దాన్ని సంభవంగా మార్చాలని చూస్తున్నానా? అలా ఆలోచించటానికి నా మనసంగీకరించలేదు. ఏదో ఒకరోజు లలిత అహం భావపు తెరతొలగి, అమ్మను క్షమాపణ అడుగుతుంది. అమ్మ యింటికి వస్తుంది. నేను ఆరోజు కోసం ఎదురు చూస్తాను.




అలా అనుకున్నాక నాకు ప్రశాంతంగా నిద్ర పట్టింది.



**ఉ**దయం లేస్తూనే

"అమ్మా! యివాళ నేను వూరు వెళ్తున్నాను. లలితకేమయినా చెప్పాలా?" అనడిగాను.

మనసులో ఏమూలో యింకా ఆశ మినుకు మినుకుమంటూనే వుంది. రెండు రోజులుండరా! నేను కూడా వస్తాను అంటుందని దురాశ.

"మంచిది నాన్నా! వచ్చి వారం పైనే అయింది. అక్కడ లలితా, పాపాయీ ఒంటరిగా వున్నారు. అసలే వూరి చివర యిల్లు కూడాను" అంది లోపలకు వెళ్ళి తన పెట్టె తెరిచి అరడజను గౌన్లు తెచ్చి నా చేతిలో పెట్టింది.

"పాత కాలపు దాన్నిరా. నా సరదా కొద్దీ కుట్టాను. లలితకు నచ్చితే పాపాయికి వెయ్యమను"

అమ్మ తెచ్చిన గౌన్లు లలిత పాపాయికి వెయ్యకపోవటం అమ్మ యింకా మర్చిపోలేదు. నా మనసు బాధగా మూలిగింది. ఆ బాధ నా ముఖంలో ప్రతిఫలించి వుండాలి. అమ్మ నా చేతిని నిమిరి

"పెద్దవాడివి అవుతున్నావు నాన్నా! అన్నిటికీ మనసు కష్టపెట్టుకోకూడదు. ధైర్యంగా ఎదుర్కోవాలి" అంది.

నేను గౌన్లు విప్పి చూశాను. మా చిన్నప్పుడు అమ్మ యిటువంటివి మైథిలి కోసం చాలా కుట్టేది. ఆ రోజులు గుర్తుకు వచ్చాయి. "ఈ గౌన్లు వేస్తే పాపాయి మైథిలిలా వుంటుంది కదమ్మా!" అన్నాను అమ్మ ముఖంలోకే పరీక్షగా చూస్తూ.

"మేనత్త పోలికలు రావేమిట్రా" అంది చాలా మామూలుగా. అమ్మ ముందు నేను ఎప్పుడూ ఓడిపోతూనే వున్నాను.

ఎంతో ఆశతో యిక్కడకు వచ్చిన నేను, అమ్మ లేకుండానే, ఒంటరిగా, నిరుత్సాహంగా వెనక్కు బయలుదేరాను.

నేను యింటిముందు ఆటో దిగేసరికి లలిత ఆఫీసుకు బయలుదేరుతోంది. నా చేతిలో యింటి తాళాలు పెట్టి, నాతో ఒక్కమాట కూడా మాట్లాడకుండా ముందుకు సాగిపోయింది. వరండాలో పాపాయి, రాములూ ఆడుకునే స్థలం ఖాళీగావుంది. రజని 'ఒడి'లోకి వెళ్ళిపోయారా? లలితను వెనక్కు పిలిచి ఆ చెంపా, ఈ చెంపా వాయించాలన్పించింది. కానీ వెంటనే నా విచక్షణా జ్ఞానం పనిచేసింది. నాకు లలిత మీద కోపం వచ్చినట్టే లలితక్కూడా నా మీద కోపం రావొచ్చుకదా! ఒక్క మాటయినా చెప్పక గౌతమ బుద్ధుడి లెవెల్లో అర్ధరాత్రి యిల్లు వదిలి వెళ్ళాను. వెళ్ళాక ఒక్క వుత్తరం ముక్కయినా రాయలేదు. వర్ధన్‌కి ఫోను చేసి లలిత క్షేమ సమాచారాలు అడిగానేకానీ, ఆమెకు ఫోనయినా చెయ్యలేదు. వారం రోజుల తర్వాత హఠాత్తుగా వూడిపడ్డాను. ఏ భార్యకు మాత్రం కోపం రాదు?

ఇంట్లో గిన్నెలన్నీ శుభ్రంగా తోమి, బోర్లించి వున్నాయి. ఫ్రిజ్‌లో రెండు కమలాపళ్ళు, కొంచెం ద్రాక్ష, ఒక బ్రెడ్ వున్నాయి. బ్రెడ్ నాకు రుచించదు. పళ్ళు మాత్రం తిని నిద్రపోయాను. మధ్యాహ్నం లంచ్ అవర్‌లో లలిత వస్తుందని చూశాను. రాలేదు. బట్టలు వేసుకుని వర్ధన్ దగ్గరకు వెళ్ళాను. నా సందేహాలన్నింటికీ వాడు సమాధానం చెప్పాడు.

"రాములు మా సెంటర్‌లోనే పని చేస్తున్నది. పాపాయినీ ఆ పిల్లనూ స్కూటర్ మీద తీసుకువస్తానన్న నువ్వు వెళ్ళి చెల్లెలింట్లో తిష్ఠ వేశావుగదా! ముందు రెండు రోజులు లలిత శలవు పెట్టింది. తర్వాత వెళ్ళి పాపాయిని పుట్టింట్లో వదిలి వచ్చింది. పిన్ని ఏమందిరా?

ఎప్పుడొచ్చేదీ ఏమయినా హింట్ అయినా యిచ్చిందా?''

వాడి ప్రశ్నకు సమాధానంగా నేను తల అడ్డంగా వూపాను.

''నీ యింటికి రాను అని అమ్మ ఖరా ఖండిగా చెప్పలేదురా? నేను తనను అడిగిన ప్రతిసారీ సమాధానం దాటేస్తూ వచ్చింది. లలిత ప్రవర్తన అమ్మను చాలా నొప్పించి వుండాలి. లలిత పిలిస్తే తప్ప రాదేమో!''

''మీ యింట్లో అందరికీ ఒకరిమీద ఒకరికి ప్రేమాభిమానాలున్నాయిరా. అందువల్లనే లలిత పిన్ని నుండి పాపాయి సంరక్షణను ఆశించటం, పిన్ని లలిత మీద అలగటం, నువ్వు యిద్దరినీ బ్రతిమిలాడటం. మా యింట్లో ఆ గొడవ లేదు చూడు. అంతా ఎవరి డ్యూటీ వాళ్ళు చేస్తారు. ఎవరి స్వార్థం వాళ్ళు చూసుకుంటారు. మీ యింట్లో చిన్న భేదాభిప్రాయానికి యింత ప్రాముఖ్యతనిచ్చి యింత మంది మనసులు కష్టపెట్టుకుంటున్నారు. మా యింట్లో అభిప్రాయ భేదాలు. 'వే ఆఫ్ లైఫ్.' తమకు, తమ భావాలకు తప్ప యితరుల అభిప్రాయాలకు ప్రాముఖ్యత నివ్వరు. నేను ఎవరి పక్షమూ తీసుకోనఖ్ఖర్లేదు. ఎవరి గురించీ బాధపడనూ అఖ్ఖర్లేదు''

''బాబూ! నీ విశ్లేషణా శక్తి అపారం. దానికి నా జోహార్లు. అసలే సగం చచ్చివున్నాను. నీ ఉపన్యాసాలతో నన్ను పూర్తిగా చంపకు''

వాడు చాలా జాలిగా నవ్వాడు.

''నా సైకో ఎనాలిసిస్‌తో నిన్ను బాధపెట్టాను కదరా! మొట్టమొదటిసారి నా ఎనాలిసిస్ నన్ను బాధించిందిరా. నీ కలను నేను విశ్లేషించి వుండకపోతే మనందరం యింకొంచెం సంతోషంగా వుండేవాళ్ళమేమో!''

''లేదు వర్ధన్! అలా అనొద్దు. అనుకోవద్దు కూడా. ఐ హేవ్ ఆల్వేస్ బీన్ ప్రౌడ్ ఆఫ్‌యూ. నిజం తెలియటంవల్ల నా మనసుకు శాంతి లభించింది. నా కళ్ళుతెరుచుకున్నాయి కూడా. నేను ఒక మూర్ఖత్వంలోనుండి బయట పడ్డాను. ప్రేమించటం మా అమ్మ స్వభావం. ఇట్‌ఈజ్ హర్ సెకండ్ నేచర్. ఇది తెలిశాక ప్రేమ పట్ల నా అభిప్రాయం మారింది. ప్రేమ ఒక పరంపర. అయ్ వాంట్ ఇట్ టు బీ కంటిన్యూడ్. ప్రేమని అనుభవించి వూరుకోవటానికి నేను నిర్జీవ పదార్థాన్నికాదు. తిరిగి ప్రేమించటం నాకూ చేతనవును. కానీ, నాకు అది చాలదు. లలిత కూడా అమ్మని ప్రేమించాలి. అమ్మ ఔన్నత్యాన్ని గుర్తించాలి. అప్పుడు నాకు నిజమైన సంతృప్తి లభిస్తుంది.

వర్ధన్ చాలా సేపు మాట్లాడలేదు. తర్వాత అడిగాడు.

''కృష్ణా! పిన్ని అంటే నీకెప్పుడూ యిష్టమే కదరా!''

''అవును వర్ధన్... నీకెందుకొచ్చిందా అనుమానం?''

''కానీ... ఈ విషయం తెలిశాక నీ ప్రేమ రెట్టింపు అయిందా?''

నేను ఒక క్షణం పజిల్ అయిన మాట వాస్తవం. నిజమా? వర్ధన్ మళ్ళీ రెట్టించి అడిగాడు.

''మాట్లాడవేమిరా?''

''వర్ధన్! ప్రేమ రెట్టింపు అయ్యే ప్రశ్నే లేదు. అమ్మ అంటే నాకు ఎప్పుడూ ప్రేమే. అది తరగదు. పెరగటానికి అదెప్పుడో ఒక సాచ్యురేషన్ పాయింట్‌కి చేరుకున్నది. నేను మా అమ్మని చాలా ఎక్కువ ప్రేమించాను. యిప్పుడు అమ్మ మీద గౌరవమూ, కృతజ్ఞతా పెరిగి వుండొచ్చు. ప్రేమ కొత్తగా పెరిగింది లేదు, అదెప్పుడూ తరగ లేదు కనుక''

''ఒరేయ్! నువ్వు లలిత తరఫునుండి ఆలోచించటంలేదు. మీ అమ్మ పట్ల నీకు ప్రేమ వుండాలి. వుంటుంది. అది సహజం. లలితకు మీ అమ్మపట్ల ప్రేమ వుండాల్సిన అవసరం లేదురా. గౌరవం వుంది. చాలా మంది కోడళ్ళ కంటే ఎక్కువే వుంది. నువ్వు నీ మనసులోకి తొంగి చూసుకో కృష్ణా! నీకే తెలుస్తుంది. నీకు నీ గురించిన నిజం తెలుసు. అందులో పిన్ని గొప్పతనం తెలుసు. అందువలన నీకు ఆమె ఒక అపురూపమయిన వ్యక్తిగా గోచరిస్తోంది. లలిత నిన్నగాక మొన్న మీ యింటికి వచ్చింది. మీ అమ్మకు మీ పట్ల గల ప్రేమ, అభిమానమూ, ఆమె అపురూప వ్యక్తిత్వమూ మీ అన్నాచెల్లెళ్ళ వల్ల లలిత వినివుండవచ్చు కానీ, పిన్ని ప్రేమలోని మాధుర్యాన్ని ఆమె





పూర్తిగా అనుభవించలేదు. అంత సమయమూ, అవకాశమూ ఆమెకు లభించలేదు. అందువల్ల పిన్ని వ్యక్తిత్వం లలితకు ఏం తెలుస్తుంది? ఎలా తెలుస్తుంది?"

మీ అమ్మా, నాన్నా కట్నం తీసుకోలేదు. ఈమధ్య చాలామంది తీసుకోవటంలేదు. పిన్ని మా అమ్మలాగ చీటికీ మాటికీ కోడలిని సాధించదు. నిజమే. కానీ చాలామంది కోడళ్ళను సాధించరుకూడా. వాళ్ళలో పిన్ని కూడా ఒకతె. చాలామంది కోడలి జీతాన్ని కొంగున ముడివేసుకుని మనవరాలి ఆలనా, పాలనా చూస్తారు. పిన్ని లలిత జీతమూ ఆశించలేదు. పాపాయి బాధ్యతా స్వీకరించలేదు. పైగా పిన్ని లాంటి వాళ్ళకు డూప్లిసిటీ రాదు. కోడలు లేనపుడు మనవరాలిని అలక్ష్యం చేసి, కోడలి ఎదుట ముద్దు చేసే వ్యక్తి కాదు పిన్ని. లలిత వంటి సాధారణమయిన ఆడపిల్లకి పిన్ని వ్యక్తిత్వం అర్థం కావాలని ఆశించటం అత్యాశ కృష్ణా! ఆమె వ్యక్తిత్వం అర్థం కాకుండా నీ భార్య ఆమెను ప్రేమించాలని ఆశించటం దురాశ. పిన్ని నీకు అమ్మ కానీ, లలితకు కాదే! లలిత వాళ్ళ అమ్మ పట్ల నీకు యింత ప్రేమవుందా?"

"ఏయ్! వర్ధన్! ఆగాగు. వూరుకుంటున్నానని వూరికే బాదెయ్యకు. మా అమ్మా, లలితా వాళ్ళమ్మా ఒకటా? మా అమ్మతో ఆవిడకు పోలికేమిటి? 'భర్త మనసు ఎరిగి మసలుకో. అత్తగారిని నొప్పించకు. ఆవిడకు యిష్టమయినట్టు మసలుకో. ఆమె పెద్దది. ఒక మాటన్నా పట్టించుకోకూడదు. ఆవిడ చేతిలో పని అందుకుని చెయ్యాలి. ఆవిడకు వీలయినంత విశ్రాంతి యివ్వాలి' అని మా అమ్మ మా చెల్లికి చెప్తుంది. లలితా వాళ్ళమ్మ ఏం చెప్తుందో తెలీదుగానీ లలిత పుట్టినింటినుండి వచ్చిన ప్రతిసారీ అమ్మని, చెల్లినీ శత్రువుల్లా చూస్తుంది. గాడిదకూ, గుర్రానికీ పోలికేమిటి?"

"ఆ అహం భావమే వద్దు. నీకు మీ అమ్మెంత గొప్పో, లలితకూ వాళ్ళమ్మ అంతే గొప్ప"

"అయితే ఏంటి?"

"లలితకు నిజం చెప్పు. మీ అమ్మ గొప్పతనం ఆమెకు అర్థం కానీ"

"చెప్పను వర్ధన్! నువ్వు పదిసార్లు నీ గురించిన నిజం, నీ గురించిన నిజం అనొద్దు. ఆ నిజాన్ని నేను మర్చిపోవాలనుకుంటున్నాను. నిన్ను కూడా మర్చిపొమ్మని వేడుకుంటున్నాను. నేను మా అమ్మ కొడుకుని. ఈ జీవితానికి యిక యిదే నిజం"

"మరి లలితకు పిన్ని ఔన్నత్యం ఎలా అర్థమవుతుంది?"

"మా అమ్మని తనకు పరిచయమయిన వ్యక్తిగానే లలిత ప్రేమించాలి. మా అమ్మ అందరి అమ్మల్లాగ నా ముందు ఒకమాట, కోడలి ముందు ఒక మాటా అనలేదే! మనవలకు బట్టలు కుట్టించి వూరందరికీ గొప్పలు చెప్పుకోలేదే! పాపాయి బాధ్యతను అల్లాటప్పాగా తీసుకోలేదు. చాలా సీరియస్‌గా తీసుకుంది. అందుకే అలసిపోయింది. ఆమె ధైర్యంగా, నిజాయితీగా తన అశక్తతను తెలియచేసింది. ఈ ఒక్క గుణం చాలు మా అమ్మని ఆరాధించటానికి.

"మూర్ఖుడివిరా నాయనా!" అన్నాడు వర్ధన్ చేతులు జోడించి.

"థాంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్"

★ ★ ★

ఆ రాత్రి నేనే లలితతో రాజీకి వచ్చాను.

"సారీ లలితా! నీతో చెప్పకుండా వెళ్ళటం తప్పే. కానీ, నువ్వు నిద్రపోతున్నావు. డిస్టర్బ్ చేయటం యిష్టంలేక వెళ్ళిపోయాను"

"అంత అర్ధరాత్రి వెళ్ళవలసిన అవసరం ఏమొచ్చింది? ఏ టెలిగ్రామూ రాలేదు కదా!"

"రాలేదు లలితా! కానీ అమ్మ గుర్తుకు వచ్చింది. వెంటనే చూడాలన్పించింది. ఆ ఆలోచన నన్ను నిలవనివ్వలేదు"

"అందుకని వర్ధన్ గారింటికి వెళ్ళి ఆయన బట్టలు తొడుక్కుని ఆయన దగ్గర డబ్బు తీసుకుని పారిపోయారు. ఎలా అర్థంచేసుకోవాలి మిమ్మల్ని?"

"సారీ లలితా! వెరీసారీ! యింకెప్పుడూ అలా ఫూల్‌లా ప్రవర్తించను"

"లేదండీ... మీమీద కోపంలేదు. కానీ మరీ నన్ను పరాయిగా చూస్తున్నారు. ఉదయం లేచి మీరు కనపడక ఎంత తల్లడిల్లిపోయానో

మీకెలా చేస్తే అర్థమవుతుంది. అదృష్టవశాత్తు కొద్ది సేపట్లోనే వర్ధన్ గారొచ్చి మీరు వూరు వెళ్ళారని చెప్పబట్టి సరిపోయింది. లేకుంటే ఏమయివుండేదాన్నో''

ఇక ఈ టాపిక్ మార్చకపోతే లాభం లేద న్పించింది.

''పాపాయిని మీ యింట్లో వదిలావేం లలితా? దాన్ని రజని 'ఒడి'లో వేద్దామనుకున్నాంగా''

''అవును కానీ మీరు లేరు కదా! రాములినీ, పాపాయిని ఎవరు తీసుకువెళ్తారు? నాకు ఏం చెయ్యాలో తోచక అమ్మ వద్ద వదలివచ్చాను''

''అది లేక యిల్లు కళావిహీనంగా వుంది లలితా! దాని ఉంగా... ఉంగా విన్పించక ప్రపంచమంతా మూగపోయినట్టు వుంది''

''ఈ శని ఆదివారాలల్లో వెళ్ళి తీసుకు వచ్చేద్దాం లెండి. మా అమ్మకి కూడా ఓపికలేదు'' అంది.

నాకు వెంటనే అడగాలన్పించింది ''మరి మా అమ్మకేనా ఓపిక వున్నది?'' అని. కానీ వారంరోజుల వియోగం తర్వాత రాత్రి రాజీకి వస్తోన్న భార్యకు కోపం తెప్పించే మూర్ఖుడెవడూ వుండడు కదా!

★ ★ ★

ఉదయం లలిత లేచేసరికి ఫిల్టర్‌లో కాఫీ పొడివేసి, గ్యాస్ మీద నీళ్ళు వేడిచేస్తున్నాను.

''మీకు గ్యాస్ స్టౌ వెలిగించటం కూడా తెలుసునే. ఎందుకు వేడినీళ్ళు కాస్తున్నారు?''

''కాఫీ వేస్తాను లలితా!''

''మీరా? యిన్ని నీళ్ళతోనా? ఈ నీళ్ళతో నలుగురు మనుమలు తలంటు పోసుకోవచ్చు తెలుసా?''

''తెలియదు... ఇప్పుడు చెప్పావుగా. తెలుసుకుంటాను. నీళ్ళు తగ్గించి పెట్టాలంటావు. ఎన్ని పెట్టాలో కొలత చెప్పు''

''నావల్ల కాదు బాబూ! అయినా మీరు కాఫీ చెయ్యటమేమిటి? ఎవరయినా వింటే నవ్వుతారు?''

''ఎందుకు నవ్వుతారు లలితా? నాకు ఫిల్టర్ కాఫీ యిష్టం. నువ్వు చెయ్యి నేను తాగుతాను అనటం దుర్మార్గం కదా! యిన్నాళ్ళూ నేను యిలా ఆలోచించలేదు. యిప్పుడాలోచిస్తున్నాను. అమ్మకి నేనెప్పుడూ వంట పనిలో, యింటిపనిలో సహాయం చెయ్యలేదు. ఆ ఆలోచనరాలేదు. నీకు సహాయం చెయ్యాలని అన్పించింది. ముఖ్యంగా నువ్వు వుద్యోగంలో చేరినపుడు. యింటికీ, వుద్యోగానికీ మధ్య నువ్వు నలుగుతోంటే చాలా జాలి కల్గింది. కానీ అమ్మ నవ్వుతుందేమోననే బిడియంతో నేను నీకు సహాయం చేయలేదు''

''మరి యిప్పుడు? అమ్మనవ్వదని తెల్సిందా? మీరు బిడియపడటం మానేశారా?''

''రెండూనూ!''

''అదెలా కృష్ణా! మీరు బిడియపడరని మీకు తెలుస్తుంది. అత్తయ్య నవ్వరని మీకెలా తెల్సు?''

''తెలుసు లలితా! అమ్మ ఎలా ఆలోచిస్తుందో నాకిప్పుడు పూర్తిగా అర్థమయింది. అందుకే అంత ధైర్యంగా చెప్తున్నాను. ప్రతి మనిషికీ ఒక 'ఐడియల్ హి' నో 'ఐడియల్ షి' నో వుంటారు కదా! మగవాళ్ళకి రాముడో, ధర్మరాజో, భీష్ముడో, సునీల్‌గవాస్కరో, బోరిస్ బెకరో ఎవరో ఒకరు. ఆడవాళ్ళకు సీతా, సావిత్రి, అనసూయా, దమయంతీ, నీలాంటి మోడరన్ స్త్రీలకు ఝాన్సీలక్ష్మి, ఇందిరాగాంధీ అలా అన్నమాట. మా అమ్మ 'ఐడియల్ షి' ఎవరో నిన్ననే నాకు తెల్సింది. తన పెట్టెలో బుక్కు దొరికింది. అది చదివి తెలుసుకున్నాను''

''ఎవరావిడ?'' లలిత గొంతులో కుతూహలం.

''దమయంతి''

లలిత నిరుత్సాహపడింది. ''ఏమిటట ఆవిడ గొప్పతనం?''

''అబ్బో! చాలా వుంది. కానీ నీకు చెప్పితీరాలి. స్టౌ ఆర్పెయ్యి. పద... హాల్లో కూర్చుందాం''

''చాల్లెండి... మీరు ఆఫీసుకు వెళ్ళరా? నేను బ్యాంకుకు వెళ్ళొద్దా?''

''వద్దు... ముందు దమయంతి గురించి విను. ఆఫీసులూ, బ్యాంకులూ ఎక్కడికీపోవు.

సెలవు పడేద్దాం"

★ ★ ★

"దమయంతి అంటే నలుడి భార్య దమయంతి కాదు లలితా! గోపీచంద్ రాసిన 'చీకటి గదులు' అనే అసంపూర్తి నవలలో ఒక స్త్రీ పాత్ర. ప్రేమ అనే ఆయుధంతో అందరినీ జయించి. బంధించిన ధీమంతురాలు దమయంతి.

కృష్ణస్వామి అనే లాయరుగారి రెండవ భార్యగా మనకి పరిచయం అవుతుంది. ఆవిడ ఎంత గొప్ప మనిషంటే వాళ్ళ వంటవాడు యీమె స్వభావాన్ని వెంటనే పసిగట్టేస్తాడు. అందుకే ధైర్యంగా ఆమె సవతి జానకమ్మగారి గుణగణాలను ఈ కొత్త పెళ్ళికూతురి ముందు వర్ణిస్తాడు. దమయంతికి ఈర్ష్య కలగదు. అసూయకలగదు. నిర్మలంగా వింటుంది. ఎంతో కుతూహలం కన్పరుస్తుంది. తన భర్తా, సవతీ వాదులాడుకున్న దృశ్యాలను వూహించి నవ్వుకుంటుంది. జానకమ్మ తల్లి తన భర్త బిడ్డలను (ఆమెకు కూతురి బిడ్డలు) తీసుకుపోయిన సన్నివేశాన్ని తల్చుకుని ఏడుస్తుంది. ఆవిడ స్థితిలో నేనున్నా అదే చేసేదాన్ని అంటుంది. అప్పటి గోపాలం (సవతి కొడుకు) హృదయస్థితిని తలుచుకుని ఏడుస్తుంది. దమయంతి పాత్రలోని ఔన్నత్యం యిదే లలితా! ప్రతి మనిషి స్థానంలోనూ, తనను వూహించుకుని, వారి హృదయభావాలను తాను అనుభవిస్తుంది. అందువల్లనే ఆమె అందరినీ వారి బలహీనతలతోసహా ప్రేమించగలుగుతుంది.

తన సవతి తల్లిని తానూ తల్లిగా స్వీకరిస్తుంది. పెళ్ళి బట్టలతో ఆమె వుండే పల్లెటూరు వెళ్ళి 'నేనమ్మా! నీ కూతుర్ని. నిన్నూ పిల్లలను తీసుకువెళ్దామని వచ్చాను' అంటూ భర్త తరఫున క్షమాపణలు కోరుకుంటుంది. నీకూ, నీ పిల్లలకూ ఎటువంటి అపకారమూ రానివ్వను అని ప్రమాణం చేసి, తదనుగుణంగా పిల్లల తండ్రి కృష్ణస్వామిగారిచేత ఆస్తికీ, తనకూ ఏ సంబంధమూ లేదని రాయించి యిస్తుంది. ఆమె ఆ ప్రమాణాన్ని తన జీవితాన్ని పణంగా పెట్టి కాపాడుకుంటుంది. ఆమె అనారోగ్యానికీ మరణానికీ పరోక్షంగా ఆ ప్రమాణమే కారణం. కానీ, దానిని ఆమె ఎట్టి పరిస్థితుల్లోనూ ఉల్లంఘించలేదు. ఆ విధంగా ఆమె తన మంచితనంతో రత్నమ్మగారిని (జానకమ్మ తల్లి) శిక్షిస్తుంది. రత్నమ్మగారు తాను విధించిన షరతుకు తామే దురపిల్లేలా చేస్తుంది. ఆవిడ బాధ చదువుతుంటే మనకు మహాభారతంలో సత్యవతి భీష్ముణ్ణి తన ప్రతిజ్ఞ సడలించుకొమ్మని వేడుకోవటం స్ఫురిస్తుంది.

సవతి కొడుకు గోపాలం ఆమె మీద పెత్తనం చెలాయిస్తాడు. మారాం చేస్తాడు, విసిగిస్తాడు. అతనేమి చేసినా ఆమెకు సంతోషమే. విసిగించిన కొలదీ ప్రేమిస్తుంది. అమ్మమ్మ మాట విని గోపాలం ఆమెను పిన్నీ అని పిలుస్తాడు. అలాగే బాబూ! నీ యిష్టం అంటుంది. తిరిగి అతనే తనంతటతానుగా ఆమెను అమ్మగా అంగీకరిస్తాడు.

నవలలో ఒకచోట బ్రాహ్మణ, బ్రాహ్మణేతర వర్గవివాదాలు జరిగి రామనాథం అనే వ్యక్తి మరణిస్తాడు. దాని ప్రభావం గోపాలం మీద పడుతుంది. స్కూల్లో పిల్లలందరూ 'వీడి నాన్న కారణంగానే రామనాథం చనిపోయాడంటారు. ఎదుగుతున్న కొడుకు చిన్న హృదయంలోని మథనను ఆమె అర్థంచేసుకున్నట్టుగా మరొకరు చేసుకోలేరు. తండ్రి ఎంతమంచి వాడో, ఆయనను ఎందుకు గౌరవించాలో కొడుక్కి విడమరచి చెప్తుంది. కొడుకు ఎదుర్కొన్న అవమానకర పరిస్థితిని తల్చుకుని కన్నీళ్ళు కారుస్తుంది. భర్త 'కొడుకు వచ్చాడా?' అనడిగితే యిప్పుడు రావటమేమిటి? ఎప్పుడో వచ్చాడుగా అంటుంది. రత్నమ్మగారు గోపాలం ఎందుకు ఆలస్యంగా వచ్చాడని అడిగితే పిల్లల్తో ఆడుకుంటూ కూర్చున్నాడట అని అబద్ధం చెప్తుంది. ఆమెలోని ఈ చాకచక్యాలూ సమర్థత వల్లనే కుటుంబసభ్యుల మధ్య ప్రేమాభిమానాలు, సత్సంబంధాలు కడకంటా నిలిచాయి. మళ్ళీ ఏం జరగనట్టు భర్తకు రాత పనిలో సహాయానికి వెళ్తుంది. యిన్ని పనులు చేస్తున్నా తన మనసులోని కల్లోల తరంగాలను ఎవరికీ తెలియనివ్వదు. చివరకు ఆమె ఆ రాత్రి భోజనం చెయ్యలేదనే విషయం కూడా ఎవరికీ తెలీదు.

కానీ లలితా! యింత ప్రేమస్వరూపురాలయిన దమయంతి కూడా మా అమ్మలాగే చాలా





అభిమానధనురాలు. పట్టుదలగల మనిషి. రత్నమ్మ మనవల భవిష్యత్తును దృష్టిలో వుంచుకొని, అల్లుడు ధనసంపాదన విష యంలో అసమర్థుడని తెలిసి ఆస్తికీ, అతనికీ ఏసంబంధమూ లేదని రాయించుకున్న మాట నిజమే. దానికి ఆమె ఎంత పశ్చాత్తాప పడిన ప్పటికీ ఆ ఆస్తినుండీ పైసా దమయంతి స్వీకరించదు. తన నగలమ్మి, తన కన్నవా రింటినుండి డబ్బు తెప్పించి సంసారాన్ని నడుపుతుంది తప్ప పిల్లల ఆస్తిలో ఒక దమ్మి డీ ముట్టదు.

చివరకు తన ప్రాణాలు తీస్తోన్న జబ్బు సమయంలో కూడా ఆమె ఎంతో హుందాగా, ప్రవర్తిస్తుంది. ఎంతో బాధపడుతూ కూడా బాధ ఏమీలేనట్లు నటిస్తుంది.

ఇతరులకు అమృతంపంచి తాను హాలా హలం స్వీకరించే వ్యక్తి ఆమె. అందుకే ఆమెకు వచ్చిన జబ్బు మానసిక సంక్షోభంవల్ల రావొచ్చు అని డాక్టరు అన్నపుడు గోపాలం ఆశ్చర్యపోయాడు. 'ఈమె ఎన్ని సముద్రాలను తనలో యిముడ్చుకున్నదో. జీవితం ఒరిపిడివ ల్ల పుట్టిన హాలాహలాన్ని ఇతరులకు రవ్వంత యినా తెలియనివ్వకుండా ఎంత మ్రింగిందో! ఆమెలో ఎన్ని అగ్నిశిఖలు ప్రజ్వరిల్లుతు న్నాయో, అగ్ని కణాలను దిగమ్రింగి అమృతా న్ని యితరులకు పంచేవ్యక్తి ఆమె అను కుంటాడు సవతి కొడుకు గోపాలం.

జబ్బువల్ల కలిగే బాధను భరించలేక, దానిని బహిర్గతం చేసి తన ఆత్మీయులను బాధించటం యిష్టంలేక నిద్ర నటిస్తుంది. ఆమెకు యివ్వటమేగానీ, ఆశించటం తెలియ దు. రత్నమ్మగారు దమయంతి ఆస్తిని ఆమెక న్న బిడ్డకు చెందేలా పత్రాలు రాయించి దమయంతితో వేలిముద్ర వేయించాలని ప్ర యత్నిస్తారు. దమయంతి నిరాకరిస్తుంది రత్నమ్మగారు ఆస్తిని తన మనుమల పేర రాయించి దమయంతిని అవమానించింది. దానికి విరుద్ధంగా ప్రవర్తించి, ఆమెమీద, తన సవతి కొడుకు మీద ప్రగాఢ విశ్వాసం ప్రక టించి దమయంతి "స్వీట్‌గా రివెంజ్" తీర్చు కున్నదనిపిస్తుంది.

'ఈ కుటుంబంలోని వాళ్ళంతా ఎవరి ధోర ణిలో వాళ్ళు వెర్రివాళ్ళే కావచ్చు. ఈ వెర్రి వాళ్ళంతా కలిసి తన చెల్లెలిని వెర్రిదాన్ని చేసి వుంటెచ్చు. కానీ ఈ వెర్రిలో ఎంత ఆకర్షణ వుంది' అనుకుంటాడు దమయంతి అన్నగా రు. ఈ యింట్లో అడుగుపెట్టడం వల్ల తన చెల్లెలి జీవితం ధన్యత చెందింది అనుకుంటా డు.

ఆమె భర్తనుండి మణిమాణిక్యాలు పొంద లేదు. కృష్ణస్వామిగారు తనకు చేదోడువాదో డుగా వుండాలని ఆమెను వివాహం చేసుకు న్నారు. ఆమె ఆ బాధ్యతను అమోఘంగా నిర్వహించింది. దానికి కృతజ్ఞతగా ఆయన ఆమెకు కర్మచేయటంద్వారా తన జీవితంలో యిక ఓ స్త్రీకి స్థానంలేదన్ని తెలియచేశారు. అది ఆమె భర్తనుండి ఆశించకుండానే పొందిన ప్రతిఫలం.

ప్రేమను పంచటంద్వారా అంతకు మించిన ప్రేమ పొందవచ్చు! అనటానికి దమ యంతి జీవితం ఒక వుదాహరణ. గాంధీది అహింసా వుద్యమం అయితే దమయంతిది ప్రేమ వుద్యమం. తన జీవితంలో కలిసిన ప్రతి వ్యక్తినీ ప్రేమించిందామె! సన్నజాజులకు తమ సౌరభం తమకెంత తెలుసోగానీ, చుట్టుపక్కల వారంతా ఆ సౌరభానికి మత్తెక్కిపోతారు. దమ యంతి ఆ సన్నజాజులవంటిది. ఆమె ప్రేమ ఆ సన్నజాజి సౌరభం వంటింది.

ఈ నవల చదివేక నాకు అమ్మ స్వభావం అర్థమయింది లలితా! దమయంతిలానే మా అమ్మకు కూడా ప్రేమించటం స్వాభావికం. అందరి పరిస్థితుల్లోనూ తమని తాము వూహించుకుని సానుభూతిగా ఆలోచిస్తారు. యింత ప్రేమ స్వరూపులు ఆత్మాభిమానం ప్రశ్న వచ్చేసరికి మొండిగా ప్రవర్తిస్తారు. అమ్మ కూడా అంతే. నువ్వు పిలిస్తేగానీ మనింటికి రాదు చూడు. అంత ప్రేమమూర్తి అయిన అమ్మకి యింత పట్టుదల ఏమిటో అర్థంకాదు.

లలిత ఆలోచనలో పడింది. నాకు కావల సింది అదే. నేను ఆమెను ఒంటరిగా వదలి స్నానం వంకతో బాత్‌రూములో దూరాను.

మధ్యాహ్నం భోజనం అద్భుతంగా వున్నది. బంగాళదుంపల వేపుడు, సాంబారు, కొబ్బరి



పచ్చడి, అప్పడాలు.

"ఏం లలితా! ఈ తిండిపోతు మొగుడిని సంతోషపెట్టాలని నిర్ణయించుకున్నట్టున్నావే. అందుకే పెద్దలన్నారు 'మొగుడి హృదయంలోకి దారి వాడి పొట్టలోనుండి' అని" అన్నాను.

"లేదు కృష్ణా! నా మొగుడి హృదయంలోకి దారి హృదయంలోనుండే, పొట్టలోనుండి కాదు" అంది లలిత "నాక్కూడా దమయంతిలా, అత్తయ్యలా ప్రేమ ప్రతంలో నమ్మకం కుదిరింది. ఇకనుండి ప్రేమ నా ఆయుధం"

లలిత నాకంటికి ఎప్పుడూ అందంగానే వుంటుంది. యిప్పుడు అపురూపంగా కూడా తోచింది.

★ ★ ★

శనివారం లలితకు బ్యాంకు, నాకు ఆఫీసు అయిపోగానే మా అత్తగారి వూరికి బయలు దేరాం. పాపాయిని ఎప్పుడెప్పుడు చూస్తానా అని నా మనసు కొట్టుకుపోతున్నది. ఆ చిన్నప్రాణి ఈ ప్రపంచంలోకి వచ్చి సంవత్సరమయినా కాలేదు. యింత అనుబంధం ఎప్పుడు పెనవేసుకుందో ఏమో! అమ్మా, మైథిలీ, లలితా, పాపాయి ఒక్కొక్కరూ వరుసగా గుర్తు కొచ్చారు. ఓ స్త్రీ! నీకెన్ని రూపాలు!

మేము వెళ్ళేసరికి పాపాయి ముందుగదిలో ఒక్కత్తే ఆడుకుంటున్నది. రంగుతగ్గింది. చిక్కిపోయింది. మాసిపోయిన గౌనులో రేగిన జుట్టుతో అశుభ్రంగా వుంది. లలితను చూడగానే గబగబ పాక్కుంటూ వచ్చి చేతులు అందించింది. దానికి యిప్పుడిప్పుడే నడక వస్తోందిగానీ త్వరగా రావాలనుకున్నప్పుడు పాకుతూ వస్తుంది. లలిత దాన్ని గట్టిగా హృదయానికి హత్తుకుంది.

ప్రపంచంలోని అమ్మలంతా ఒక జాతి తమ బిడ్డలను ప్రేమించటం మాత్రమే తెలిసిన అపురూపమయిన జాతి. భార్య భర్తను ప్రేమించకపోవచ్చు. అన్న చెల్లిని ప్రేమించకపోవచ్చు. కానీ తల్లిని ప్రేమించని బిడ్డా, బిడ్డను ప్రేమించని తల్లీ చాలా అరుదు. లలిత లోని కొన్ని గుణాలు నాకు నచ్చకపోవచ్చు. మరి కొన్ని గుణాలు అమ్మకు నచ్చకపోవచ్చు. కాని పాపాయికి వాళ్ళ అమ్మ గుణగణాలతో సంబంధంలేదు. అమ్మ... అది చాలు. ప్రపంచంలో మొట్టమొదటి ప్రిఫరెన్సు అమ్మకే.

మా యింట్లో వున్నప్పుడు కూడా అంతే. రోజంతా అమ్మ దానికి చాకిరీ చేసేదా అది లలిత ఆఫీసునుండి రావటం చూస్తే చాలు అమ్మ దగ్గర క్షణం నిలిచేదికాదు. అమ్మ కూడా దాని 'ఏటిట్యూడ్'కి చిన్నబుచ్చుకునేది కాదు. అమ్మ అన్నాక, తొమ్మిది నెలలు మోసినందుకు ఆమాత్రం ప్రిఫరెన్సు లేకపోతే ఎలా నాయనా? అనేది.

మా అలికిడికి అత్తగారు లోపలినుండి వచ్చారు. మమ్మల్ని ఆవిడ యింత హఠాత్తుగా యిక్కడ వూహించినట్టులేదు.

"ఉదయంనుండీ తలనెప్పి లలితా! పాపాయికి స్నానం కూడా చేయించలేదు. పడుకుని వున్నాను" అన్నారు కొంచెం ఎపాలజెటిక్‌గా. లలిత సమాధానంగా ఏమీ మాట్లాడలేదు. తానే పాపాయిని స్నానం చేయించి, అమ్మ నాతో పంపించిన గౌనుల్లో ఒకటి వేసింది.

"ఈ గౌనులు నీకెక్కడ దొరికాయి లలితా!" అనడిగాను ఆశ్చర్యంగా.

"మీరు తెచ్చి మీ బీరువాలో పడేసుకున్నారుగా. నాకు చెప్పనయినా లేదు. ఇలా వస్తున్నామని మీ బట్టలు సర్దుతుంటే వాటిమధ్య కన్పించాయి" అంది లలిత, చాలా మామూలుగా యిదివరకటిలా ఆ గొంతులో ఆరోపణలేదు.

"సారీ లలితా! నీకు నచ్చవనుకున్నాను. అమ్మను కష్టపెట్టడం యిష్టంలేక తెచ్చాను గానీ నీకిచ్చే ధైర్యం చేయలేకపోయాను"

లలిత తప్పుచేసినదానిలా తలవంచుకుంది.

"అయామ్ సారీ కృష్ణా! అప్పుడు అత్తయ్య కొనితెచ్చిన గౌనులు తిరగగొట్టి మూర్ఖురాలిలా ప్రవర్తించాను" అన్నది.

'అయ్యో! లలితా! యీ మాటలు అమ్మకు చెప్పు. అమ్మ సంతోషపడుతుంది' అనుకున్నాను.

"ఇదేంగౌను లలితా! యిదేదో పాతగుడ్డలా





వుండే నలిగిపోయి'' అంది మా అత్తగారు.

ఆ వర్ధన్‌గాడు ఈమెను మా అమ్మతో పోలుస్తాడు. బుద్ధిలేని వెధవ!

''ఇది ఛీజ్‌కాటన్ గౌను అమ్మా! వేసవిలో పిల్లలకు గుచ్చుకోకుండా మెత్తగా, హాయిగా వుంటాయి. అత్తయ్య వాటిమీద చాలా చక్కటి చేతిపని కూడా చేశారు. ఇప్పుడది లేటెస్ట్‌ఫాషన్!''

ఆవిడ 'కూతురిలా మారిపోయిందేమిటా?' అన్నట్టు అనంతృప్తిగా చూశారు.

పాపాయి తల్లినిచూసిన ఉత్సాహంలో చాలా రాత్రివరకు నిద్రపోలేదు. అర్ధరాత్రెప్పుడో లలిత డొక్కలో దూరి పడుకుంది.

''ఇక ఏమయినా దీన్ని ఎక్కడా వదిలేది లేదు'' అంది లలిత దృఢంగా.



బస్టాండుకి వచ్చేక చెప్పింది లలిత.

''మైథిలీ వాళ్లింటికి వెళ్దాం. వీలయితే అత్తయ్యను తీసుకుని మనింటికి వెళ్దాం''

ఈ సుదినం ఎప్పుడో ఒకప్పుడు వస్తుందని నాకు తెలుసు. కానీ యింత త్వరలో వస్తుందని వూహించలేదు.

''నిజంగానా లలితా! మనస్ఫూర్తిగా అంటున్నావా యీ మాట?''

''అవును కృష్ణా! నేను తప్పుచేశాను. క్షమాపణ అడగటానికి నాకేం సిగ్గుగా లేదు. మా అమ్మనయితే అడగనూ క్షమాపణ. అటువంటప్పుడు నా భర్త అమ్మదగ్గర నా తప్పు ఒప్పుకోవటానికి నాకు అభ్యంతరం ఎందుకుండాలి?'' అని నన్ను ఎదురుప్రశ్నించింది.

మమల్ని చూడగానే మైథిలి,

''అమ్మయ్య! వచ్చారా? టెలిగ్రాం అందిందా?'' అనడిగింది.

''టెలిగ్రాం ఏమిటి మైథిలీ? ఎందుకు?''

''అమ్మకి ఒంట్లో బాగాలేదు...'' నా కంగారు చూసి మళ్ళీ అదే అంది. ''భయపడాల్సిందేమీ లేదులే''

దానిని వాక్యం పూర్తిచెయ్యనివ్వలేదు నేను. ''ఉండు... నేను చూసివస్తాను. అమ్మ ఎక్కడ వుంది?'' అంటూ ఆ ప్రయాణపు బట్టలతోనే లోపలిగదిలోకి వెళ్ళాను.

లోపలి గదిలో అమ్మ మంచంమీద పడుకుని వుంది. శల్యావశిష్టురాలై వుంది. నీరసించిన తెల్లని శరీరమూ, తెల్లని జుట్టూ, తెల్లని దుప్పటి - అమ్మ వడిలిపోయిన తెల్ల గులాబీల కుప్పలా వుంది. నేను నిశ్శబ్దంగా, ఆమె నిద్రకు భంగంకలుగకుండా బయటికి వచ్చేశాను. కానీ, మైథిలిని చూసి నా దుఃఖం ఆగలేదు. దాన్ని కౌగలించుకుని చిన్నపిల్లవాడిలా, వెక్కివెక్కి ఏడ్చాను. నా ఏడుపుచూసి అది కూడా ఏడవటం మొదలుపెట్టింది.

''ఏమిటి కృష్ణా! మీరు కూడా పసిబిడ్డలా ప్రవర్తిస్తున్నారు? మీకంటె చిన్నది మైథిలికి ధైర్యంచెప్పాల్సింది పోయి ఏదో ఘోరం జరిగినట్టు అలా ఏడుస్తారేమిటి?'' అని లలిత నన్ను మెత్తగా మందలించింది.

మా యిద్దరి ఏడుపులు ఆగాక మైథిలి చెప్పింది - ''నేను యిక్కడినుండి వెళ్ళేవరకు అమ్మ బాగానే వుందట. తర్వాతిరోజునుండి భోజనం మానేసిందట. మైథిలి బలవంతంచేస్తే 'ఆకలి లేదంటే తినమంటావేమిటి? నాకు నహించటంలేదు' అని విసుక్కుందట.

మూడురోజులయ్యేసరికి బావగారికి అమ్మ అనారోగ్యం ఏమిటో అర్ధమయింది. 'చూడండి... మీరు కృష్ణని వదలి వుండలేరు. ఎందుకొచ్చిన గొడవ... పదండి, మీ ఇంట్లో మిమ్మల్ని దింపివస్తాను' అన్నారట. అమ్మ సమాధానం చెప్పలేదు. నావద్దకు రావటానికి నుముఖంగా లేదని ఆయనకు అర్ధమయింది. న్యాయమేకదా!

లలిత ప్రవర్తనవల్ల అమ్మ మనసుకు కష్టంకలిగింది. లలిత తన తప్పును అమ్మ ముందు అంగీకరిస్తేగానీ అమ్మకు మా యింటికి రావటం యిష్టంలేదు. తన ఆత్మాభిమానానికి, నామీదగల ప్రేమకూ మధ్య అమ్మ మనసు నలిగిపోయింది.

'కృష్ణకు ఫోనుచేస్తాను. వచ్చి చూస్తాడు మిమ్మల్ని' అన్నారట బావగారు.

'వద్దు... ఉద్యోగం మానేసి నాఎదురుగా ఎంతకాలం కూర్చుంటాడు? వాడికిమాత్రం పెళ్ళాం, పిల్లలు లేరా?' అందట.

'పోనీ! మీరు యిలా నిరాహారదీక్ష చేస్తున్నారని తెలియచెయ్యనా?' అనడిగారట.

'నేనే దీక్షలూ చేయటంలేదు బాబూ! పెద్దదాన్ని అయిపోయాను. అన్నం సహించక కొంచెం భోజనం తగ్గించాను, అంతే... మీరు వాడికి యివేవీ తెలియచెయ్యటానికి వీల్లేదు. పిచ్చినాయన! దిగులు పెట్టుకుంటాడు' అందట.

బావగారు అమ్మమాటను మన్నించి, వూరుకున్నారు. ఫలితం! రెండురోజులక్రితం పరిస్థితి విషమించింది. అమ్మను పూర్తిగా మంచంమీదకు చేర్చి సెలైన్ ఎక్కించవలసి వచ్చింది. అప్పుడు బావగారు కంగారుపడి లలిత బ్యాంకుకి, నా ఆఫీసుకు ఫోనుచేశారట. కానీ అప్పటికే మేమిద్దరమూ పాపాయిని తెచ్చుకునేందుకు మా అత్తగారి వూరు వెళ్ళిపోయాం. అందువల్ల, ఆయనకు మేము ఫోనులో దొరకలేదు. విధిలేక తప్పనిసరి పరిస్థితిలో టెలిగ్రాం యిచ్చారట.

మైథిలి మేము ఆ టెలిగ్రాం అంది వచ్చామనుకున్నది. బావగారు సాయంత్రం ఆఫీసు నుండి వస్తూనే "వెరీగుడ్! వచ్చేశారన్నమాట. టెలిగ్రాం ఎప్పుడందింది?" అనడిగారు.

నేను మళ్ళీ రికార్డంతా పెట్టాను - టెలిగ్రాం అందలేదని, లలిత పాపాయిని పుట్టింట్లో వదిలిందని, పాపాయిని తెచ్చుకుందుకు మేము మా అత్తగారి వూరు వెళ్ళామని, అక్కడినుండి లలిత కోరికమేరకు యిక్కడకు వచ్చాంతప్ప టెలిగ్రాంవంటిది ఏమీ అంది రాలేదని వివరించాను. ఆయన నిజంగానే సంతోషపడ్డారు.

"పోనీలే... మీఅంతట మీరే వచ్చారన్నమాట. ముఖ్యంగా ఈ లలిత మొద్దుకు అత్తయ్య విలువ తెలిసివచ్చిందన్నమాట. కొడుకూ, కోడలూ తమంతట తామే తను కావాలని వచ్చారని తెలిస్తే అత్తయ్య కూడా సంతోషపడతారు. నువ్వు ఫూల్‌లా మనం టెలిగ్రాం యిచ్చిన సంగతి ఆవిడతో అనకు" అని మైథిలిని హెచ్చరించారు.

★ ★ ★

అమ్మ నన్నూ, లలితనూ, పాపాయిని చూసి ముందుగా ఆశ్చర్యపోయింది.

"మీరెప్పుడు వచ్చారురా? ఎందుకు వచ్చారు?" అనడిగింది.

నేను పరీక్షహాలులో సమాధానాలు మర్చిపోయిన కుర్రవాడిలా దిక్కులు చూస్తోంటే లలితే సమాధానం చెప్పింది

"మధ్యాహ్నం వచ్చాం అత్తయ్యా! మీరు నిద్రపోతున్నారని లేపలేదు యింతవరకు. ఎందుకు వచ్చామంటే... మనింటికి మిమ్మల్ని తీసుకువెళ్ళటానికి వచ్చాము. మనకీ మనకీ బేధాభిప్రాయాలు వస్తే మనింట్లో మన నాలుగు గోడలమధ్య పోట్లాడుకుందాంగానీ, వీళ్ళింటికి ఎందుకత్తయ్యా మనం రావటం!' అంది చిన్నపిల్లలా.

లలిత ధోరణికి అమ్మ నవ్వేసింది.

"నువ్వు చాలా చిక్కిపోయావమ్మా లలితా? ఎందుకని?"

"ఎందుకేంటి? కమ్మగా వండిపెట్టేవాళ్ళూ, తిను తినమని బలవంతంగా మెక్కపెట్టేవాళ్ళూ లేక. లలితేమిటి? నేను కూడా చిక్కిపోయానే చూడు" అన్నాను.

"నిజమేనండీ" అని లలిత వంతపాడింది.

అమ్మ పాపాయిని మైథిలి చేతుల్లోనుండి తీసుకుని తన పక్కన పడుకోబెట్టుకుంది.

"ఇది కూడా చిక్కిపోయిందిరా కృష్ణా! నిజంగానే మీరందరూ చిక్కిపోయారా? లేక నా కంటికి అలా కన్పిస్తున్నారా?" అంది అమ్మ అయోమయంగా.

బావగారు మైథిలిని ముందుకు తోసి, "ఇటు చూడండి అత్తయ్యా! మైథిలి చిక్కి





పోయిందా? లేదుకదా! నేనూ సన్నగా లేను కదా! మీరు మా యింటికి వచ్చేక మేమిద్దరం చేరో అయిదు కేజీలు బరువు పెరిగాంలెండి. అంటే మీ చూపులో లోపం ఏమీలేదు. నిజంగానే మీ కొడుకు, కోడలు, మనవరాలు, మీరూ అందరూ చిక్కిపోయారు. యివాళ్టి నుండి మీ యింటిపేరు 'చిక్కిపోయినవారు' అన్నమాట?"

★ ★ ★

మమ్మల్ని చూసిన వుత్సాహంతో అమ్మ లేచి తిరగటం మొదలుపెట్టింది. కొంచెం కొంచెం ఆహారం కూడా తీసుకుంటున్నది. ఆరోజు బాబీకి అమ్మ పండు తినిపిస్తోంటే మైథిలి,

" అబ్బ... అమ్మా! వాడికి పండు పెట్టకు, అరగంట కాలేదు వాడు టిఫిన్ తిని" అని విసుక్కుంది.

"పండు ఏం చెయ్యదు కానీ వూరికే యాగీ చెయ్యకు" అంది అమ్మ.

"చూశారా అత్తయ్యా! మీరు ఎంత ఖచ్చితంగా సమాధానం చెప్పారో మైథిలికి. నా దగ్గర ఎందుకు ఎప్పుడూ యిలా అనలేదు" అని లలిత అమ్మను నిలదీసింది.

నేను భయం భయంగా బావగారి వంక చూశాను. యిప్పుడిప్పుడే అమ్మ రాజీకి వస్తోంది. లలిత యీ వ్యవహారాన్ని పాడు చెయ్యదు కదా!

ఆయన ఫర్వాలేదులే అన్నట్టు నాకు కళ్ళతోనే ధైర్యం చెప్పారు. అమ్మ లలిత ప్రశ్నకు ఒక్కక్షణం తెల్లబోయిన మాట నిజం. కానీ వెంటనే తెప్పరిల్లింది.

"నువ్వు చదువుకున్న దానివి లలితా! నాకంటే బిడ్డల సంరక్షణ నీకు బాగా తెలుసనుకున్నాను" అంది.

"అదేంటత్తయ్యా! మైథిలి మాత్రం నిరక్షరకుక్షా? తను కూడా చదువుకున్నదే కదా! మీరు తనను 'నువ్వూరుకో. నీకేం తెలియదు' అనగలిగారు. నన్నెందుకు అనలేదు?"

అమ్మ గొంతు తగ్గించి

"నేను మొహమాటపడ్డాను లలితా! నీ మీద నాకే అధికారమూ లేదనుకున్నాను. చదువుకున్న కోడలివి. మనిద్దరికీ భేదాభిప్రాయాలు వస్తే మధ్య కృష్ణుడు నలిగిపోతాడని భయపడ్డాను" అంది నిజాయితీగా. లలిత అంతకంటే నిజాయితీగా అమ్మ పాదాలమీద చేయిపెట్టి.

"నన్ను క్షమించండి అత్తయ్యా! నేను చాలా మూర్ఖంగా ప్రవర్తించాను. నాయనమ్మగా మీకు పాపాయి పట్ల బాధ్యత వుందని మరిచాను. నా పుస్తక పరిజ్ఞానంతో నేను దాన్ని చాలా బాగా పెంచగలనని గర్వించాను. అంతా సిస్టమేటిక్‌గా, సైంటిఫిక్‌గా ఆలోచించాను కానీ, లాలనకు, ప్రేమకూ ప్రాధాన్యత యివ్వలేదు" అంది.

"ఇవన్నీ ప్రతి కోడలికీ అత్తవారింట్లో మొదట్లో ఎదురయ్యే సమస్యలే. ఇంగ్లీషువాళ్ళలా మనకు భార్యాభర్తలు, ముసలి అత్తమామల నుండి వేరుగా వుండాలనే అభిప్రాయంలేదు. రెండు తరాల వాళ్ళు కలిసి వున్నప్పుడు కొన్ని సమస్యలు తప్పవు. అయినా నా ఓటు ఎప్పుడూ కోడళ్ళకే. మగవాడికి పెళ్ళితో ఏ మార్పూ రాదు. ఆడపిల్ల కొత్త వాతావరణంలో, కొత్త మనుషులతో సర్దుకుపోవాలి. ఆ క్రమంలో కొంత సంఘర్షణ తప్పదేమో! అందుకే మీ మామగారు పెళ్ళి కాగానే మిమ్మల్ని వేరే వుంచాలని ప్రయత్నించారు. కొడుకును విడిచి వుండలేని బలహీనతలో నేనపుడు ఒప్పుకోలేదు"

"అమ్మా! నీకు పుణ్యం వుంటుంది. యిప్పుడు నువ్వు విశ్రాంతిగా పడుకో. ఎక్కువ మాట్లాడకు" అన్నాను నేను సంభాషణ దారి మళ్ళటం గమనించి, లలిత వూరుకోలేదు

"అది చాలా తెలివి తక్కువ ప్రపోజల్ అత్తయ్యా! వూరి మొదట్లో మేమూ, వూరి చివర మీరూ వుండి ఏ మూడు నాలుగు నెలలకో ఒకసారి డ్రాయింగ్‌రూములో కలుసుకుని, ఒకరి అభిప్రాయాలు ఒకరు ఖండించుకోకుండా, యాంత్రికంగా కలుసుకుని విడిపోతూ ఓహో! మాకు అభిప్రాయ భేదాలు లేవు అనుకోవడం తెలివి తక్కువకదా అత్తయా! ఎప్పుడూ కలిసివుండని వాళ్ళకు, ఏ సమస్యా, ఏ సంతోషమూ సమిష్టిది కాని వాళ్ళకు అభిప్రాయ భేదాలు వస్తే ఎంత? రాకపోతే ఎంత? నేను మీతోనూ, ఆయనతోనూ విభేదిస్తాను కానీ



వీడితో నాకు అభిప్రాయ భేదాలు ఎందుకొస్తాయి? నాకే మవుతాడని?" అంది బావగారి వంక అల్లరిగా చూస్తూ.

"అమ్మయ్యా! బ్రతికించావు లలితా! నేను నీకు ఏం కానన్నమాట. 'చెల్లెలివేమో! రేపు వెళ్ళేటపుడు చీరపెట్టాలి రా భగవంతుడా' అని మొన్నటి నుండి దిగులుపడి ఛస్తున్నాను" అన్నారు బావగారు.

ఆయనను మాటల్లో ఓడించడం కష్టం.

"ఓహో! ఆ పప్పులు వుడకవు. ఏం కావు



కాబట్టి కొన్ని మర్యాదలు పాటించాలి. నాకూ మా అత్తగారికి చీరెలు, ఆయనకు పాంటూ, షర్టు పాపాయికి గౌను..."

లలిత మాటలు పూర్తి కాకుండానే మైథిలి అందరికీ కాఫీలు తెచ్చియిస్తూ,

"ఇంకా దానిపేరు పాపాయేనా అన్నయ్యా! పేరు పెట్టవూ?" అనడిగింది.

"నువ్వే ఏదయినా పేరు సజెస్ట్ చెయ్యి"

"నేనేం చెయ్యనుపో! అడుగుతావు కానీ, నేను చెప్పిన పేరు పెట్టవు" అంది అలకను అభినయిస్తూ.

చిన్నప్పటినుండీ దాని స్వభావం అది.

'మైథిలీ! కుడి పాపిడి బావుంటుందా? ఎడమ వైపు దువ్వుకోనా?' అని సలహా అడిగే వాడిని.

'కుడివైపు దువ్వుకో' అనేది. తీరా కుడివైపు దువ్వుకున్నాక నాకు నచ్చేదికాదు. చెరిపేసి మళ్ళీ దువ్వుకునేవాడిని.

'అదుగో నా సలహా వినలేదు. అంత కాడికి నన్నెందుకు అడిగావు' అని అలిగేది అది పూల షర్టు వేసుకోమంటే నాకు గళ్ళ షర్టు నచ్చేది. 'ఛీ! నీకెప్పుడూ సలహాలివ్వను' అనేది. ఇప్పుడూ అదే మైథిలి. ఏమీ మారలే దు.

"నిజంగా మైథిలీ! చెప్పు. 'ప్రథమ, విరిక, ఋరిణి, హర్షిక, ప్రమాదీచ, రుద్రి, అరిక, వరిమ' అంటూ అక్షరాల గారడిలో అర్థం లేని పేర్లు చెపితే పెట్టనుగానీ మంచిపేరు చెపితే ఎందుకు పెట్టమా? చెప్పి చూడు. మంచి బహుమతి కూడా యిస్తాను"

అది చాలా మంచిపేర్లు చెప్పింది పాపం!

"లహరి, ఆలేఖ్య, అనుపమ, శరచ్చంద్రిక, కిర్మణయి, మైత్రేయి, వర్ష, స్రవంతి, నీలిమ, రవళి, మంజీర..." అలిసిపోయి "ఛీ! నీకు ఏ పేర్లూ నచ్చటం లేదు. నేనింక చెప్పను ఫో" అంది.

లలితా, బావగారూ, అమ్మా నవ్వుతున్నారు.

"ఆఖరిది... ఇంకొక్కటి చెప్పు ప్లీజ్!"

రెండు నిమిషాలు ఆలోచించింది.

"ఆః! అనిత అనిపెట్టు. వాళ్ళమ్మ పేరు లలిత, దాని పేరు అనిత. ఈమధ్య మ్యాచింగ్ పేర్లు ఫ్యాషనులే. అదీ గాక అమ్మ పేరులో మొదటి అక్షరం కల్సివచ్చింది కదా! అమ్మ పేరు పెట్టినట్టూ వుంటుంది ఏం?"

"మొద్దూ! అనిత అంటే అర్థం ఏమిటే?" మైథిలి బుర్రగోక్కుంది. పెదవి విరిచింది.

"తెలీదన్నయ్యా! నువ్వు చెప్పుపోనీ"

"నాకూ తెలీదు. అయినా ఏదో అర్థం వుండే వుంటుందిలే. అంత అర్థం తెలియని పే రెందుకే పెట్టుకోవడం. అంతకంటే అర్థవంత మయిన పేరు అమ్మ పేరే పెడతాను 'అన్నపూ ర్ణ!' బావుందా?"

లలిత ఆదేశించినట్టుగానే బావగారు అమ్మకూ, లలితకు చీరెలు కొని తెచ్చారు. నాకూ పాపాయికి కూడా బట్టలు కొన్నారు.

"లలితా, అత్తయ్యా జాగ్రత్త కృష్ణా! మగవా డి సమర్థత వేరింటి కాపురం పెట్టడంలో లేదు. తల్లినీ, భార్యనూ ఒక యింటిలోనే వుంచి యిద్దరినీ సంతోష పెట్టడంలోవుంది" అని నాకు హితోపదేశం చేశారు.

"చూశారా అత్తయ్యా! మేము మిమ్మల్ని ఎంత జాగ్రత్తగా చూసుకున్నా మీరు కొడుకు కోసం బెంగటిల్లి, చివరకు కొడుకుతోనే వెళ్ళిపో తున్నారు. ప్చ్! ఏం చేస్తాం?" అని విచారం అభినయించారు.

"అది లోకధర్మం బాబూ! ఎన్ని పోట్లాడుకు న్నా వాడి దగ్గరవుండి వాడి చేతుల మీదుగా పోవలసినదాన్నే కదా!" అంది అమ్మ వేదాంత ధోరణిలో.

మైథిలీ, బావగారు రైల్వే స్టేషనుకు వచ్చి మాకు వీడ్కోలు పలికారు.

"మళ్ళీ మీరు వెనక్కి వచ్చేస్తారేమోనని భయం నాకు. అందుకని రైల్లో కూర్చోపెట్టి రైలు కదిలేవరకు ఉండదల్చుకున్నాను" అన్నారు బావగారు.

బాబి అమ్మను వదిలి వెళ్తున్నందుకు ఏడుపు లంకించుకున్నాడు. పాపాయి మహారా ణిలా అమ్మ ఒడిని ఆక్రమించుకుని, నోట్లో వేలు పెట్టేసుకుంది. రైలు కూత వేసింది. నేను అమ్మతోనూ, లలితతోనూ, పాపాయితోనూ భవి ష్యత్తులోకి ప్రయాణం మొదలు పెట్టాను.



చతుర ఫీచర్

# క్షైత్ర కథలు

## నరబలి

కేరళ రాష్ట్ర "అడుగడి" ప్రాంతంలోని ఓ టీ ఎస్టేట్‌కు మేనేజర్‌గా చేరాడు రమేశ్. అదే ఎస్టేట్ యజమాని కరుణాకరన్ ఇంట్లో పిల్లల్ని చూసుకునే ఉద్యోగంలో చేరింది అతని భార్య సరళ. వాళ్ళిద్దరికీ మధు అని ఓ ఏడేళ్ల కొడుకున్నాడు. దగ్గర్లో మంచి స్కూళ్ళు ఏవీ లేకపోవటంతో మధుకు తనే చదువు చెబుతుండేది సరళ. యజమాని భార్య చనిపోయింది. అతనికి ఇద్దరు కూతుళ్ళున్నారు. వాళ్ల ఆలనాపాలనా చూసుకుంటూ, ఉద్యోగంతోపాటు కొడుకునూ చూసుకుంటూండేది సరళ.

చదువు, చదువు లేనప్పుడు యజమాని పిల్లలతో ఆడుకోవటం, అప్పుడప్పుడూ ఆ ప్రాంతంలోని ఏకైక వైద్యుడు శంకర్‌నాయర్‌తో గడపడం మధు కాలక్షేపం. ఆ చుట్టుపక్కలంతా వైద్యుడిగా పేరుమోసిన శంకరన్‌నాయర్ కేవలం నాటువైద్యుడు. అయినా, దగ్గర్లో మరో వైద్యుడెవరూ లేకపోవటంతో రమేశ్ కుటుంబానికే కాదు, అతని యజమాని కరుణాకరన్ కుటుంబానికి కూడా శంకరన్ నాయరే వైద్యం చేస్తుండేవాడు. మధుకు ఓసారి జ్వరం వచ్చినప్పుడు అతనే మందులిచ్చాడు. అప్పట్నించీ మధుకు అతని దగ్గర చనువు పెరిగింద. శంకరన్‌నాయర్ కూడా మధుకు అప్పుడప్పుడు ఆయుర్వేద మూలికలతో చేసిన టానిక్కులలాంటివి ఇస్తుండేవాడు. టీ ఎస్టేట్ పక్కనే వున్న తమ విశాలమైన ఇంట్లోనూ, ఆ చుట్టుపక్కలా ఆడుతూ, సరదాగా వుండేవాడు మధు.




ఆరోజు 1985 అక్టోబర్ 10వ తేదీ. మామూలుగా ఎక్కడో ఆడుకుంటూ ఉంటాడనుకున్న




మధు ఎంతకీ ఇంటికి తిరిగి రాలేదు. మధ్యాహ్నం 3 గంటలు దాటినా భోజనానికి కూడా రాకపోవటంతో సరళకు కాస్త ఆందోళన కలిగింది. చుట్టుపక్కలవాళ్ళను ఆరాతీసింది కానీ మధు జాడ తెలియలేదు. రమేశ్ ఆందోళనతో ఈ సంగతి యజమానికి చెప్పుకున్నాడు. కరణాకరన్ పోలీసులకు తెలియచేశాడు. టీ తోటలోని పనివాళ్లంతా కూడా మధును వెతుకుతూ తలా ఓవైపుకూ వెళ్ళారు.

వాళ్ళందరూ అంత కంగారుపడటానికి కారణం, ఆ దగ్గర్లోని అడవిలో చిరుతపులులు ఎక్కువగా తిరుగుతుండటమే. చీకటి పడటంతో కాగడాలూ, లాంతర్లూ పట్టుకుని, తోచిన ఆయుధాలు వెంటబెట్టుకుని అడివంతా గాలించనారంభించారు జనం. ఆ పక్కనే వున్న నదినిదాటి ఆవలితీరానికి వెళ్లటానికి ఉద్యుక్తులవుతుండగా కనిపించింది ఒక భయంకర దృశ్యం. ఓ చెట్టు కొమ్మమీద ఒక కుర్రాడి శరీరం వేలాడుతూ వుంది. ఆ శరీరానికి నీలిరంగు చొక్కావుంది. ఆ చొక్కా కరుణాకరన్, మధుకు బహుమతిగా ఇచ్చిందని అందరికీ తెలుసు. నిర్జీవంగా చెట్టు కొమ్మపైన వేళ్ళాడుతున్న ఆ దేహం మధుదేనని అనటానికి సందేహములేదు. గానీ, ఆ శవానికి తలలేదు, కేవలం మొండెం మాత్రమే వేళ్లాడుతూంది.

ఈ విషయం తెలిసిన వెంటనే సరళ స్పృహతప్పి పడిపోయింది. పోలీసులు శవపరీక్ష నిమిత్తం ఆ మొండాన్ని తీసుకువెళ్లారు. పదునైన కత్తితో తల ఖండించబడిందని పోస్ట్ మార్టమ్‌లో తేలింది. శరీరంపైన నెయ్యి, కుంకుమల జాడలు కనిపించటంతో మధును ఎవరో బలిచ్చారనే నిర్ధారణకు వచ్చారు. శవం దొరికిన స్థలంలోని వేలిముద్రలను సేకరించి పోలీసులు తమ పద్ధతుల్లో హంతకుని కోసం అన్వేషణ కొనసాగించారు.

తన ఒక్కగానొక్క కొడుకుని అన్నెం పున్నెం ఎరుగని పసివాణ్ని బలిఇచ్చారని విన్న రమేశ్‌కు క్రోధం కట్టలు తెంచుకుంది. ఆ హంతకుణ్ణి ఎలాగైనాసరే పట్టుకోవాలని తీర్మానించుకున్నాడు. ఇలాంటి నరబలులు ఆ చుట్టుపక్కల అడపా దడపా జరుగుతుంటాయి. ఆ ప్రాంతాల్లో కాళీమాత ఆలయాలు చాలా వున్నాయి. తమకు దగ్గర్లో వున్న ఓ కాళీమాత ఆలయ అర్చకుణ్ణి కలుసుకున్నాడు రమేశ్. ఇలాంటివి జరిగినప్పుడల్లా ఆయన ఇచ్చే సమాచారం పోలీసులకు చాలావరకు ఉపయోగపడుతుంటుంది. కనిపించకుండాపోయిన వ్యక్తులను గురించీ, నేరస్థులను గురించీ ఆయన ఎన్నోసార్లు ఉపయోగకరమైన ఆధారాలనూ, అంశాలనూ అందించాడు. మధును కాళీమాతకు బలిఇచ్చివుంటారనటంలో సందేహంలేదని నిర్ధారించాడు ఆ అర్చకుడు.

పోలీసుల విచారణలో మధు తరచుగా శంకరన్‌నాయర్ దగ్గరికి వెళుతుండేవాడని తెలిసింది. సి.ఐ.డి. ఇన్‌స్పెక్టర్ స్వయంగా శంకరన్‌నాయర్‌ని విచారించాడు. చాలా నొచ్చుకుంటూ బదులిచ్చాడు శంకరన్‌నాయర్.

'మధు మరణం నాక్కూడా తీరనిలోటు. ఆ కుర్రాడు లేని సంగతి గుర్తొచ్చినప్పుడల్లా నిజంగా నాకు ఎంతో బాధ కలుగుతూంది. నా ఒంటరి జీవితంలో మధు ఉనికి ఓ ఊరటగా వుండేది. పిల్లాడి ఆరోగ్యమూ, మేధస్సూ వికసించాలని మూలికల మందులు కూడా ఇస్తుండేవాణ్ణి నేను''

''నిన్నంతా ఎక్కడున్నారు మీరు?'' ప్రశ్నించాడు సి.ఐ.డి. ఇన్‌స్పెక్టర్.

''కొన్ని సరుకులు కొనుక్కోవటానికి పట్నానికి వెళ్లాను. ఏడుమైళ్ళ దూరంకదా. నడిచివెళ్ళి వచ్చేసరికి రాత్రి పదయింది'' వివరించాడు శంకరన్‌నాయర్.

''కేవలం మూలికా వైద్యమేనా మీరు చేసేది లేక తంత్ర, మంత్ర ప్రయోగాలు కూడా చేస్తుంటారా?''

''ఛీ... ఛీ... లేదు. నేను భగవంతుని మీదా, ఆయన శక్తిమీదా నమ్మకం వున్నవాణ్ణి. ఆ దేవుడిపైన భారంవేసి నిమిత్తమాత్రంగా మందులిస్తులింటాను''

''ఓసారి మీ పూజామందిరం చూడొచ్చా?''

''తప్పకుండా...''

శంకరన్‌నాయర్ పూజామందిరంలోకి ప్రవేశించారు సి.ఐ.డి. అధికారులు. అక్కడ ఓ

కాళీమాత విగ్రహం, దానిముందు పువ్వుల లాంటి కొన్ని పూజాద్రవ్యాలు, ఒక చిన్న సీసాలో ఎర్రటి ద్రవమూ కనిపించాయి.

"ఆ సీసాలో, అదేంటి?" ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

"అదా... అది మేక రక్తం. మేకల్ని బలిచ్చిన భక్తులు, కాళీమాతకు అర్పించడానికి ఇస్తుంటారు" వివరించాడు శంకరన్ నాయర్.

అయితే, అతని మాటల్లో నమ్మకం కలగక, అతనికి తెలియకుండా ఆ సీసాను పాథాలజీ పరీక్షలకు పంపారు సి.ఐ.డి. అధికారులు. అది మానవరక్తమనీ, మధు గ్రూపుకు చెందిన రక్తమనీ తేలింది.

"శంకరన్, నువ్వు ఇంకా మమ్మల్ని మోసం చేయలేవు. నువ్వు ఆ కుర్రాణ్ని బాగా మాలిమి చేసుకోవటానికి ప్రయత్నాలు చేసి, నమ్మకంగా పిలుచుకుని కాళీమాతకు బలి ఇచ్చావనటంలో అనుమానంలేదు. ఇంకా నాటకాలు ఆడకుండా తలను ఏం చేశావో చెప్పు" కఠినంగా ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్,

దగ్గర్లో ఉన్న తోటలో ఓచోట పాతిపెట్టిన మధు తలని చూపించాడు శంకరన్‌నాయర్.

"తాంత్రిక శక్తులమీద నాకు చాలాగురి వుంది. నరబలితో కాళీమాతను సంతృప్తిపరిచి అపురూపమైన వైద్యశక్తుల్ని పొందాలనుకున్నాను" అని వివరించాడు శంకరన్‌నాయర్, నేరం ఒప్పుకుంటూ.

ఆవిధంగా అతీతశక్తులపట్ల ఈ మూర్ఖుడికున్న ఆరాటం, ఆ తల్లిదండ్రులకు పుత్రశోకాన్ని మిగిలించింది. అయితే శంకరన్‌నాయర్ మొట్టమొదటి ప్రయత్నంలోనే పట్టుపడటంవల్ల, అలాంటి మరిన్ని బలులు జరుగకుండా పరోక్షంగా తమకు మేలు జరిగిందని సంతోషించారు అడుగడి ప్రాంతవాసులు. దేవుడిలాంటి పసివాడు దేవతకు బలికావటంతో కడుపుకోతతో మిగిలిపోయారు రమేశ్, సరళ దంపతులు.

## చెరకు తోటలో..

ఎప్పటిలాగే ఆరోజూ తెల్లారింది.

తమిళనాడులోని ఛెంగల్‌పేట వీధుల్లో హడావిడి మొదలయ్యింది.

ముత్తయ్యకు వయసు పైబడడంతో ఏరోజు కారోజు పనిలోకెళ్లడమంటేనే కష్టంగా వుంటోంది. అయినా తెముల్చుకొని మెల్లగా అడుగులో అడుగేస్తూ చెరకుతోట వెంబడి నడుస్తున్నాడు.

తలవంచుకొని నడుస్తున్నవాడల్లా కొంచెం దూరంపోయాక ఠక్కున ఆగిపోయాడు. అక్కడ కనిపించిన దృశ్యం అతన్ని భయంకంపితుణ్ని చేసింది. ఓ మూల పొదల్లోంచి ఎవరివో రెండుకాళ్ళు మాత్రం బయటికి కనబడుతున్నాయి. ధైర్యం చేసుకొని పొదల్లోకి తొంగిచూశాడు. బహూశా ఆ వ్యక్తికి ముప్పై సంవత్సరాలుంటాయేమో. చేతిలో ఇనుపతీగ ఒకటుంది. పరీక్షగా చూడగా ప్రాణంపోయి చాలా సేపయ్యిందని తెలిసింది.

ముత్తయ్యా వెంటనే పోలీసులకు ఈ విషయం తెలియజేశాడు. పోలీసుబలగం వెంటనే హుటాహుటిన చెరకుతోట చేరుకుంది.

ఆ వ్యక్తి చనిపోయివున్న తీరునుబట్టి మూర్ఛరోగంతో అతని ప్రాణాలు పోయాయని ఊహించారు పోలీసులు. మూర్ఛరోగంతో బాధపడేవారికి వెంటనే చేతుల్లో ఇనుపవస్తువులుంచటం పరిపాటే. కానీ ఆ సమయంలో అతని చేతిలో ఇనుపతీగనుంచిన వ్యక్తులెవరు? అతని చావుకి కారణం మూర్ఛరోగమేనా? ఎటూ తేల్చుకోలేకపోయారు పోలీసులు.

మృతుడి వంటిపైనున్న చొక్కాను తొలగించి చూడగా శరీరంపై వలుచేట్ల గీరుకుపోయిన

గాయాలున్నాయి. మూర్ఛతో నేలపైబడి కొట్టుమిట్టాడుతుండగా గాయాలై ఉంటాయని అంతా భావించారు. ఏది ఏమయినప్పటికీ శవపరీక్ష చేయందే ఏ విషయమూ తేలదని నిర్ణయించుకొని మృతశరీరాన్ని పోస్టుమార్టమ్‌కి పంపారు.

ఊహించనివిధంగా వున్న పోస్టుమార్టమ్ రిపోర్టు చూసి ఆశ్చర్యపోయారంతా. మూర్ఛరోగంతో చనిపోలేదు. అతడు హత్య చేయబడ్డాడని ధృవీకరించబడిందా రిపోర్టులో.

హతుడు ఎవరు? హంతకులెవరు?



హత్యకు కారణమేంటి? ఇలాంటి ప్రశ్నలతో పోలీసులు తలమునకలయ్యారు.

చెంగల్‌పేటలోనే ఓ పెద్ద ఇనుము, సిమెంటు అమ్మే దుకాణం వుంది. రోజూ సరుకు అమ్మకం బాగా వుంటుంది. దుకాణదారు సంపత్ అమ్మకపు డబ్బుని ఎప్పటికప్పుడు బ్యాంకులో జమచేయిస్తూ వుంటాడు. ఎప్పటిలాగే ఆరోజు కూడా అంటే 79 జూన్ 22న కాషియర్ వరదన్ అరవైవేల రూపాయలు బ్యాంకులో జమచేసి రావడానికి వెళ్లాడు.

బ్యాంకుకని వెళ్లిన వరదన్ ఎంతసేపటికీ తిరిగిరాలేదు. బ్యాంకు మేనేజర్‌ని కనుక్కుంటే వదరన్ అసలారోజు బ్యాంకుకే రాలేదని చెప్పాడు. కంపెనీ డబ్బు అరవైవేల రూపాయలతో వరదన్ పారిపోయాడని సంపత్ పోలీసులకు కంప్లైంట్ చేశాడు.

ఆలోచించగా వరదన్ అంతర్ధానానికి, చెరకుతోటలోని వ్యక్తి శవానికి ఏమైనా సంబంధం వుందా? అన్న అనుమానం కలిగింది ఇన్‌స్పెక్టర్‌కి.

చెరకుతోటలో దొరికిన శవాన్ని సంపత్ గుర్తుపట్టగలడేమోనని అతన్ని పిలిపించాడు ఇన్‌స్పెక్టర్.

శవాన్ని చూసిన వెంటనే సంపత్, "సందేహం లేదు. ఇతనే వరదన్, మా కంపెనీ కేషియర్" అన్నాడు బాధగా.

"ఇతన్ని ఎవరో డబ్బుకోసం చంపారు. శవం చెరకుతోటలో దొరికింది" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"కానీ ఇతను చెరకుతోటవైపు ఎందుకు వెళ్ళాడో? అది అతని దారికాదే?" అర్థంకానట్టు అన్నాడు సంపత్.

"ఇతనెలాంటివాడు? ఏదైనా ప్రేమ వ్యవహారంలోగానీ చిక్కుకున్నాడా?" అని అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"వరదన్ నిజాయితీపరుడు, నమ్మకస్తుడు. అతనిది కష్టపడి పనిచేసే స్వభావం. ఇన్నేళ్లుగా పనిచేస్తున్నా మోసం అనేదే తెలియదు" అన్నాడు సంపత్.

వరదన్ పరిచయస్థులు చాలామంది అతని గురించి మంచిగానే చెప్పారు. అతనికెలాంటి ఆడవాళ్లతోనూ సంబంధాలు లేవని కూడా అన్నారు.

ఏ కారణమూ లేకుండా ఈ హత్య జరగడానికి ఆస్కారం లేదు. కారణం దొరక్క వరదన్ కేసు ఓ మిస్టరీలా తయారయ్యింది. పోలీసు శాఖ గూఢచారులను కూడా నియమించింది. రోజులు గడుస్తున్నా వరదన్ హత్యకు సంబంధించి సరియైన వివరాలేవీ దొరకలేదు. ఇక లాభంలేదు, హంతకులెవరైందీ తెలియదని నిర్ణయించుకొన్న తరుణంలో ఊహించని విధంగా కేసు కొత్తమలుపు తిరిగింది.

నగరంలో పెద్దజేబుదొంగగా పేరుబడిన సింగారం ఇన్‌స్పెక్టర్‌ని కలవడానికొచ్చాడో రోజు. జైలుజీవితం అతనికి బాగా అలవాటే. ఈమధ్య చెడునడతను వదిలి మంచివాడయ్యాడు.

ఇన్‌స్పెక్టర్ అతన్ని చూసి "సింగారం చాలారోజుల తరువాత ఊడిపడ్డావ్? ఏం చేస్తున్నావేంటి?" అని అడిగాడు.

క్షేమసమాచారాలనంతరం అతను ఇన్‌స్పెక్టర్ నుద్దేశించి "ఆ ఏముంది బాబూ! మీతో ఓ విషయం మాట్లాడటానికి వచ్చాను. బాగా వినండి. ప్రస్తుతం నాకు ఉద్యోగంలేదు. డబ్బులకు చాలా ఇబ్బందిగా వుంది. సహాయపడేవాళ్లు కూడా ఎవరూ లేరు. అలాంటి సమయంలో ఉన్నట్టుండి నా జేబులో వందరూపాయలనోట్లు నాట్యం చేస్తున్నాయనుకోండి. అప్పుడు నా గురించి మీరేం అనుకుంటారు?" అని ప్రశ్నించాడు.

"ఏ బ్యాంకయినా దోచుకోవాలి. లేదా డబ్బున్న వాళ్ళనెవరినైనా చంపాలి" అన్నాడు ఇన్‌స్పెక్టర్ మామూలుగా.

"మొన్నటివరకూ వెంకటాచలం కూడా అలాగే వుండేవాడు. కానీ ఇప్పుడు దొరబాబులా తయారై చేతికి ఖరీదైన వాచీ పెట్టుకొని, డబ్బును నీళ్లలా ఖర్చుపెడుతున్నాడు. ఇంత డబ్బు సడన్‌గా అతనికెలా వచ్చిందో అర్థం కావడంలేదు" అన్నాడు సింగారం.

"వెంకటాచలం ఇప్పుడు ఎక్కడున్నాడు?" అని ఆసక్తిగా అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"బస్‌స్టాండు సమీపంలో 18వ నంబర్ ఇంట్లో వుంటున్నాడు"

ఆలస్యం చేయకుండా జీపును వెంకటాచలం ఇంటివైపు పరుగెత్తించాడు ఇన్‌స్పెక్టర్. ఆ సమయంలో వెంకటాచలం తీరుబడిగా ఇంటిముందు నిలబడి వున్నాడు. ఇన్‌స్పెక్టర్ అతన్ని సమీపించి, "వెంకటాచలం అంటే మీరేనా?" అని అడిగాడు. మఫ్టీలో వున్న ఇన్‌స్పెక్టర్‌ను వెంకటాచలం ఎగాదిగా చూసి, "ఔను ఏంకావాలి?" అని అడిగాడు.

సింగారం చెప్పినట్టు చాలా డాబుగానే వున్నాడు వెంకటాచలం.

"మీతో పనుంది. ఓసారి పోలీస్‌స్టేషన్‌కి వస్తారా?" అని అడిగాడు ఇన్‌స్పెక్టర్.

వెంకటాచలం ముఖంలో రంగులు మారాయి. అప్పుడర్థమైంది అతనికి, వచ్చిన తను పోలీసు మనిషని. ఇక ప్రశ్నించి లాభం లేదనుకొని ఇన్‌స్పెక్టర్ వెంట జీపులో పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళాడు.

పోలీస్‌స్టేషన్‌లో ఇన్‌స్పెక్టర్ ప్రశ్నల ధాటికి తట్టుకోలేక నిజం చెప్పేశాడు వెంకటాచలం.

"నేనో నిరుద్యోగిని. డబ్బుకు చాలా ఇబ్బందిగా వున్న సమయంలో నా స్నేహితులతో కలిసి ఓ పథకం ఆలోచించాను. బ్యాంకు దగ్గర కాపుగాసి వచ్చేపోయేవాళ్లను దోచుకోవాలని నిర్ణయించుకున్నాం. అలాగే వరదన్‌ను చాలా రోజులనుండీ గమనిస్తూ వచ్చాను. అతను రోజూ బ్యాంకులో డబ్బు జమచేయడానికి వస్తాడని తెలుసుకున్నాను. చూడటానికి కూడా చాలా అమాయకుడిలా కనిపించాడు. ఆరోజు అనుకొన్న ప్రకారం బ్యాంకుకొస్తున్న వరదన్‌ను మధ్యలోనే అడ్డగించి నన్నో మఫ్టీలో వున్న పోలీసాఫీసర్‌గా నమ్మించి, "నీ దగ్గరున్న

 

దంతా నల్లడబ్బని తెలిసింది. పోలీస్‌స్టేషన్‌కి వచ్చి సంజాయిషీ చెప్పుకోవలసి వుంటుంది'' అన్నాను. దానికతను ''కంపెనీ డబ్బు బ్యాంకులో కట్టడానికి వెళుతున్నాను. మీకు నమ్మకం లేకుంటే మా షాపుకోసారి ఫోన్‌చేసి మా యజమానిని కనుక్కోండి'' అన్నాడు.

''అదేం కుదరదు. ముందు నువ్వు పోలీస్ స్టేషన్‌కి రావలసిందే'' అని బలవంతంగా నా సైకిల్‌పై కూర్చోబెట్టుకొని తీసికెళ్లాను. సగందూరం వెళ్లాక ఓ కిళ్ళీకొట్టు దగ్గర సైకిల్ ఆపి ఇద్దరికీ సోడా తీసుకున్నాను. వరదన్ చూడకుండా ఓ సీసాలో మత్తుమందు కలిపి తాగమని ఇచ్చాను. సోడాతాగి కాస్త దూరం వెళ్ళేసరికి అతను స్పృహతప్పి పడిపోయాడు. అక్కడే దగ్గరలోవున్న చెరకుతోటలోకి అతన్ని ఈడ్చుకెళ్లి డబ్బంతా తీసుకొని పక్కనే చెట్ల గుబుర్లలో పడివున్న ఓ ఇనుపరాడ్‌ను అతని చేతిలో పెట్టాను. మూర్ఛరోగం అని అందరూ నమ్ముతారని అనుకున్నాను. కానీ చనిపోతాడని ఏమాత్రం ఊహించలేదు. దొంగిలించిన డబ్బులో ఖర్చుకాగా మిగిలిన మొత్తాన్ని అంటే 20 వేలను పార్క్‌లో పాతిపెట్టాను'' అని అంతా చెప్పి నేరం ఒప్పేసుకున్నాడు వెంకటాచలం.

ఉద్దేశ్యపూర్వకంగా చేసిన హత్య కాదు కాబట్టి వెంకటాచలానికి జన్మఖైదు విధించింది కోర్టు. ప్రస్తుతం జైల్లో చువ్వలు లెక్కపెడుతూ కాలం గడుపుతున్నాడు వెంకటాచలం.

# వ్యామోహం

**జ**నవరి 1988లో, సురేశ్, పుష్ప అనే దంపతులు అమెరికానుండి బొంబాయికి వచ్చి, అక్కడే స్థిరపడ్డారు. సుమారు 45 సంవత్సరాల సురేశ్ న్యూయార్క్‌లో వ్యాపారం చేసి, అక్కడ వుండటం ఇష్టంలేక, పాతికేళ్ళ వయసున్న పుష్పతోపాటు స్వదేశానికి తిరిగి వచ్చాడు. అమెరికాలో ఆర్జించిన లక్షలాది రూపాయల్లో సగందాకా వెచ్చించి ఓ ఎనిమిదంతస్తుల రెసిడెన్షియల్ కాంప్లెక్స్‌నే కొన్నాడు సురేశ్. ఓ అపార్టుమెంటు తమకోసం అట్టిపెట్టుకుని, మిగతా ఏడింటినీ అద్దెకిచ్చేశారు. బొంబాయి లాంటి మహానగరంలో, అంత విశాలమైన ఏడు అపార్టుమెంటుల అద్దె అంటే మాటలు కాదు. ఆ అద్దెతోనే ఎంతో విలాసంగా బతకొచ్చు.

ఈ కాంప్లెక్స్‌తోపాటు మరికొన్ని రకాల ఆస్తులను కూడా కొనుగోలు చేశాడు సురేశ్. ఎంత డబ్బయినా అతనికి సరిపోయేదికాదు. కారణం తాగుడు ఒక్కటే కాదు, అతనికి రేసులాడే అలవాటు కూడా వుంది. ఎప్పుడూ డబ్బు అవసరంతో తపించిపోయేవాడు. అతనిలోని ఈ బలహీనతను కనిపెట్టిన పుష్ప, భర్త బాగా తాగివున్నప్పుడల్లా వివిధ డాక్యుమెంట్లపైన అతని సంతకాలు తీసుకోవటం మొదలుపెట్టి, అతికొద్ది నెలల్లోనే తాముంటున్న కాంప్లెక్స్‌తోపాటు ఆస్తులన్నీ తన పేర మార్పించుకుంది. సురేశ్ పేరున వున్న ఆస్తులన్నీ తనపరం కాగానే అతన్ని ఇంట్లోంచి తరిమేసింది. అతనికి విడాకులిచ్చేసి తెగతెంపులు చేసుకుంది కూడా.

పాతికేళ్ళ వయసులో పొందికైన అవయవ సౌష్టవంతో చూడముచ్చటగా వుండే పుష్ప, డబ్బు వసూళ్ళ విషయంలో మాత్రం చాలా కరుకుగా, నిక్కచ్చిగా వుండేది. అద్దెకున్నవాళ్లంతా ఖచ్చితంగా మొదటితేదీన అద్దె ఇవ్వకపోతే మరుక్షణంలో వాళ్లపై విరుచుకుపడి ఖాళీ చేయమని చెప్పేది. ఆ కాంప్లెక్స్‌లోనే అద్దెకుంటున్న ప్రభాకర్ పిరళి అనే ఆయన డబ్బు విషయంలో పుష్పకు తగినవాడు. ఖచ్చితంగా మొదటితేదీన అద్దె ఇచ్చేయటం ఆయనకు వ్యక్తిగతంగా కూడా అలవాటు. అందుకుతోడు పుష్ప కూడా ఒకటో తారీకున ఖచ్చితంగా వచ్చి అద్దె తీసుకోవటం కూడా ఆయనకు బాగా అలవాటయిపోయింది. అలాంటిది, జూలై నెలలో ఒకటోతేదీన అద్దె

వసూలుకు పుష్ప రాకపోవటం ప్రభాకర్ పిరళి తోపాటు ఇతర వాటాదారులకు కూడా ఆశ్చర్యం కలిగించింది.

తెల్లవారింది. ఆరోజు 1988 సంవత్సరం, జూలై 2వ తేదీ. ఆరోజు కూడా అద్దె వసూలుకు పుష్ప రాలేదు. సరే, తను మాత్రం ఖచ్చితంగా ఇచ్చేద్దామని పుష్ప వుండే ఫ్లాట్‌కు వెళ్లాడు ప్రభాకర్ పిరళి. కాలింగ్‌బెల్ పుష్‌బటన్ నొక్కాడు. సమాధానం రాలేదు. ఎందుకో అదంతా అసాధారణంగా, అనుమానాస్పదంగా అనిపించి, అపార్టుమెంట్ వెనుకవైపు వెళ్లాడు. వెనకవైపు తలుపు అనూహ్యంగా తెరుచుకుంది. లోపలికి వెళ్లాడు. ఇంట్లో ఎక్కడా పుష్ప జాడ కనిపించలేదు. బాత్‌రూం టబ్బులో నెత్తుటి మడుగులో వడివున్న పుష్ప నిర్జీవ దేహం దర్శనమిచ్చిందతనికి. ప్రూన్పడిన ప్రభాకర్ పిరళి కాస్సేపటికి తేరుకుని, వెంటనే అక్కణ్ణించి బైటికొచ్చి, పొరుగువాళ్ళని హెచ్చరించి పోలీసులకు ఫిర్యాదు చేశాడు.

బాత్‌టబ్బులో వున్న పుష్ప శరీరంపైన లెక్కలేనన్ని కత్తిపోట్లు కనిపించాయి పోలీసులకు. బెడ్‌రూంలోని మంచమ్మీది దుప్పటి నెత్తుటితో తడిసిపోయివుంది. పడగ్గది పరిస్థితిని బట్టి ఆమెకు బాగా తెలిసిన వ్యక్తి ఎవరో, ఆమెను అక్కడ పొడిచేసి బాత్‌రూంకు మోసుకుపోయి అక్కడి టబ్బులో పడేశాడని అభిప్రాయపడ్డారు పోలీసులు. హత్యకు ఉపయోగించిన హత్యాయుధమైన సామాన్యమైన కత్తి మంచంకిందే దొరికింది. దాంతో హంతకుడు ఆరితేరిన నేరస్తుడు కాకపోవచ్చునని భావించారు. ఆమె ఖచ్చితంగా అద్దెవసూలు చేయటంవల్ల కోపంతోనో, లేదా అసూయతోనో కిరాయిదారుల్లో ఎవరో తాత్కాలిక ఆవేశంతో హత్య చేసివుండవచ్చని అనుమానించారు పోలీసులు. కానీ అందుకు తగిన పరిస్థితులు కనిపించకపోవటంతో ఆ ఆలోచన మానేసి, ఇతర కారణాలను అన్వేషించటంలో పడ్డారు.

ఇంటిని క్షుణ్ణంగా గాలించిన మీదట రెండు విదేశీ చొక్కాలు కనిపించాయి. వాటిపైనున్న గుర్తులను బట్టి అవి న్యూయార్క్‌లో తయారైనవిగా నిర్ధారించారు. హత్య రాత్రి 10 గంటల ప్రాంతంలో జరిగినట్టు శవపరీక్షలో తేలింది. ఏదో ఒక సమయంలో పుష్ప అనుమతితోనే ఇంట్లోకి ప్రవేశించిన హంతకుడు, హత్యచేసి, రాత్రి 11 గంటల ప్రాంతంలో వెనకతలుపుగుండా బైటపడి వుండొచ్చునను కుని, ఆ సమయంలో దగ్గర్లోని టాక్సీస్టాండు నుండి వెళ్లిన వాళ్లను గురించి టాక్సీ డ్రైవర్లను విచారించారు పోలీసులు. రాత్రి 11 గంటల ప్రాంతంలో ఓ యువకుణ్ణి విమానాశ్రయానికి దగ్గర్లో వున్న ఓ హోటల్‌ముందు వదిలినట్టు తెలిపాడు ఓ టాక్సీడ్రైవర్. తమ విచారణను హోటల్‌లో కొనసాగించారు పోలీసులు. విదేశాలకు వెళ్ళే చాలామంది ప్రయా



ణీకులు తమ తగ్గర బసచేస్తారని, అలాంటివారిలో ఈ ఫలానా వ్యక్తి ఒకరైవుంటే పొద్దున్నే ఏదో విమానంలో, ఏదో దేశానికి వెళ్లిపోయి వుండవచ్చుననీ వివరించారు హోటల్ సిబ్బంది. దాంతో న్యూయార్క్ తయారీచొక్కాల ఆధారంగా ఆ వ్యక్తి న్యూయార్క్‌కు వెళ్ళాడని భావించి, ఆరోజు న్యూయార్క్ ప్రయాణీకుల జాబితాను ఎయిర్‌పోర్ట్‌లో పరిశీలించారు పోలీసులు. ఈ తతంగం జరుగుతుండగానే పుష్ప ఇంట్లో 'అభిజిత్' అనేవ్యక్తి రాసిన ఉత్తరాలు దొరికాయి. వాటి ఆధారంతో హోటల్లో ఆరాతీసిన పోలీసులకు అక్కడ అభిజిత్ అనే పేరుతో ఎవరూ బసచేసిన దాఖలా కనిపించలేదు.

ఎవరీ అభిజిత్? పుష్పకూ అతనికి గల సంబంధం ఏమిటి? పుష్ప గతజీవితం ఏమిటి?





యవ్వన ప్రాంగణంలోకి అడుగిడుతున్న తరుణంలో పుష్పకు కూడా అందరు అమ్మాయిల్లాగే ఎన్నో కలలు, చాలామందిలాగే ఎన్నో కోరికలు, ఆశలు, ఖరీదైన వస్తువులపట్ల మక్కువ, ఖరీదైన జీవితమంటే ఆసక్తి, విదేశీవస్తువులపట్ల మోజు, విదేశాలలో వుండాలని తపన వుండేవి. పుష్ప బియ్యే చివరి సంవత్సరం చదువుతున్నప్పుడు విదేశాలలో వుండే ఓ దూరపుబంధువు కోయంబత్తూరుకు వచ్చాడు. అతన్ని చూసిన పుష్పకు అతనిపట్ల ఎంతో ఇష్టం ఏర్పడింది. వయసులో తనకన్నా చాలా పెద్దవాడైనప్పటికీ, అతను అమెరికాలో వుంటుండటం చేత, ఇష్టపడి అతన్ని పెళ్ళి చేసుకోవటానికి ఒప్పుకుంది. అతని పేరు మోహన్. మోహన్‌కూ, పుష్పకూ 1984వ సంవత్సరం జూలై 3వ తేదీన కోయంబత్తూరులో వివాహం జరిగింది. తన చదువును అర్ధాంతరంగా వదిలేసి, అతనితోపాటు అమెరికా బయలుదేరడానికి సిద్ధపడింది పుష్ప.

అమెరికాలో అడుగిడగానే తన ఆశలు అడియాసలయ్యాయని గ్రహించింది పుష్ప. మోహన్‌కు అప్పటికే పెళ్ళయింది. అతనికి తన వయసున్న ఓ కూతురూ, ఓ కొడుకూ వున్నారని తెలిసిన పుష్ప, మోహన్‌మీద విరుచుకుపడింది. తన భార్య చనిపోవటంవల్ల తానామెను పెళ్లి చేసుకున్నాననీ, తన ఆస్తిలో సగంవాటా ఆమెకే ఇస్తాననీ చెప్పి, పుష్పని ఊరడించాడతను. చాలా పెద్ద మొత్తపు ఆస్థికి అధికారిణి అవటంతో విలాసవంతమైన జీవితం గడపనారంభించింది పుష్ప. ఖరీదైన పార్టీలు, నైట్‌క్లబ్బులూ, జల్సాలూ బాగా అలవాటయ్యాయి. కొద్దికాలానికి మోహన్ కొడుకు ఓ ఉద్యోగంలోచేరి సంపాదనాపరుడయ్యాడు. మోహన్ కూతురు ఒకతన్ని ప్రేమించి పెళ్లిచేసుకుంది. కొద్దిరోజులు గడిచాయి. ఆగస్ట్ 1987లో, ఓ కారు ప్రమాదంలో మోహన్ మరణించాడు. అతని యావదాస్తికీ హక్కుదారయింది పుష్ప.

భర్త మరణించిన అతికొద్దిరోజులకే సురేశ్ పరిచయమయ్యాడు పుష్పకు. సురేశ్ కూడా భార్య లేనివాడు. అతని వయసు కూడా తక్కువేం కాదు. సుమారు 45 సంవత్సరాలుంటాయి. కానీ డబ్బున్నవాడవటంతో అతన్ని పెళ్లిచేసుకుంది పుష్ప. న్యూయార్క్ జీవితంతో విసిగిపోయిన సురేశ్, పుష్పను పెళ్ళి చేసుకున్న వెంటనే బొంబాయికి మకాం మార్చాడు. అతితొందరలోనే అతని ఆస్తిని తన పేర మార్చుకుని, అతనికి విడాకులిచ్చింది పుష్ప.

మరణించిన పుష్ప గదిలో దొరికిన ఉత్తరాల ద్వారా అభిజిత్ గురించి కొన్ని విషయాలు తెలిసాయి పోలీసులకు. ఇతను పుష్ప మొదటి భర్త మోహన్ కొడుకు. తన తండ్రి ఆస్తిలో కనీసం సగమైనా తనకు ఇమ్మని చాలాసార్లు అతను ఉత్తరాలు రాశాడని అర్థమయింది కనుక, ఆ విషయమై వ్యక్తిగతంగా చర్చించటానికి అభిజిత్, న్యూయార్క్‌నుండి బొంబాయికి వచ్చి వుండవచ్చునని ఊహించారు పోలీసులు. ఎంతో పెద్ద నేరస్తుడైతే తప్ప, దొంగపాస్‌పోర్టుతో ప్రయాణించే సాహసం చేయడు. కనుక ఎయిర్‌పోర్ట్‌లో అభిజిత్ అసలు పేరు దొరికే అవకాశం వుండాలని భావించి ఆరాతీసిన పోలీసుల ప్రయత్నం ఫలించింది. న్యూయార్క్ విమానపు రిజర్వేషన్ జాబితాలో అభిజిత్ పేరు కనిపించింది పోలీసులకు. ఆ విమానం ఆ సాయంత్రం బయలుదేరనుంది. మఫ్టీపోలీసులు విమానాశ్రయంలో కాపు కాశారు. బోర్డింగ్ టికెట్ తీసుకోబోతున్న అభిజిత్‌నే ఒక విమానాశ్రయ ఉద్యోగి పోలీసులకు చూపించింది. అతను రాసిన ఉత్తరాలను ముందుగా చూపించి, ఆ తరవాత అరెస్ట్ చేశారు పోలీసులు.

"నేనామెను చంపాలనుకోలేదు. కాస్త వివరంగా, సామరస్యంగా విషయాలు మాట్లాడుకోవటానికి నేను ఇండియా వచ్చాను. నాకు చిల్లిగవ్వ ఇవ్వటానికి కూడా ఆమె ఒప్పుకోలేదు. దాంతో కోపం వచ్చి, ఆ దుర్మార్గురాలిని తాత్కాలికంగా కలిగిన ఆవేశంతో, వంటగదిలోని కత్తితో పొడిచి చంపేశాను" అని వివరించాడు అభిజిత్.

ఏదైమైనా అలవిమీరిన ఆశతో పాతికజన్మలకు సరిపడా ఆస్తిని పోగేసుకున్న పుష్ప, అదంతా అనుభవించకుండా పాతికేళ్ళకే నూరేళ్ళూ నిండినట్లు ప్రాణాలు కోల్పోయింది.





# చతుర ప్రపంచం

## భారీ పూజారి

'చెట్టంత మనిషి' అన్న పదానికి రాజారామ్ చక్కగా సరిపోతాడు. మహాభారీ కాయంతో, ఎనిమిది అడుగుల ఎత్తున చిన్నసైజు పర్వతంలా కన్పించే రాజారామ్ ప్రస్తుతం మహారాష్ట్రలోని 'తాలేగాఁవ్' గ్రామంలో పూజారిగా ఉంటున్నాడు. అతని భారీ ఆకారాన్ని చూసి, పిల్లనివ్వడానికెవరూ ముందుకురాకపోవడంతో 'షష్టిపూర్తి' వయసు దాటిపోయినా ఇంకా బ్రహ్మచారిగానే కాలం గడుపుతున్నాడు రాజారామ్.

పదిహేనో సంవత్సరం వచ్చేవరకూ అందరి పిల్లల్లాగే ఉండేవాడు రాజారామ్ కులకర్ణి. అప్పటినించే అతని శరీరంలో గణనీయమైన మార్పులు సంభవించడం మొదలయింది. రెండు సంవత్సరాలు గడిచేసరికి అతను ఎనిమిది అడుగులు పొడవెదిగాడు. శరీరం కూడా అందుకు తగ్గట్టుగానే ఊరిపోయింది. పాదాలు ఏనుగు పాదాల సైజులో ఉండడంతో ఆ సైజు చెప్పులు దొరక్క విలవిల్లాడిపోయాడు రాజారామ్. ఎలాంటి వ్యాయామం చేయకుండానే అతనికి విపరీతమైన బలం చేకూరింది. అతని బలం ఎలాంటిదంటే- ఓసారి పొలంలో నాగలి దున్నేప్పుడు దున్నపోతులు విసిగించాయన్న కోపంతో వాటిని రెంటినీ అవలీలగా ఎత్తి బావిలో పారేశాడతను. ఆ వార్త తెల్సి ఊరు ఊరంతా అక్కడికి చేరింది. అతిప్రయత్నంమీద ఇనుప గొలుసులువేసి దున్నపోతుల్ని బయటికి తీశారు. పాపం బాగానే గాయపడ్డాయవి. అయితే చేసిన దరిద్రప్పనికి తండ్రి బడితపూజ చేయడంతో వాటికంటే ఎక్కువగానే గాయపడ్డాడు రాజారామ్. యవ్వనప్రాయంలో తాను చేసిన సాహసాల్ని ఛలోక్తులతో చక్కని హాస్యంతో రంగరించి రాజారామ్ చెబుతుంటే వినడానికి భలే పసందుగా ఉంటాయి.



ఓసారి మేనకోడలి పెళ్ళికని మన్మాడ్ వెళ్ళాడు రాజారామ్. పెళ్ళి విషయాన్ని అవతలపెట్టి జనం మొత్తం అతని చుట్టూ మూగారట. పోలీసులు రంగంలోకి దిగి చెదరగొట్టాల్సినంతపనైందట. ఇలాంటి బెడద వచ్చిపడుతుందనే భయంతోనే చిరకాలంగా బొంబాయిని దర్శించాలని ఉన్నా సాహసం చేయలేకపోతున్నాడతను. ''అంతెందుకు? ఇంట్లోంచి కాలు బయటపెట్టడమే సమస్యగా మారింది. చిన్నపిల్లలు కుక్కలు ఓ 'వింతమృగాన్ని' చూసినట్లు చూస్తూ వెంటబడి తరుముతున్నారు'' అని వాపోతున్నాడతను.

భారీ శరీరంవల్ల అతనికి కొన్ని ఉపయోగాలూ కన్పించాయట. తన ఆకారాన్ని చూసి ఆలయాధికారులు తానేదో దైవాంశసంభూతుడని భావించడంవల్లనే తనకీ పూజారీ ఉద్యోగం లభించిందంటాడు రాజారామ్. జనతాపార్టీ ప్రభంజనం సృష్టించిన కాలంలో ఎన్నికల ప్రచారంలో భాగంగా తన భుజాన నాగలి నుంచి లారీపై ఎక్కించి ఊరేగించారట. జనతాపార్టీ ఎన్నికల చిహ్నం 'భుజాన నాగలి ఉంచుకొన్న రైతు' అన్న విషయం అందరికీ తెలిసిందే గదా? అప్పుడు తన ఫొటోలు చాలా పేపర్లలో వచ్చాయని ఆనందంగా చెబుతాడు రాజారామ్.

వ్యవసాయం చేసుకుంటూ, అవసరాన్ని బట్టి గ్రామంలో అర్చకత్వం సాగిస్తూ బతుకుసాగిస్తున్న రాజారామ్ వృద్ధాప్యంలో పడ్డా, 'ఉక్కుముక్కలా' దృఢంగా కనబడుతుండటం విశేషమే!

---

## స్వచ్ఛందమరణోద్యమం

**ఆ**త్మహత్యని చట్టబద్ధంచేయాలనే వాదన ఇటీవల బాగా ప్రబలిపోయింది. 'ప్రాణాన్ని




చాలించే హక్కు' కోసం ఉద్యమాలు సైతం మొదలై బలంగా వేళ్లూనుకొన్నాయి. దీనికి అంకురార్పణ ఇంగ్లాండ్‌లోనే జరిగింది. చచ్చే హక్కును సాధించడం కోసం అక్కడ కొందరు వ్యక్తులు 'నిష్క్రమణం' అనే పేరుతో ఓ స్వచ్ఛందసంస్థను స్థాపించారు. సుమారు 9,000 మంది సభ్యులు గల ఆ సంస్థ 'ఏ గైడ్ టు సెల్ఫ్ డెలివెరెన్స్' అనే పుస్తకాన్ని ప్రచురించింది. ఎలాంటి పరిస్థితుల్లో మనిషి ఆత్మహత్యకు పూనుకుంటాడు? అలాంటప్పుడు అతడు ఎన్నిరకాలుగా ప్రాణం తీసుకోవచ్చు? అనే విషయాలు దానిలో కూలంకషంగా చర్చించబడ్డాయి. కాని ప్రభుత్వం నిషేధిస్తుందన్న భయంతో ఆ పుస్తకం విడుదలకు నోచుకోలేదు. అయితే ఆ సంస్థ ప్రధాన ఆశయాలు. సభ్యుల అభిప్రాయాలు కూడా పొందుపరచి ఆ పుస్తకాన్ని సభ్యులకు

మాత్రమే పంచిపెట్టడం జరిగింది.

ఆ పుస్తకానికి ముందుమాట రాస్తూ ప్రఖ్యాత రచయిత ఆర్థర్ కాయిజ్‌లర్ "ప్రశాంతంగా మనిషి జీవితాన్ని చాలించేందుకు మందులు ప్రత్యేకంగా తయారు చేయాల్సిన అవసరం నేడు ఎంతైనా ఉంది. దీర్ఘరోగాలతో బాధపడేవారికి అనాకారులై, అంగవికలురై ఆత్మన్యూనతతో పరితపించేవారికి స్వచ్ఛందంగా మరణించే హక్కును ప్రభుత్వాలు ప్రసాదించాలి. ప్రభుత్వాలకి ఆపాటి జ్ఞానం సమకూరడానికి ఇంకా చాలాకాలంపడుతుంది. కనుక అంతవరకూ ఈ గైడులో సూచించిన పద్ధతుల్ని పాటించి ఎవరైనా సరే ఆనందంగా కన్నుమూయవచ్చు..." అని ప్రవచించాడు. ఆ మరుసటి సంవత్సరమే భయంకరరోగపీడితుడైన సదరు రచయిత అధిక సంఖ్యలో నిద్ర మాత్రలు మింగి ప్రాణాలు తీసుకున్నాడు.

కాయిజ్‌లర్ మరణం ఎన్నో వాదవివాదాలకు కారణభూతమైంది. ఇరువర్గాలవారూ వేదికలెక్కి సవాళ్లు విసురుకునేంతవరకూ పరిస్థితి ముదిరిపోయింది. నయంకానిరోగాలతో క్షణ క్షణం చస్తూ కొన ప్రాణంతో బ్రతికేకన్నా హాయిగా ఆత్మహత్య చేసుకోవడం మేలుగదా? రకరకాల హక్కులు సాధించుకున్న మనిషికి తన ఇష్టప్రకారం ప్రాణం తీసుకునే హక్కులేకపోవడం శోచనీయంకాదా? "అని వాదించారు ఆత్మహత్యని సమర్థించేవారు. పరిస్థితుల్ని ఎదిరించలేకప్రాణం తీసుకోవడం పిరికితనంకాదా? ఏదో ఆవేశంతో పుటుక్కున ప్రాణం తీసుకుంటే పోయిన ప్రాణం తిరిగి వస్తుందా? మీ దృష్టిలో ప్రాణం అనేది అంత చౌకబారు వస్తువా? అని ఎదురు వాదించారు ప్రత్యర్థులు.

ఏదేమైనా స్వచ్ఛంద మరణోద్యమానికి జనక స్థానాలు పాశ్చాత్య దేశాలే. తర్వాత యూరప్, ఆసియా, ఆస్ట్రేలియా, అమెరికా ఖండాలలో మొత్తం మీద పద్ధెనిమిది దాకా నిష్క్రమణ సంస్థలు పుట్టుకొచ్చాయి. గత అయిదేళ్లలో వీటి సంఖ్య మరింత పెరిగింది. ఈ సంస్థలు రకరకాల డెత్ గైడ్స్‌ని ప్రచురించడం మొదలెట్టాయి. లాస్‌ఏంజిల్స్‌లోని హెమ్‌లాక్ సంస్థ 'లెట్ మి డై బిఫోర్ ఐ వేక్' అనే పుస్తకాన్ని ప్రచురించింది. క్లోయిడ్ గులాన్, యస్‌బాని అనే ఇద్దరు ఫ్రెంచి రచయితలు రాసిన 'స్యూసైడ్ ఆపరేటింగ్ ఇన్‌స్ట్రక్షన్స్' కూడా ఆ కోవకు చెందినదే.

ఆత్మహత్యల్ని ప్రోత్సహించే ఉద్యమాలు బలపడుతున్న కొద్దీ వాటిని వ్యతిరేకించే సంఘాలూ, ప్రభుత్వాలు అప్రమత్తత వహించడం మొదలెట్టాయి. 'స్యూసైడ్స్ ఇన్ అమెరికా' గ్రంథకర్త డాక్టర్ హెర్ బర్ట్‌హెండిన్ ఆత్మహత్యోద్యమాల్ని బాగా నిరసించాడు. డెత్ గైడ్స్‌ని నిషేధించవల్సిందిగా ప్రభుత్వాల్ని ఆయన కోరాడు. ఫ్రాన్స్‌లోని ఆరోగ్యమంత్రిత్వ శాఖ కూడా అదే అభిప్రాయాన్ని వ్యక్తంచేస్తోంది.

## అందచందాల నగరం

ఆ అందమైన బీచ్‌లో మీతోపాటు కల్సి సరదాగా నవ్వుతూ, తుళ్లుతూ విహరించేందుకు అమ్మాయిలు కూడా దొరుకుతారు. ఆ ఏర్పాట్లు అక్కడి ప్రభుత్వమే చేసింది గనుక ఏ భయం లేదు. అందుకోసం కొంచెం మూల్యం చెల్లించుకుంటే చాలు. అంత మాత్రాన ఆ సుందరాంగులతో మరీ శృతిమించి వెర్రిమొర్రి వేషాలేస్తే మాత్రం అరదండాలు తప్పవు. ఎందుకంటే అక్కడ వ్యభిచారం నిషిద్ధం. అరే అలా నీరుకారిపోకండప్పుడే! అమ్మాయిల్ని గురించి కాకపోయినా ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదించడం కోసమైనా మీరక్కడికి ఓసారివెళ్లి తీరాల్సిందే! బల్గేరియాలోని వారనా నగరాన్ని సందర్శించినవారెవరైనా ఈ విషయాన్ని ఒప్పుకుతీరతారు. ఒకసారి ఆ నగరాన్ని అక్కడి అందమైన బీచ్‌ని చూసిన వారెవ్వరికీ తిరిగి దాన్ని విడిచి పోవాలంటే మనసొప్పదట. అవడానికి బల్గేరియాకి రాజధాని సోఫియా పట్టణమైనా పేరు ప్రఖ్యాతులన్నీ వారనాకే దక్కుతున్నాయి. నల్ల సముద్రతీరంలో విశాలమైన రోడ్లు, అందమైన ద్రాక్షతోటలు, పార్కులు, ఆధునిక భవంతు







లతో పాటు, అద్భుతమైన అందచందాలతో. కళ్ళకు విందుచేసే బల్గేరియన్ యువతీయువకులూ సందర్శకుల్ని విపరీతంగా ఆకట్టుకొంటారు. కేవలం సందర్శకులకు వసతి సౌకర్యాలు కల్పించడం కోసం వారనాలో 80కి పైగా హైక్లాస్ స్టార్ హోటళ్ళు, 2000 పైగా మిడిల్ క్లాస్ హోటళ్ళూ ఉన్నాయి. ఏటా 20 లక్షలకుపైగా విదేశీయాత్రికులు ఇంగ్లాండ్, ఫ్రాన్స్, జర్మనీ, సోవియట్ రష్యా, పోలెండ్, అరబ్బీదేశాలనుంచి వారనాకు వస్తుంటారు.

ప్రపంచంలో ఎక్కడా లేని ప్రత్యేకత వారనాకు ఉంది. సముద్రతీరంలో దట్టమైన కీకారణ్యాల్ని విశాలమైన మైదానాల్ని ఏక సమయంలో దర్శించే అవకాశం కేవలం ఆ నగరంలోనే లభిస్తుంది. సోఫియా పట్టణంనుంచి 500 కిలోమీటర్ల దూరంలో నున్న వారనాకు రైలు, రోడ్డు, సౌకర్యాలతోపాటూ విమాన సౌకర్యమూ ఉంది. విమానంలో వెళ్లాలంటే స్థానికులకి 13 లైవాలు ఖర్చయితే విదేశీయాత్రికులకి 23 లైవాలు ఖర్చవుతాయి. ఈ భేదభావాన్ని వారు తప్పుగా భావించరు. తరచూ తుఫానులతో ప్రాణ నష్టం సంభవిస్తున్నా అందుకు కారణమైన నల్ల సముద్రాన్ని వారెప్పుడూ నిందించరు. పైగా ప్రేమిస్తారు. అదంటే వారికెంతో మక్కువ.

---

## శృంగార సార్వభౌముడు

అతను ధరించే దుస్తుల్ని చూసి బడాబడా ధనవంతులే కళ్లు తిరిగి పడిపోతారు. నిత్యం విమానయానాలు చేస్తూ సరదాగా ప్రపంచమంతా చుట్టివచ్చే అతగాణ్ణి చూసి కోట్లకు పడగలెత్తినవాళ్లే కుళ్లు కుంటుంటారు. రాజభవనాల్ని తలదన్నేలా ఉండే ఆయనగారి నివాస గృహాల్ని చూసి మహారాజులే మూర్ఛపోతారు. అతని దర్జా చూసి దేశాధినేతలే నివ్వెరపోతారు. అతనికున్న పలుకుబడికూడా అసామాన్యం. చిటికనవేలు కదిలించి ప్రపంచాన్ని శాసించగల సత్తా ఆయనకుంది.

అతనెవరో కాదు అమెరికాకు చెందిన రూబెన్‌స్టార్‌మన్. అరవై అయిదేళ్ల రూబెన్‌కు అమెరికాలో ఓ సొంత సామ్రాజ్యమే ఉంది. అతని పేర స్విస్ బాంకుల్లో కొన్ని కోట్ల డాలర్లు మూలుగుతున్నాయి. అవిగాక అమెరికా మొత్తం మీద అతనికెన్నో కంపెనీలున్నాయి. కంపెనీలేమిటి? ఇంతకీ అతనిదేం వ్యాపారం? అని ఆశ్చర్యపోకండి. అతను చేసేది 'బూతు'వ్యాపారం. అర్థంకాలేదా? 'బూతు' వ్యాపారమంటే నీలిచిత్రాలు తీయడం, శృంగార సాహిత్యాన్ని అమ్మడం. అవును

నిజం. కేవలం ఈ వ్యాపారంమీదే అతను కోట్లు గడించి ప్రపంచ ధనికులలో ఒకడిగా కీర్తి పొందాడు.

అతను ఇప్పటివరకూ 13 సార్లు అరెస్టయ్యాడు. కానీ ఏ ఒక్కసారీ కొన్ని గంటల కంటే ఎక్కువసేపు పోలీస్ స్టేషన్‌లో ఉండలేదతను. కారణం తిమ్మిని బమ్మిని చేయగల న్యాయవాదులెందరో అతని కొలువులో ఉన్నారు. అందుకే చట్టం సైతం అతన్ని ఏం చేయలేకపోయింది. పోలీసులు అతన్ని ముద్దుగా 'సెక్స్ మోనార్క్' అని పిలుస్తారు. అయితే ఇటీవల అతనిమీద గట్టి నిఘావేసి బలమైన సాక్ష్యాధారాలు సేకరించారు పోలీసులు. అతను దొరిగితే అతని పైనున్న నేరాల్ని పురస్కరించుకొని ఆయుర్దాయం ఉంటే అతనికి 500 సంవత్సరాల వరకూ కఠిన కారాగార శిక్షపడే అవకాశం ఉంది. కాని అతడు దొరకడుగదా? రకరకాల మారువేషాల్లో తిరుగుతూ అమెరికన్ పోలీసుల్ని ముప్పుతిప్పలు పెట్టి ముప్పై చెరువుల నీళ్ళు తాగిస్తున్నాడు.

## అసలు రంగు

'మేగ్నిఫిషియంట్ సెవెన్', 'పాపిలాన్', 'గ్రేట్ ఎస్కేప్' వంటి హిట్ చిత్రాలలో నటించిన హాలీవుడ్ సూపర్‌స్టార్ స్టీవ్ మాక్వీన్‌కు ప్రపంచవ్యాప్తంగా కోట్లాదిమంది వీరాభిమానులున్నారు. కాన్సర్ కారణంగా కొన్నేళ్ళ క్రితం ఆయన మరణించినపుడు అభిమానులంతా విపరీతంగా ఏడ్చారు. కొందరైతే బతుకుమీదేరోతతో ఆత్మహత్యలకు పాల్పడ్డారు. మరికొందరు గడ్డాలు, మీసాలు పెంచేసుకొని సన్యాసుల్లో కల్సిపోయారు. ఈవివరాల్ని బట్టి అభిమానుల హృదయాల్లో ఆ హీరోగారికి ఎలాంటి స్థానం ఉందో మనం సులభంగా ఊహించుకోవచ్చు.



కానీ దేవుడిలా కొలవబడిన సదరు హీరోగారి అసలు రంగు ఇటీవలే బయటపడడంతో అభిమానులు తెల్లముఖాలు వేశారు. అతని విపరీత ప్రవర్తనవల్లే మూడు పెళ్ళిళ్ళు చేసుకున్నా ఒక్కటీ నిలవకుండా పోయిందని తెలిసి జనం విస్తుబోయారు. నాలుగు గోడల మధ్య జరగవల్సిన శృంగారాన్ని బట్టబయలు చేసేలా ప్రవర్తించడం, నిస్సిగ్గుగా వ్యవహరించడం స్టీవ్ మాక్వీన్ హాబీనట! సెక్స్ కార్యకలాపాల్లో కూడా శాడిస్ట్‌గా వ్యవహరించి, అవతలి వ్యక్తికి అదో భయంకరమైన అనుభవంగా మిగిల్చేవాడట అతను. అతని విపరీత చేష్టలు భరించలేకనే అతని భార్యలు విడాకులు పుచ్చుకుని పారిపోయారట. పార్టీల్లోనూ, పదిమందిలోనూ ఉన్నప్పుడు కూడా కంటికినచ్చిన అమ్మాయి కనబడితే ఆమె చెయ్యిపట్టుకొని సరాసరి ప్రక్కగదిలోకి లాక్కుపోయేవాడట. పదినిముషాలయ్యాక బయటకువచ్చి తన ప్రతాపాన్ని గురించి ఆమె అవయవ సంపద గురించి వచ్చివచ్చిగా అభివర్ణించే వాడట. అతని విచ్చలవిడి శృంగారానికి తెరపడింది కాన్సర్ ప్రారంభమైనపుడే! అతనా రోగాన్ని గురించి ఎవరికీ తెలియనీకుండా గుట్టుగా దాచాడు. నిజంపొక్కకూడదని పత్రికలకి ఇంటర్వ్యూలు సైతం ఇవ్వడం మానేశాడు... ఇత్యాది వివరాలన్నీ బయటపెట్టిన ఘనత ఫెనియాసాస్టెగల్‌ది. నిజాయితీ పరుడిగా సుప్రసిద్ధుడైన ఆ రచయిత 'ది స్టోరీ ఆఫ్ ఎ బాడ్ బోయ్' అనే తన తాజా పుస్తకంతో హీరోగారి బండారాన్ని బట్టబయలు చేశాడు. ఆ పుస్తకం చదివి ఇన్నాళ్లూ తామెలాంటి దౌర్భాగ్యుణ్ణి ఆరాధ్యదైవంగా కొలిచేమోగదా అని బాధ పడుతున్నారు అభిమానులు.





# 'విముక్తి'పై చతుర సమీక్షలు

మార్చి చతురలో ప్రచురితమైన సి.వసంత నవల 'విముక్తి'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## దగాపడిన తమ్ముల ఆవేదన

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

'ఏజాతి చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం'- అన్నాడు మహాప్రస్థాన కవి. మహారాష్ట్ర వెళ్ళిన తెలుగు వడ్డర్ల మీద సాహిత్య అకాడెమీ అవార్డు గ్రహీత శ్రీ లక్ష్మణ గయక్వాడ్ ఆత్మకథఆధారంగా సి.వసంత సాహసిక రచన 'విముక్తి' ఆలోచన రేకెత్తించేదిగా వుంది. చతురలో వెలువడిన ఈ యదార్థ గాధ కొత్తపుంతలు తొక్కింది. సంతముచ్చుల నిత్యసంఘర్షణ అక్షరరూపంగాదాల్చిన విముక్తి- ఆద్యంతమూ నిర్వచనీయంకాని బాధనే మిగులున్తుంది . కథ చదువుతున్నంతసేపూ మనకు తెలిని మరో ప్రపంచపు మహారణ్యం గోచరమౌతుంది. ఇతిహాసపు చీకటికోణం అట్టడుగున పడి కన్పించని కథ వుంది యిందులో-

చిన్నప్పట్నుంచే దొంగతనాలు నేర్వకపోతే కడుపునింపుకోవట్టం కష్టమన్న పాథ్‌రూట్ జీవనసూత్రం, చదువుకుంటే ఎల్లమ్మకు కోపం వస్తుందనే భయమూ-భక్తి, ఎప్పుడోకాని స్నానంచేయక ఫినాయిల్‌తో పుళ్ళువడిన తలలు రుద్దే బతుకులు, ఆకలేసి పొలంలో జొన్న కంకులు కోసి దేహశుద్ధి చేయించుకునీ జరిమానా కట్టబోతే 'పదితులాల బంగారానికి ఆరు తులాలే లెఖ్ఖకద్తే', 'ఎవరిదీ దోపిడి-ఎవరికీ హింస' అనే మీమాంస, బ్లేడు మాలక్ష్మికీ, దాఖలాపత్రానికి మొక్కి సంపాదించి పట్టీలు కట్టి ఖాళీ ఔతున్న బతుకులు, జాతరలో సంతముచ్చులు దొంగతనం చేస్తే పోలీసులు-చేయకుంటే పాథ్‌రూట్ లు, తట్టుకోలేక కుంటివాడైన తిమ్మప్ప అసహాయత్వం, అమ్మమ్మ లేచిపోతే మనవరాలి పెళ్ళి శుద్ధీకరణ, గరుడపక్షి జ్ఞానం, చనుబాలు యిచ్చే భర్త, బిడ్డ దాహంకోసం పుత్రీ సాహసం, బిడ్డలకోసం బిడ్డను బలిచ్చిన అమాయకత్వం, అజ్ఞానం, చెన్నమ్మ వేడినెత్తురూ, నరసింహావతారం, ఇరవై తొమ్మిది గుహల్లో విఠల్‌గాయక్‌వాడ్ దివ్యానుభవం, దళితమహోద్యమం, అజయ్ నిష్క్రమణ, జగన్నాథరావు జ్ఞానోదయం-యిన్ని కతలు!

ఈ చిన్ని నవలలో దాదాపు అన్ని అసహాయతలు వ్యక్తీకరించిన, విముక్తికై అన్ని మార్గాలూ అన్వేషించిన సంవిధానం హర్షణీయం. 'సామాజిక ప్రయోజనమే కళకి సార్థకత' అనే నానుడిని నిజం చేసే సాహిత్యాస్త్రం విముక్తి.

-చివరికి

దళితవనంలో ప్రవేశించిన వసంతాన్ని ఆపలేని సుడిగాలులు, తుఫానులు- పాతనీరు పోయి క్రొత్తనీరు వచ్చి మరో ప్రపంచంలో కనిపించిన అగ్నికిరీటపు ధగధగలు, దళిత హోమజ్వాలల భుగభుగలు,'విముక్తి' బావుటా నిగనిగలు-

ఇది వాంఛనీయమైన రచన- ఇది అభిల.



షణీయమైన రచన.

భ్రష్టుల, బాధాసర్పదష్టుల, దగాపడ్డ తమ్ము లకై ఆవేదన పడిన రచన ఇది.

-రవి, రవిచంద్ర
- శ్రీనగర్.

## పరిష్కారం ఏమిటి?

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

**కేం**ద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత, లక్ష్మణ్‌గయక్వాడ్ ఆత్మకథ ఆధారంగా శ్రీమతి పి. వసంత రచించిన యథార్థగాథ "విముక్తి"లో పరిష్కారమార్గం దారుణంగా ఉంది.

దళితవర్గాలు మూఢనమ్మకాలతో, మూఢవిశ్వాసాలతో తాము శాపగ్రస్తులమని అనుకుంటూ దొంగతనం చేసే బతకాలని, లేకుంటే ఎల్లమ్మతల్లికి కోపం వస్తుందనీ అనుకుంటారు. తమకు మేలు చేసే విఠల్‌ను, భారతిని నమ్మలేకపోతారు. అయితే విచిత్రమేమంటే ఎప్పుడూ స్నానం కూడా చెయ్యకుండా తిండికి ఇబ్బందిపడుతూ ఉపవాసాలు ఉంటున్నారు అంటూనే... పోలీసులకు వేలకు వేలు లంచాలు ఇస్తుంటారు అని రచయిత్రి చెబుతారు. పిల్లలను చిన్నతనంనుండే కొట్టడం, పోలీసులు పెట్టే హింసకు తట్టుకునేలా తయారుచేయడానికి బూట్లతో తన్నటం, కండ్లలో కారం కొట్టడంలాంటివి చేస్తారు. తమకులం వారు దొంగతనాలే చేయాలనీ, చదువుకోకూడదనీ, లేకపోతే ఎల్లమ్మతల్లికి కోపం వస్తుందనీ అంటారు. అలాంటప్పుడు మేము దేవత చెప్పినందుకే దొంగతనం చేస్తున్నాము. మీకెందుకు లంచమివ్వాలి, కావాలంటే మా దేవతను అడగండి అనరేం?

చదువు రాదంటారు, చదువుకోకూడదంటారు. మరి అలాంటిది బ్రైన్‌లో నోట్లనంబర్లు గుర్తుపెట్టుకుని చెప్పడం విచిత్రంగా లేదా? అంతంత దొంగతనం చేసేవాళ్లు, వస్తు లుండటం ప్రసక్తే వుండకూడదు గదా తెలంగాణానుండి మహారాష్ట్రానికి వలస పోయినవారు ఇంకోచోటుకి పోవచ్చుకదా! పోరు, ఎందుకని? ఎల్లవ్వ పిల్లాడికోసం వేలు లంచం ఇవ్వటం, అన్నానికిలేక ఆకులు తినడం, పిల్ల చనిపోతే కట్టెలకు డబ్బులు లేకపోవడం అందుకూ దొంగ డబ్బే ఖర్చుపెడుతున్నాం అని బాధపడటం అయోమయంగా ఉంది. అంటే వారి మనసులో దొంగతనం తప్పని ఉండాలి. ఉంటే వారికి మానుకునే అవకాశం ఉంది. అలాగే విఠల్ లక్షరూపాయలు తీసుకున్నాడని నమ్మడం, ఆ డబ్బు పంచమనడం విడ్డూరంగా ఉంది.

చివరగా జగన్నాథరావులాంటి మొండివాళ్ళు విఠల్, భారతిలు చేపట్టిన పనులవల్లకాక కేవలం అజయ్ మరణంతో మారిపోవడం ఆశ్చర్యంగా వుంది.

-జె. ప్రమోద్‌కుమార్
నంద్యాల.

## వాస్తవ ప్రపంచం

*(మూడవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

**ఎం**దరో నేతల కృషి ఫలితంగా వచ్చిన స్వాతంత్ర్యం అగ్రవర్ణాల ధనికులకు మాత్రమే సద్వినియోగం అవుతోంది. దినమంతా వెట్టిచాకిరి చేయించుకొని తగిన కూలి డబ్బులు ఇవ్వక శ్రామికుల కడుపులు కొట్టి మేడలు కట్టే బడాబాబులు మనదేశంలో కోకొల్లలు.

కడుపులు కాలే బడుగువర్గాలవారు తీరని ఆకలి గురించి ఆలోచిస్తారే తప్ప చదువు గురించి ఆలోచించే ఓపిక వారికి ఉండదు. అగ్రవర్ణాల వారేమో బడుగువర్గాలవారిని హీనంగా చూసి, వారి రెక్కల కష్టాన్ని దోచుకుంటూ, సాటిమనిషిని అంటరానివాడివి అని కించపరచి వారి అమాయకత్వంతో ఆడుకుంటూ లక్షలు సంపాదిస్తున్నారు. విముక్తి నవల మన సమాజానికి అద్దం పట్టినట్లు ఉంది. ఈ నవల చదువుతుంటే హృదయం బాధతో బరువెక్కింది. నిన్నగాక మొన్న జరిగిన చుండూరు సంఘటన కనులముందు కదిలింది. ఇలాంటి దుర్ఘటనలు ఎక్కడో ఒక





చేట జరుగుతూనే ఉన్నాయి.

విముక్తి నవలలోని కులకర్ణి మాష్టారిలాంటి మహనీయులు వెలిగే దీపాల్లాంటివారు. చీకటిలో మగ్గిపోతున్న తమజాతిని జాగృతం చేయాలన్న విఠల్ సంకల్పం నేటి సభ్యసమాజంలో ప్రతిమనిషికీ కలగాలి. ఆ సంకల్పంవల్లనే మనిషి మనసులోని మానవత్వం చైతన్యవంతమవుతుంది. విముక్తి నవలలో విఠల్ పాత్ర చీకట్లో చిరుదీపంలాంటిదయితే ఆ దీపంలో చమురుపోసి స్ఫూర్తినిచ్చింది భారతి. ఈ నవల చదివిన ప్రతి పాఠకుడూ ఆలోచిస్తాడనటంలో సందేహంలేదు. ఆలోచింపజేసే వాస్తవ కథను అందించినందుకు ధన్యవాదాలు.

-కె.వి. రమణి,
సికింద్రాబాద్.

## ఒక జాతి జీవితం

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

**సాం**ఘికంగా... ఆర్థికంగా... మన సమాజంలో బాగా వెనుకబడివున్న ఒక జాతి జీవన విధానాన్ని..., వారి స్థితిగతుల్ని కూలంకషంగా పరిశీలించి... రాజకీయ, ధనికవర్గాల ద్వారానే కాకుండా పోలీసువ్యవస్థవలన కూడా వారు యేరకంగా వంచింపబడుతున్నారో చక్కగా విశ్లేషించిన నవల "విముక్తి".

దొంగతనాలు చేస్తూ... ఉడుతలను, పిల్లులను సైతం చంపుకుతింటూ బ్రతుకుతున్న నికృష్ట జీవులను సైతం దోచుకోటానికి సిగ్గుపడని పోలీసు, ధనికవర్గాల విధానాన్ని చదువుతుంటే యేవగింపు పుడుతోంది. నిజానికి దరిద్రులు వాళ్ళు కాదు... వీళ్ళేననిపిస్తుంది.

ఆ జాతిలోనే పుట్టినా అలాంటి నికృష్ట బ్రతుకుకు స్వస్తిచెప్పి మంచిగా బ్రతకాలనుకున్న విఠల్‌కి చుట్టూ ఉన్న సమాజంనుండే కాకుండా వారి జాతివారివలన కూడా ఎదురయ్యే సమస్యల్ని చక్కగా చూపించారు రచయిత్రి.

సంస్కరణాభిలాషియైన కులకర్ణి మాష్టారు అభ్యుదయవాదియైన భారతిలాంటివారి అండదండలతోపాటు వారు మంచిగా మారాలి అన్న పట్టుదలతో శుచి, శుభ్రతలను పాటించి విద్యావంతులైనపుడే సాటి మనుషుల ద్వారా గౌరవింపబడతారన్న రచయిత్రి ప్రతిపాదన అక్షరసత్యం!

కథనాన్ని మరీ అంత కాన్సంట్రేట్ చేసేసి సమస్య అనే మూసలో పోసిన అచ్చులా తయారుచెయ్యకుండా నవలను చక్కగా నడిపి రక్తికట్టించారు.

ఆఖరిలో ధనికవర్గానికి ప్రతినిధులైన శివరావుపాటిల్, జగన్నాథరావులాంటివారు పరివర్తన చెందటానికి అనుకూలించిన పరిస్థితులను సహజంగా చూపారు రచయిత్రి. అలాంటి పరిస్థితులు ఎదురైతేనే కానీ వాళ్ళలో మార్పు రాదా?! అనే సందేహం పాఠకులకు కలుగుతుంది!

కేవలం ప్రతికూల పరిస్థితులవలన కాకుండా ఒక మనిషిని మరో మనిషి దోచుకోవడం ఒక జాతిని వేరొక జాతి అణగద్రొక్కటం హేయమనేభావం కలిగి నైతికంగా మనిషి ఎదిగినపుడే దళితులు, దీనులు బాగుపడి సుఖంగా జీవించగలరు. ప్రభుత్వం ప్రత్యేకశ్రద్ధ తీసుకుని ప్రయత్నిస్తే మరింత చక్కని ఫలితాన్ని పొందవచ్చును.

-కోరాడ నరశింహారావు,
పార్వతీపురం.

## మరో ముందడుగు

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

**మా**నవుడు సాధించనిదంటూ ఏమీలేదు. 'కృషి ఉంటే మనుషులు ఋషులౌతారు...' కులం అనేది సామాజికంగా అంటుకున్న మురికేగాని మనిషి మేధస్సు మాత్రం మేలిమి బంగారంలాంటిది. విఠల్‌గాయక్‌వాడ్ గంజాయి వనంలో తులసి మొక్కలా కృషితో చదువుకొన్నాడు. తన చదువుకు సార్థకతగా తోటివారి అభివృద్ధికి పాటుపడాలనుకున్నాడు కాని గంధం చెట్టు చుట్టూ విషనాగులున్న మాదిరిగా దుష్టచతుష్టయం విఠల్ పనులకు



ఆటంకం కలగజేయడం చూసి సమాజాభివృద్ధి ఎలా కుంటుపడుతోందనే నిజాన్ని చక్కగా వివరించారు రచయిత్రి. ఎన్నిసార్లు హితబోధ చేసినా మూఢనమ్మకాలతో తమదారి విడిచి రాని దేశదిమ్మరులు వారి వేలితో వారి కళ్ళే పొడుచుకుంటున్నామనే సత్యాన్ని గ్రహించలేకపోయారు. భారతి విఠల్‌కు ధైర్యాన్ని అందించి సమసమాజస్థాపన కోసం తనూ పాటు పడడం, కులకర్ణి మాష్టారు విఠల్‌లాంటి ఓ మంచి మొక్కను నాటి పది మందికి నీడనిచ్చే విధంగా తీర్చిదిద్దడం ద్వారా నవలకు న్యాయంచేశారు. విద్యనే వ్యాపారంగా మార్చుతున్న ఈ రోజుల్లో అలాంటి ఉపాధ్యాయులు ఎంతమంది? దేశాభివృద్ధి అట్టడుగు వర్గాలనుండే ప్రారంభమవుతుందనే మూల సూత్రాన్ని చాటిచెప్పే నవల ఇది. కులకర్ణి మాష్టారు చెప్పిన రామాయణంలోని 'జ్ఞానదీపిక' ప్రసంగం, మానసిక రోగాలు, శాస్త్రాల గురించిన వర్ణన బాగుంది. త్రాగడానికి నీరు కరువైనప్పుడు పుతిలీ తన చనుబాలు పిండి భర్త, పిల్లల నోట్లో పోసే సంఘటన, ఆ నీటి కోసం తన నిండుప్రాణాల్ని సయితం త్యాగంచేసిన వైనం మనసును కదిలించి కన్నీళ్లు తెప్పించింది. కథనంలో కొన్ని లోటుపాట్లు ఉన్నా కొసమెరుపుగా అజయ్ మరణం, శివరావు, జగన్నాథరావులకి కనువిప్పు కలిగి జనాల ముందు తమ తప్పుల్ని ఒప్పుకొని విఠల్, భారతీలను అభినందించడంతో చక్కగా ముగించారు. ఓ వెరైటీ నవల నందించిన 'చతుర' మరో అడుగు ముందుకేసిందనే చెప్పాలి.

-అవుసలి ఆంజనేయులు
మూసాపేట.

# కనువిప్పు కావాలి

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

దేశం సాంఘికంగా, ఆర్థికంగా ఎంతో సాధిస్తున్నప్పటికీ ఒక వర్గం ఇంకా పోలీసుల ధన మదాంధుల చేతుల్లో ఏవిధంగా నలిగిపోతోందో, పుట్టిన కులం ఆధారంగా దేశదిమ్మరులను జనజీవన స్రవంతిలో కలవకుండా అగ్రవర్ణాలు ఎలా దోపిడీ చేస్తున్నారో కళ్లకు కట్టినట్లుగా చూపింది "విముక్తి" నవల. దీనుల ఆకలిని ఆసరాగా చేసుకొని తమ పబ్బం గడుపుకొనే బడాచోరులయిన పాటిల్ 'దేశ్ ముఖ్' 'జోసెకర్'ల చర్యలు ఎంత నీచంగా వున్నాయో రచయిత్రి హృద్యంగా చిత్రించారు.

వాళ్ళ జీవన రీతులని చూసి చలించిన లెక్చరర్ భారతి తన వంతు కర్తవ్యంగా వాళ్ల వికాసం కోసం కృషిచేసిన తీరు నేడు విమోచన సంఘాల పేరిట ఆర్భాటం సాగిస్తున్న అనేక సంస్థలకు కనువిప్పు కావాలి. ఏ మనిషయినా పుట్టగానే దొంగ కాడనీ, అతన్ని సమాజమే దొంగగా మార్చే తీరు విఠల్ నిరూపించాడు. స్వప్రయోజనమే ప్రాముఖ్యమనుకునే జనకళ్యాణ్ పార్టీల్లాంటివి స్వచ్ఛందంగా ప్రగతి కోసం పాటుపడే యువతను నీరు కారుస్తున్నాయని సరిగానే చెప్పారు.

దళితుల నిరక్షరాస్యతే వాళ్ల అజ్ఞానానికి, అమాయకత్వానికి కారణం గనుక ముందు వాళ్లను విద్యావంతులని చేయాల్సిన అవసరాన్ని చక్కగా నిరూపించారు రచయిత్రి. అమాయకత్వంతో నర్సింహం తన కూతుర్ని బలివ్వడం, చదువుకుంటే ఎల్లమ్మదేవికి కోపం వస్తుందిలాంటి సంఘటనలు కళ్ళు నీళ్ళు తెప్పిస్తాయి. కానీ వాళ్లను ఉద్ధరించడానికి మరో గాంధీ, శ్రీశ్రీ, అంబేద్కర్ రావాలనడం అసమగ్రంగా ఉంది. చివరికి కథను అజయ్ చావుద్వారా దేశదిమ్మరుల బతుక్కి విముక్తి చూపడం సహజంగా లేదు. ఏమయినప్పటికీ "చతుర"లో వచ్చిన మరో మంచి నవల "విముక్తి" అనడంలో సందేహంలేదు.

-కె.వి. రమణారెడ్డి,
కొత్తగూడెం.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291, Anantapur 22977.

